


కొన్నివేల సంవత్సరాలక్రిందట, శ్రావస్తి నగరాన్ని దానశీలుడనే రాజు పరిపాలిస్తుండేవాడు. ఆ చుట్టుప్రక్కల రాజులందరిలోకీ దానశీలుడే గొప్ప. ఏమంటే, లక్షలకొలది సైన్యం వుంది. దాసదాసీ జనాలకు లెక్కలేదు. ఇక ఆ రాజు ధనాగారం రత్నాలు, మొహరీలు, వజ్రాలు వైడూర్యాలు మొదలయిన అన్నిరకాల వెలలేని మణులతోనూ వెండి, బంగారు ధనరాసులతోనూ నిండివుండేది. అన్నిటినీ మించిన అదృష్టం అనుకూలవతి, అపురూపసౌందర్యరాశి ఐన 'కాంతిరేఖ' రాజుకి రాణీ కావటమే. మరో గొప్ప విషయం ఏమిటీ అంటే ఇంత ఐశ్వర్యంతో తులతూగుతున్నా ఆ రాజుకి ఏకోశానా గర్వం అనేది లేదు. బీదసాదలంటే రాజుకి ఎంతో దయ. దైవభక్తికూడా అపారం. ఇక ఆయన చేసే దాన ధర్మాలకు అంతే లేదు. 'దేహి' అని వచ్చినవాడికి 'లేదు' అనకుండా ఏదో ఒకటి ఇచ్చి పంపేవాడు. ఆ కారణంచేతనే రాజు 'దానశీలుడు' అనే తన పేరు సార్థకపరుచుకున్నాడు.

ఇలా వుండగా కొన్నాళ్ళకు ఒక పెద్ద అవాంతరం వచ్చింది. ఎంతో ఆరోగ్యంగా తిని తిరుగుతున్న రాణీ కాంతిరేఖ వున్నట్టుండి హఠాత్తుగా చనిపోయింది. రాజు కంటికిమింటికి ఏకధారగా ఏడ్చాడు. ప్రజల దుఃఖానికి అంతేలేదు. కాని ఎంత ఏడ్చీ, చనిపోయిన రాణీని తిరిగి బ్రతికించటం ఎవరివల్ల అవుతుంది?

క్రమంగా రోజులు గడుస్తున్నకొద్దీ రాజూ, ప్రజలూకూడా చనిపోయిన రాణీని








గురించి తలచటం మానివేశారు. ఇప్పుడు అందరికీ ఒకే ఒక దిగులు పట్టుకుంది. రాణీ కడుపున సంతానం కలగక ముందే చనిపోయింది. తమ రాజు తదనంతరం, రాజ్యం పరులపాలు కాకుండా వుండటానికి రాజు తిరిగి వివాహం చేసుకుని సంతానం పొందటం అవసరం. మంత్రులూ, సామంతులూ రాజుని తిరిగి వివాహం చేసుకోమన్నారు. రాజు ఒప్పుకోక తప్పిందికాదు. ఒక సుముహూర్తాన రాజు తిరిగి వివాహం చేసుకున్నాడు. కాని, దురదృష్టమేమోకాని రెండవ భార్యకూడా కొద్దిరోజులకే ఆకస్మికంగా చనిపోయింది.

ఈ వార్త ఆరాజ్యంలో ప్రజలందరి నోటాపడి క్రమంగా చుట్టుప్రక్కల రాజ్యాలకికూడా పాకిపోయింది. మంత్రులూ, సామంతులూ ఈసారికూడా రాజుని తిరిగి మూడోవివాహం చేసుకోమని వేడుకుని ఎలాగైతేనేం రాజుచేత ఒప్పించగలిగారు. కాని రాజుకి భార్య అయిన ఇల్లాలు పెళ్ళి అయిన కొద్దిరోజులకెల్లా చనిపోతూన్నదన్న వార్త విన్నతర్వాత ఏ తండ్రి చూస్తూ చూస్తూ తన బిడ్డని మృత్యుముఖంలోకి పంపటానికి ఒప్పుకోగలడు? రాజ వంశీయులుకాదు కదా, కడకు సామాన్య సంసారులు సైతం తమ పిల్లని రాజుకి యివ్వటానికి ఒప్పుకోలేదు. అయినా పట్టు విడవకుండా మంత్రులూ, సామంతులూ దేశం నలుమూలలా యింకా వెతుకుతూనే వున్నారు.

అలా వెతకగా వెతకగా కొన్నాళ్ళకు తన కుమార్తెను యివ్వటానికి ఒక పేదరాలు ఒప్పుకొన్నది. ఆ పిల్ల బీద వంశంలో పుట్టినప్పటికీ, అందచందాలలో ఏ రాకుమార్తెకూ తీసిపోలేదు. అతిరూపసౌందర్యరాశి అయిన ఆ పిల్లని చూచి మంత్రులూ, సామంతులూ ఉప్పొంగిపోయారు. వెంటనే





ఈ వార్త రాజుకి అందజేశారు. ఒక సామాన్య స్త్రీ ఈసారి తనకు రాణీ కాబోతుందని తెలిసినప్పుడు రాజు విచారించలేదు సరికదా ఎంతో సంతోషించి మంత్రులతో : "మృత్యుదేవతకి బీదలైనా ఒకటే, భాగ్యవంతులైనా ఒకటే. ఇంత ఐశ్వర్యంతో తులతూగుతున్న నా రాణులను రక్షించ కోగలిగానా? బ్రతికే యోగం వుంటే ఎవరైనా బ్రతుకుతారు. కనుక మీరు చూచి వచ్చిన ఆ స్త్రీని చేసుకోవటానికి నాకు ఎలాంటి అభ్యంతరమూ లేదు" అన్నాడు రాజు.

ఇది విన్న మంత్రులు ఉత్సాహ భరితులైనారు. మరి కొద్దిరోజులకల్లా మంచి ముహూర్తాన రాజుకీ ఆ పేదరాలి కూతురుకీ వివాహం ఏర్పాటుచేశారు.

వివాహం సలక్షణంగా జరిగే వరకూ ఎవరికీ గుండె ధైర్యంలేదు. ఎందువల్లనంటే అంతకుముందు రాజు వివాహం చేసుకున్న రాణీలు కూడా వివాహం అయిన తర్వాత ఒక వారం తిరక్కుండానే చనిపోయారు.

కాని ఈసారి అలా జరగలేదు. క్రమంగా రోజులు, నెలలు ఏ అవాంతరమూ లేకుండా









గడిచిపోయినై. అప్పటికి రాజుకీ, మంత్రులకీ, ప్రజలకీ కొంత ధైర్యం చిక్కింది.

నాటినించీ ప్రజలు— "ఈ నాల్గవ భార్యవల్లనైనా మా రాజుకి సంతానం ప్రసాదించు తండ్రీ" అని దేవుడిని ప్రార్థించసాగారు. వారి ప్రార్థన దేవుడు విన్నాడుకాబోలు, మరో నెలకల్లా రాణీగర్భవతి అయినట్టు వార్త పొక్కింది. ఈ వార్త విన్న ప్రజల సంతోషానికి మేరలేకపోయింది. ఇక రాజు, అతని పరివారం సంగతి చెప్పేదేమిటి?

క్రమంగా నవమాసాలూ నిండి, మంచి నక్షత్రాన రాణీ పద్మముఖి సుఖప్రసవమై ముగ్గురు కవలల్ని కన్నది. కాని తమ వంశోద్ధారకుడుగా ఒక పుత్రుడు పుడతాడని ఎంతగానో ఆశతో ఎదురు చూస్తున్న రాజు, పుట్టిన ఆ ముగ్గురు కవలలూ ఆడపిల్లలే అని విన్నప్పుడు, కొంత నిస్పృహ చెందకపోలేదు. అయినా, రాజు తన నిస్పృహ పైకి ఏమాత్రం కనబరచలేదు. 'నాకు ఆడపిల్లలైనా మగపిల్లలైనా వీళ్లే" అనుకొని మనస్సు సమాధానపరచుకున్నాడు. ఏమైతేనేం ఆ ముగ్గురు కవలల్నీ రాజూ, రాణీ ఎంతో అల్లారు ముద్దుగా పెంచుకుంటున్నారు.

ముగ్గురు పిల్లలకూ తలిదండ్రులు వరసగా సుహాసిని, సుభాషిణీ, సుకేశిని అని నామకరణం చేశారు. క్రమంగా ముగ్గురు పిల్లలూ, ఆ ఏటికా ఏడు పైబడినకొద్దీ, చక్కటి అందాల ఖరిణలుగా తయారవుతున్నారు. ఆ పిల్లల చక్కదనాన్ని చూచినవాళ్ళు "ఒక్కొక కుమార్తె పదిమంది కొమాళ్ళ పెట్టు" అని మెచ్చుకొనేవారు.

ఇంతటి ఆనందంలోనూ మధ్య మధ్య ఒక చిన్న అవాంతరంవచ్చి రాజునీ, రాణీనీ కంగారుపరుస్తుండేది. ముగ్గురు





పిల్లలలోనూ ఎప్పుడూ ఎవరో ఒకరు ఏదో ఒక అపాయంలో చిక్కుకోవటం మళ్ళీ ఎలాగో తప్పుకోవటం జరుగుతూ ఉండేది.

ఒకసారి సుహాసిని, తండ్రితో తోటలో షికారు చేస్తుండగా ఒక పెద్ద సర్పం ఆ పిల్లని కాటువెయ్యటానికి వచ్చింది. సమయానికి రాజు తన కత్తితో ఆ సర్పాన్ని నరికివేశాడేగాని లేకపోతే ఆ నాటితో సుహాసినికీ లోకానికీ ఋణం తీరిపోయేదే.

మరొకసారి సుభాషిణి తల్లితో నది ఒడ్డుకి షికారుకు వెళ్ళింది. అంతవరకూ ప్రశాంతంగా వున్న నది ఒక్కసారిగా పొంగి, ఒడ్డున నిలుచున్న సుభాషిణిని లోపలికి ఈడ్చుకుపోయింది. దైవానుగ్రహంవల్ల సరీగా ఆ సమయానికి ఒక పల్లెకారి అచోటికి రావటం, రాణీ కంగారు పడుతూవుండటచూచి, వాడు నదిలోదూకి ఎలాగైతేనేం సుభాషిణిని ప్రాణాలతో బైటికి తెచ్చి బ్రతికించటం జరిగింది. ఆ పల్లెకారే అటు రాకపోతే నాటితో సుభాషిణి నదీ గర్భంలో కలిసిపోయివుండును.

ఇదేవిధంగా మరొకసారి మూడవ పిల్ల సుకేశిని ఒక గండం గడిచి బైట పడింది.







అది యేమిటీ అంటే—ఒకరోజున సుభాషిణీ, సుహాసినీ, సుకేశినీ కలిసి తోటలో పూలు కోయటానికి వెళ్ళారు. ముగ్గురూ మూడు బుట్టల్లో పూలు కోసుకుని తిరిగి మేడకు బయలుదేరారు. ముందు సుభాషిణీ, ఆ పిల్లవెనక సుహాసినీ, ఆవెనక సుకేశినీ నడుస్తున్నారు. ఇంతలో ఉన్నట్టుండి సుకేశిని కెవ్వున కేకపెట్టి పడిపోయింది. మిగతా పిల్లలిద్దరూ హడిలిపోయి, తల్లిదగ్గరకు పరుగెత్తి జరిగిన సంగతి చెప్పారు. తల్లి, వాళ్ళని వెంట బెట్టుకుని సుకేశిని పడివున్న చోటికి వచ్చిచూడగా, ప్రక్కనే పూలబుట్ట, ఆ పూలలో పాకుతూవున్న ఒక మండ్రగబ్బ కనిపించినై. అప్పటికి తెలిసింది రాణికి మండ్రగబ్బ కుట్టటంవల్లనే సుకేశిని అలా పడివుంటుందని. దానిని చంపి ఆమెవెంటనే పిల్లని ఎత్తుకుని మేడకు తిరిగి వచ్చింది. ఆస్థాన వైద్యుడికి కబురంపగా, ఆయన వచ్చి ఏదోమందు వేశాడు. కొంత సేపటికి తిరిగి సుకేశిని లేచి మాటాడసాగింది.

ఇలా, లేక లేక తమకు కలిగిన ఈ ముగ్గురు పిల్లలలో ఎప్పుడూ ఎవరికో ఒకరికి ఎదో ఒక గండం రావటం చూచే సరికి రాజు మనస్సు పరి పరి విధాల పోయింది. ఆయన తహతహలాడిపోయాడు. ఉండబట్టలేక ఒక రోజున జ్యోతిష్కుణ్ణి పిలిపించి, తన కుమార్తెలు ముగ్గురి జాతకాలు చూపించాడు.

జ్యోతిష్కుడు చాలాసేపు దీర్ఘంగా ఆలోచించి తర్వాత ఏమీచెప్పకుండా పూరుకొనేసరికి రాజు ఆరాటం మరింత హెచ్చింది. "ఏదో అనుమానిస్తున్నట్టున్నారే? ఉన్నదున్నట్లు చెప్పండి! నిజం వెల్లడిస్తారనే, వుద్దేశంతోనే మిమ్మల్ని రప్పించాను." అంటూ ఆప్యాయతమాపి అన్నాడు జ్యోతిష్కుడి భుజం తట్టుతూ.





అప్పుడు జ్యోతిష్కుడు యిలా చెప్పాడు: "ఈ పిల్లలు చాల అంద చందాలతో వెలిగిపోతూ వుంటారు. ఆనాటి కానాటికీ వారి అందం వృద్ధిపొందుతుందేగాని తీసిపోదు. కాని విచారించవలసిన విషయం ఏమిటీ అంటే, వీరి ఈ అపురూప సౌందర్యమే వీరికి శత్రువవుతున్నది. వీరు పుట్టిన దగ్గిర్నుంచీ ఎప్పుడూ ఎదో ఒక గండం దాటవలసి వస్తూనే ఉండాలే..." అని ఆగాడు.



జ్యోతిష్కుడి నోటివెంట వచ్చిన ప్రతి ఒక్క మాటకి రాజు గుండె తరుక్కుపోతోంది. ఆయన కంటివెంట ఏకధారగా కన్నీరు కారటంచూచి జ్యోతిష్కుడు మధ్యలో ఆగాడు. కాని రాజు, ఎంత కష్టానికైనా ఓర్చుకుని జాతకంలోని నిజానిజాలు తెలపవలసిందని పట్టుబట్టాడు. అందుకని—"ఆగారేం? చెప్పండి" అని జ్యోతిష్కుణ్ణి హెచ్చరించాడు.

"నిజంచెప్పి మీ మనస్సు కష్టపెట్టవలసి వచ్చిందే అని విచారిస్తున్నాను" అన్నాడు జ్యోతిష్కుడు.

"ఫరవాలేదు, చెప్పండి. నా చిట్టి తల్లుల్ని నా శాయశక్తులా రక్షించుకోవటానికి ప్రయత్నిస్తాను. మీరుమాత్రం ఉన్న సంగతి దాపరికంలేకుండా చెప్పండి" అని దైన్యావస్థలో అడిగాడు రాజు.

అప్పుడు జ్యోతిష్కుడు తిరిగి యిలా చెప్పసాగాడు—

"మన అమ్మాయిలకు ఏడేళ్ళు నిండేవరకూ 'దినదిన గండం నూరేళ్లాయుస్సు' అన్నట్టుగానే వుంటుంది. కాని, ఈ ఏడేళ్ళూ, గండాలన్నీ గడిచి బైటపడ్డారంటే యిక మన అమ్మాయిలకు ఎటువంటి భయమూ లేదు. కనుక ఏడేళ్లు నిండేవరకూ పిల్లలమీ





కంటికి రెప్పలా కాపాడుకోగలిగితే మనం ధన్యులమే. ఇంతకు మించి జాతకంలో చెప్పదగ్గ విశేషం లేదు" అని ముగించాడు జ్యోతిష్కుడు.

రాజు, జ్యోతిష్కుని అనేకవిధాల సత్కరించి పంపివేశాడు. తర్వాత రాణీ దగ్గరకు వచ్చి, జ్యోతిష్కుడు చెప్పిన విషయాలన్నీ చెప్పలేక చెప్పలేక ఎలాగో మనసు విడిచి చెప్పాడు. వింటూవింటూ రాణీ స్పృహతప్పి పడిపోయింది.

దాసదాసీలు ఉపచారం చెయ్యగా కొంత సేపటికి రాణీకి స్పృహ వచ్చింది. రాజు ఆమెని ఓదారుస్తూవుండగా, పిల్లల్ని కాపాడుతున్న దాది పరుగెత్తుకుంటూవచ్చి "మన అమ్మాయిలు ముగ్గురూ స్పృహ తప్పి పడిపోయారమ్మా తోటలో" అంటూ గొల్లున ఏడ్చింది. కంగారుపడుతూనే రాణీ తోటవైపుకి పరుగెత్తింది. దాది ఆమె వెంట పడింది. ఆస్థానవైద్యుడికి కబురుపంపారు. రాజుకూడా తోటవైపుకి పరుగెత్తాడు.

[ఆ ముగ్గురు పిల్లలూ అలా స్పృహతప్పి పడిపోవటానికి కారణం ఏమిటో, అతర్వాత ఏమిజరిగిందో వచ్చేనెల 'చందమామ'లో చదవండి]









[రాజుగారి తోటలో ఆ ముగ్గురుపిల్లలూ స్పృహతప్పి పడిపోవటం, ఆ సంగతి దాదివల్ల తెలుసుకున్న రాజూ రాణీ హడలిపోతూ అక్కడికి పరుగెత్తటం, ఈలోగా ఆస్థానవైద్యుడికి కబురు వెళ్ళటం వరకూ క్రిందటిసారి చదివారు కదూ? ఆ తర్వాత ఏమి జరిగిందనుకొన్నారు?]

రాజూ, రాణీ తోటకి చేరుకునేసరికి ముగ్గురు పిల్లలూ కళా కాంతీ లేకుండా పడివున్నారు. చూడగా ఒళ్లు చల్లబడింది, శ్వాస సరిగా ఆడటంలేదు. ఇదిచూచి కంగారుపడి, 'ఇదేమిట్రా భగవంతుడా!' అని చెప్పి అమిత విచారంతో రాజూ రాణీ కొయ్యబారిపోయారు. మరి కొద్దిసేపటికి ఆస్థానవైద్యుడు వచ్చి రాజు భుజం తట్టేవరకూ వారు ఈ ప్రపంచంలోనే లేరు.

అప్పుడు ఆస్థానవైద్యుడు ఆ చుట్టు ప్రక్కల పరికించాడు. పిల్లలు పడివున్న చోటికి కొంచెం దూరంలో ఒక పండు కనిపించింది. పండుపైన అక్కడక్కడ పన్ను దిగబడ్డిన గాట్లు కనిపించినై. ఆస్థాన వైద్యుడు ఆ పండును తీసుకొని వాసన చూచి, "ఓహో, ఇదా సంగతి! ఇది విషపు పండు. దీనిని కొరకటంవల్లనే పిల్లలు యిలా పడిపోయారు" అని వెంటనే ఏదోమందు పిల్లలకి వాసన చూపించాడు. అలా చూపటంవల్ల ఆకస్మికప్రమాదం ఏమీ కలగకుండా, ఆ పిల్లలు అదేస్థితిలో నిలిచివున్నారు. తర్వాత ఆపండును దాదికి చూపుతూ—"ఈ పండు ఎక్కడిదో నీకు తెలుసా?" అని అడిగాడు.

అందుకు బదులుగా దాది యిలా చెప్పసాగింది — 'మామూలు ప్రకారం








మించి నాకు మరేమీ తెలియదండి" అని చెప్పి ఆగింది.

ఆస్థానవైద్యుడు తల ఎత్తి ఒక్కసారి చెట్టుపైకి చూచేసరికి దానిపైన ఒకగద్ద కనిపించింది. "అదుగో ఆ పాపిష్ఠి పక్షే ఈ పండు పడేసి వుంటుంది. ఇంకా చూస్తారేం, చంపండి దాన్ని" అని అరిచాడు. అక్కడ చేరినవాళ్లలో ఒకడు తన బాణంతో ఆ గద్దని కొట్టబోయేసరికి అది రివ్వున ఎగిరి, మరి కనపడకుండా పోయింది.

అమ్మాయిలను షికారుకని వెంటబెట్టుకు వచ్చానండి. కొంతసేపు అలా అలా తిప్పి చివరకి ఈ చెట్టుకిందికి వచ్చి కూర్చున్నామండి. ఇంతలోనే అమ్మాయిలు 'దాహంగా వుంది నీళ్లు తెమ్మ'ని అడిగారండి. నేను నీళ్ళు తీసుకుని తిరిగివచ్చేటంతలో పెద్దమ్మాయి, చిన్నమ్మాయి అప్పటికే స్పృహతప్పి పడిపోయి వున్నారండి. నేను సరిగ్గా వాళ్ళదగ్గిరికి వచ్చేవేళకి బుల్లిఅమ్మాయిగారు ఈ పండు కొరుకుతున్నారండి. ఏమిటా ఈపండు అని నేను చూచేటంతలో బుల్లిఅమ్మాయిగారుకూడా స్పృహతప్పి పడిపోయారండి. ఇంతకు

ఈలోగా ఆస్థానవైద్యు డిచ్చిన ఔషధం పనిచేసి, పిల్లలు ముగ్గురూ కదలసాగారు. అప్పటికిగాని అక్కడ చేరినవా రెవరికీ ప్రాణాలు కుదటబడలేదు. తర్వాత ముగ్గురు పిల్లల్నీ తీసుకుని, ఆస్థాన వైద్యునితో సహా రాజూ రాణీ తమ మేడ చేరుకున్నారు. తిరిగి ఆస్థానవైద్యుడు మరో ఔషధం యిచ్చాడు. మరి కొంతసేపటికల్లా పిల్లలు ముగ్గురూ లేచి కూచున్నారు. ఇంత జరిగినా ఆ పిల్లలు కొంచెంకూడా అలిసినట్లు కనిపించలేదు. యథాప్రకారం కలకల్లాడుతోనే వున్నారు. పిల్లలు కలకల్లాడుతూ వుండటం చూచి, రాజూ,





రాణీ, ఆస్థానవైద్యుడూకూడా ఎంతగానో సంతోషించారు.

ఈ ప్రమాదం జరిగిననాటికి పిల్లలు నాలుగేళ్ళవాళ్ళు. జ్యోతిష్కుడు చెప్పిన ప్రకారం యింకా మూడేళ్లవరకూ వాళ్లకి దినదినగండమే అని రాజు నిశ్చయించుకునే ఉన్నాడు. ఈ మూడేళ్ళు వాళ్లకి ఏ ఆపదా రాకుండా కాపాడటం ఎలాగా అని ఇప్పుడు తీవ్రంగా ఆలోచించసాగాడు.

ఒకనాడు రాజు ఒంటరిగా తోటలో షికారుచేస్తూవుండగా ఒకచోట ఒక బండ రాయి కనిపించింది. ఆ బండపైన "భూగృహం" అని వ్రాసివుండటం కనిపించేసరికి రాజు ఆ బండని తొలిగించి చూచాడు. మెట్లు కనిపించినై.

రాజు ఒక్కొక్క మెట్టే దిగి పోయిపోయి ఒక పెద్ద మహలు చేరుకున్నాడు, ఆ మహలు ఎవరు ఎప్పుడు ఎందుకు కట్టించారో రాజుకి తెలియదు. దాని గోడలన్నీ పాలరాతితో చెక్కబడి ఉన్నై. నేల అంతా పచ్చలతో తాపటం చేసివున్నది. అనేక రకాల వింతలతో, విలువైన వస్తువులతో ఆ మహలు ఎవరో గొప్ప ప్రభువు కట్టించినట్టుగా వున్నది.



రాజు ఆ మహలు అంతటా వింతగా చూచి, తిరిగి వచ్చినదారినే పైన తోటలోకి చేరుకున్నాడు. బండని మళ్లీ యథాప్రకారంగా వుంచి అక్కడ ఆ బండ వున్నట్లు తనకుతప్ప మరెవరికీ తెలియకుండా వుండేటందుకుగాను అక్షరాలు వ్రాసివున్నవైపు లోపలికి మూసి అప్పటికీ మనసుకి తృప్తి కలగక ఆ చుట్టుప్రక్కల వున్న ఆకూ అలమూ తెచ్చి కంటికి కనిపించకుండా బండ కప్పివేశాడు.

తరువాత రాజు మేడకి తిరిగివచ్చాడు. కాని తాను తోటలో చూచిన 'భూగృహం' గురించి రాణికికూడా చెప్పలేదు. ఎందు





వల్లనంటే భూగృహ రహస్యం తనకితప్ప మరో పురుగుకికూడా తెలియకూడదని రాజుకి ఆరాటం పట్టుకొన్నది. ఇప్పుడు ఇటువంటి రహస్య గృహం తలపని తలంపుగా కంటబడింది గనుక ఇక తన కుమార్తెలకి అపదలు రాకుండా చూడటానికి చేయవలసిన ఏర్పాట్లుగురించే తన దృష్టి అంతా కేంద్రీకరించాడు.

మొట్టమొదట రాజు ఒక వందమందికి మూడేళ్ళపాటు సరిపడేటంత ఆహార సామగ్రి అవీ, నమ్మకమైన సేవకుల సహాయంతో భూగృహంలోకి చేర్పించాడు. ఆ సేవకులని తిరిగి బయటికి రానివ్వకుండా అందులోనే బంధించి తాను మాత్రం తిరిగి మేడకు రోజూలాగానే చేరుకున్నాడు. తర్వాత ముగ్గురు దాసీలతో సహా తన ముగ్గురు కుమార్తెలను వెంటబెట్టుకొని తోటలోకి వెళ్లాడు. రాజు షికారుకు తీసుకు వెళుతున్నాడు అనుకున్నది రాణి. తోట చేరుకోగానే రాజు సరాసరి భూగృహ ద్వారంవద్దకు వెళ్ళి అక్కడ ఆకూ, అలమూ అవతలికి విసిరివేసి, దాని కింద ఉండే బండను తొలగించాడు. దాసీలు ఒక్కసారిగా ఆశ్చర్యపోయి






రాజు ఇంకా ఏమిచేస్తాడో అని ఆత్రంతో చూస్తున్నారు. రాజు ముందు దాసీలని పిల్లలతోసహా మెట్లుదిగి లోపల ప్రవేశించమని వాళ్ళ వెనకనే తనూ లోపలికి వెళ్లి వెంటనే ఎవళ్ళకూ తెలియకుండా బండతో తిరిగి ద్వారం మూసివేశాడు.



ఒక్కొక్క మెట్టు దిగుతున్నకొద్దీ దాసీలకు భయం జాస్తి కాసాగింది. రాజు తమనీ, తన పిల్లల్ని యిలా ఎక్కడికి ఎందుకు తీసుకుపోతున్నాడో వాళ్ళకి అర్థంకాలేదు. పోనీ అడిగి తెలుసుకుందామంటే రాజుని ప్రశ్నించేందుకు వాళ్ళకి ధైర్యం చాలలేదు. అందుచేత ప్రాణాలు అరచేతుల్లో పట్టుకొని అలా దిగుతూపోయి చివరకు మహలు చేరుకున్నారు. అంతకుముందే రాజు అక్కడ బంధించీ వుంచిన సేవకులని చూచేసరికి దాసీలకి కొంత ధైర్యం కలిగింది. ఇదంతా రాజు ఏదో ముందు ఆలోచనతోనే ఏర్పాటు చేశాడని అప్పటికి తెలిసింది వాళ్లకు.

ఆ తర్వాత రాజు అక్కడవున్న వంద మంది నౌకర్లకూ, ఆ ముగ్గురు దాసీలకూ తన ముగ్గురు పిల్లల్ని వప్పగిస్తూ యిలా చెప్పాడు—

"ఈ నా చిట్టితల్లులు ముగ్గురూ నాకు లేకలేక కలిగిన సంతానం అని మీ అందరికీ తెలుసుకదా? వాళ్ళకి యిప్పుడు నాలుగోఏడు. ఈ నాలుగేళ్ళలోనూ వాళ్లు ఎన్నో గండాలు గడిచి ఎలాగో బ్రతికి బైట పడిన సంగతికూడా మీకు తెలిసేవున్నది. జాతకరీత్యా వాళ్లకి మరో మూడు సంవత్సరాలవరకూ దినదినగండమేననీ, ఈ మూడేళ్ళూ గడిచిపోతే ఆతర్వాత వాళ్ళకి ఎటువంటి భయమూ వుండదనీ తేలింది. ఈ మూడేళ్ళపాటూ వీళ్ళను ఈ భూగృహంలో దాచి మీకు వప్పగిస్తున్నాను. ఇందులోకి మరోపురుగు రావటానికి అవ








కాశంలేదు. నా పిల్లల్ని మీరు యిక్కడ కాపాడుతున్నట్టు మీకూ నాకూ తప్ప మరెవ్వరికీ తెలియదు. రాణికయినా తెలియదు, పుట్టినప్పటినుంచీ ఈ నా పిల్లల్ని ఏదో దుష్టగ్రహం వెంటాడుతూవున్నదని నా నమ్మకం. వాళ్ళు ఈ భూగృహంలో వున్నట్లు ఆ గ్రహానికి ఏమాత్రం తెలిసినా ఎలాగో వీళ్లని తన పొట్ట బెట్టుకుంటుంది. కనుక ఈ విషయం బైటికి పొక్కకుండా చాల జాగ్రత్తగా వుండటం మీ అందరి విధి. వీళ్లు యిక్కడ వుంటున్నట్టు పిట్టకయినా తెలిసిందీ అంటే అది నావల్లనన్నా కావాలి, లేదా మీవల్లనన్నా కావాలి. నేను మాత్రం ఈ మూడు సంవత్సరాలూ ఈ విషయం ఎత్తనే ఎత్తను. అలాగే మీరూ జాగ్రత్తతో వుండి నాకు సాయపడాలి. ఇందుకు భిన్నంగా జరిగిందీ అంటేజాగ్రత్త. అలా కాక నమ్మకంగా నా తల్లుల్ని కాపాడారంటే గడవు తీరినతర్వాత మీరు కని విని యెరుగని గొప్ప బహుమతులు యిస్తాను. మీకు ఈ మూడేళ్లపాటూ కావలసిన ఆహారపదార్థాలూ అవీ అన్నీ యిక్కడే వున్నై. కనుక యింతకుముందు నా మేడలోవుండగా నా తల్లులు ఎలా సుఖంగా ఉండేవారో యిప్పుడూ అలాగే ఏ కొరత లేకుండా ఉండవచ్చు. నా చిట్టితల్లులకి మరేదైనా అవసరమని మిమ్మల్ని అడిగితే నాతో చెప్పండి, వెంటనే సమకూరుస్తాను. ఎప్పటికప్పుడు వచ్చి మీ అందరి క్షేమం కనుక్కుంటూనే వుంటాను. మరి ఇక నే వెళుదునా?" అని అడిగాడు రాజు.

ఇది వింటున్న ఆ వందమంది సేవకులూ, ముగ్గురు దాసీలూ మొట్టమొదట భయంతో తెల్లబోయి చూచినా, రాజు తీరా ఈ సందర్భంలో చెప్పదలచిన సంగతులన్నీ చెప్పి ముగించేసరికి వారందరూ ఎంతో సంతోషంగా కనిపించారు.







"మొదట మొదట మమ్మల్ని ఈ భూగృహంలోకి ఎందుకు తెచ్చారో అర్థం కాక మేము ఎంతో భయపడ్డాము. కాని యిప్పుడు నిజం తెలుసుకున్నాం. కనుక మాకు ఏవిధమైన చింతాలేదు. అమ్మాయి లను కంటికి రెప్పలా కాపాడవలెననే విషయం మీరు ప్రత్యేకించి ఇంతదూరం మాకు చెప్పాలెనా? అది మా విధి. మా ధర్మం మేము తప్పక నెరవేర్చుకుంటాము. మీరు నిశ్చింతగా వుండండి. కాని మా సందేహమల్లా ఒక్కటే—అమ్మాయిలనుయిక్కడ దాచినట్టు రాణీవారికికూడా తెలియదంటిరే? మరి యిప్పుడు మీరు ఒంటరిగా మేడకుపోతే రాణిగారు అమ్మాయిలు ఏమైనారని అడగరా?" అన్నారు.

"అదంతా నేను చూచుకుంటాను. మీరు వీళ్ళవిషయమై జాగ్రత్తపడండి" అనిచెప్పి రాజు తిరిగి తన మేడకి బయలుదేరాడు.

ఇక అక్కడ రాణీ సంగతి ఎలా వుందో చూడండి. పిల్లల్ని షికారుకని తీసుకువెళ్ళిన రాజు అప్పటికి ఎంతో సేపు అయినాకూడా తిరిగి రాకపోయే సరికి మళ్లీ ఏం ప్రమాదం వచ్చిపడిందో అని ఖంగారుపడుతూ, ఎప్పుడెప్పుడు వస్తారా అని రాణీ ఎదురుచూస్తున్నది.

ఇంతలో రాజు పెద్ద పెట్టున ఏడుస్తూ అక్కడికి చేరుకున్నాడు. షికారుకని పిల్లల్ని వెంటబెట్టుకువెళ్ళిన రాజు, వాళ్ళు లేకుండా ఒక్కడే తిరిగి రావటం, పైగా ఏడుస్తూ రావటం చూడగానే మనస్థైర్యం తప్పి, రాణీ మొదలునరికిన చెట్టులాగా కూలిపోయింది.

---

[ముగ్గురు పిల్లల్ని సురక్షితంగా భూగృహంలో ఒప్పగించి సంతోషంగా యింటిముఖం పట్టిన రాజు యిలా గుండెలు బాదుకుంటూ మేడ చేరుకోవటానికి గల అంతర్యం ఏమిటి? ఈ సమస్య వచ్చేనెల చదువుదురుగాని]








## 3

[భూగృహంలో తన ముగ్గురు కుమార్తెలను దాచి, సంతోషంతో ఇంటిముఖం పట్టిన రాజు, గుండెలు బాదుకుని పెద్దపెట్టున ఏడుస్తూ మేడ చేరుకోవటమూ, అది చూచిన రాణీ, మొదలు నరికిన చెట్టులాగా నేలకూలడమూ వరకూ క్రిందటిసారి చదివారుకదా? ఆ తరవాత—]

చుట్టూ చేరిన పరిచారకులూ, దాస దాసీలూ, రాజుని ఓదారుస్తున్నారు. మూర్ఛ పోయిన రాణికి ఉపచారాలు చేస్తున్నారు. కొంత సేపటివరకూ అక్కడ చేరిన వారిలో ఎవరి ముఖానా కళా కాంతీ లేదు. ఈలోగా ఆస్థాన వైద్యుడు వచ్చి రాణీకి ఒక ఔషధం ఇచ్చాడు. మరి కొంతసేపటి కల్లా రాణికి స్పృహ వచ్చింది. అప్పుడు రాజుకి కాస్తంత స్థిమితం చిక్కింది. తరవాత ఆస్థాన వైద్యుడు రాజుని అడిగే సరికి అయన ఇలా చెప్పసాగాడు.—

"అలవాటు చొప్పున దాసీలతోసహా పిల్లలని వెంట తీసుకొని మన తోటలో షికారుకు పోయాను. ఈ నాలుగేళ్ళలోనూ అమ్మాయిలు ఎన్నో గండాలు గడిచి బ్రతకటం కళ్ళారా చూచినవాడినే కనుక, ఎప్పటికప్పుడు ఎంతో జాగ్రత్తతో వుండటం అవసరమైంది. అందుకని, పిల్లలు యిల్లు వదలి బైటికి కదిలినప్పుడల్లా వాళ్ల వెంటనే నేనూ ఒక వందమంది సేవకులను వెంట బెట్టుకొని ఉండవలిసి వస్తున్నది. అలాగే యివాళకూడా తోటలో చుట్టూ వందమంది








సేవకులను కాపలావుంచి వాళ్ళమధ్య నేనూ, దాసీలూ అమ్మాయిలను వెయ్యి కళ్ళతో కనిపెడుతూనే వున్నాం. ఇంతలో ఒక పెద్ద సుడిగాలి వచ్చింది. ఆ సుడి గాలికి బ్రహ్మాండమైన దుమ్మురేగి మేము ఒక్క క్షణం కన్నుమూశాం. తిరిగి కన్ను తెరిచేటంతలో మూడు రాబందులు వచ్చి నా చిట్టితల్లులు ముగ్గురినీ ఎత్తుకుపోవడం కనిపించింది." అని యింకా ఏమో చెప్ప బోతుండగా రాణి 'హా' అంటూ విరుచుకు పడిపోయింది. తిరిగి పరిచారికలు ఉపచా రాలు చెయ్యసాగారు. కొంతసేపటికి రాణికి స్పృహవచ్చింది. అప్పుడు రాజు తిరిగియిలా

చెప్పుకుపోయాడు: 'ఇదంతా ఒక్క లిప్తలో జరిగిందంటే నమ్మండి. అప్పటికీ గబగబ ఆ రాబందులు ఎగిరిపోయిన దిక్కుకి నేనూ, వందమంది జనమూ, దాసీలూకూడా పరుగులెత్తాము. నడక అలవాటులేని నేను వెనకపడ్డాను. కాని, నా పరిజనముమాత్రం శరవేగంతో ఆ రాబందులు వెళ్ళిన దిక్కుగా వెంబడించారు. ఐతే, మరి కొంచెం సేపటికే, రాబందులు కంటికి కని పించకుండా మాయమైపోవటంతో నిరాశ చెంది పరివారమంతా మళ్ళు ముఖం పట్టారు. ఇదిచూచి, నాకు మరి ముందుకు అడుగుపడక ఆగిపోయాను. ఇంతలో మరి వక గొప్ప చిత్రం జరిగింది. తిరిగి వస్తూన్న నా పరివారం (ఆ వందమంది సేవకులూ, ముగ్గురు దాసీలూ) నేను చూస్తూవుండ గానే కొంతదూరం వచ్చి వచ్చి, ఒక్కసారి పక్షులుగా మారి, ఆ రాబందులు పోయిన దిక్కుగానే వాళ్లూ ఎగిరిపోయారు. ఇదంతా కళ్లబడటంతో మనస్సు వికలమైపోయింది. ఇంకెన్ని కష్టాలు అనుభవించాలో, దేవుడు నన్నింకా ఈ లోకంలో ఎందుకు అట్టే పెట్టాడో అనిపించింది'' అని ముగించి రాజు తిరిగి దుఃఖింపసాగాడు.





ఈలోగా ఈ వార్తలు చెవిని పడిన జ్యోతిష్కుడుకూడా అక్కడకు రావటం జరిగింది. జ్యోతిష్కుణ్ణి చూస్తూనే రాణి ఆయన పాదాలపైన పడి, "మీరు అనాడు అంత చెప్పినాకూడా పిల్లల్ని రక్షించుకో లేకపోయాం. నా చిట్టితల్లులు నా ఎదట లేకపోతే పోయారు. దాపరికం లేకుండా ఒక్క సంగతిచెప్పండి. కనీసం వాళ్లు ప్రాణా లతోనైనా వున్నారో లేవో తెలుసుకుంటే కాని నేను బతకను" అంటూ భోరున ఏడ్చింది. జ్యోతిష్కుడు మళ్లీ ఒకసారి పిల్లల జాతకం తెప్పించి, నిదానంగా పరిశీ లించి చూచి యిలా చెప్పాడు.—

"అమ్మా! జాతకరీత్యా పిల్లలకు ఈ యేడు ఏ విధమైన గండమూ కనపడదే! మరి, యిది ఎలా జరిగిందో నాకే బోధ పడటం లేదు. పిల్లలు ఎక్కడ వున్నారో మాత్రం ఈపళంగా చెప్పలేనుగాని, వున్న చోటమాత్రం వారు ముగ్గురూ క్షేమంగానే వున్నారు. అమ్మాయిలేకాదు, వారివెంట అండగా వెళ్లిన వందమంది పరిచారకులూ, దాసీలూకూడా సురక్షితంగానే వున్నారు. ఈ మూడేళ్ళలో వాళ్ళు ఏనాటికో ఒక నాటికి తిరిగి మామూలు రూపంతో వచ్చే



అవకాశం స్పష్టంగా కనిపిస్తోంది. కనుక దేవునిమీద భారంవేసి అటువంటి సుదినం ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూడటం కంటె మనం చేయగలిగింది ఏముంది, తల్లీ!" అని ధైర్యం చెప్పాడు.

రాజు యింతకుముందు పెద్ద పెట్టున ఏడుస్తూ రావటం, ఆతర్వాత తన విచారా నికి అనుగుణంగా అనేక విషయాలు జరి గినట్టుగానే రాణికి నచ్చచెప్పటం, అన్నీ రాజు కావాలని కల్పించినవే అని ఈ పాటికే పాఠకులు గ్రహించివుంటారు. తన ముగ్గురు కుమార్తెలూ, వాళ్లతోపాటు బయ ల్దేరిన ముగ్గురు దాసీలూ మరోవందమంది








నౌకరులూ కన్పించకుండాపోవటంచూసి రాణీ తనను ప్రశ్నిస్తే ఏమి జవాబు చెప్పటమా అని రాజు తీవ్రంగా ఆలోచించే, ఈ నాటకం కల్పించాడు.

పోనీ భూగృహంలో దాచిన సంగతి వెల్లడి చేదామా అంటే ఆ సంగతి తన కుమార్తెలను పొట్టబెట్టుకోవాలని చూస్తున్న దుష్టగ్రహం చెవిని పడుతుందేమోనని అనుమానం. ఏమైతేనేం, లేకలేక కలిగిన తన కుమార్తెలను రక్షించుకోవటానికని రాజు ఎంతో నేర్పుగా, ఎవరికీ అనుమానం కలగకుండా ఈవిధంగా పెద్ద అబద్ధం ఆడేశాడు.

రాజు ఆడిన ఈ కపట నాటకం రాణీ నమ్మింది. సిబ్బందీలు అందరూ నమ్మారు. కాని ఒకటి; తనపిల్లలు ఎక్కడో ఒకచోట ప్రాణాలతో బ్రతికేవున్నారు అని జ్యోతిష్కుడు చెప్పటంవల్ల రాణీ కొంచెం కుదుటపడింది. ఎక్కడో అక్కడ బతికి బాగావుంటే అదే పదివేలు అనుకొని మనస్సులో తృప్తిపడింది. వెంటనే సేవకులను రాజ్యంలో నాలుగు మూలలకూ పంపి బిడ్డలను వెతికి తెప్పించవలసిందని రాజును ఆదేపనిగా వేధింపజొచ్చింది. పిల్లలు భూగృహంలో వున్నారని తెలియదా రాజుకి? ఐనా, రాణీ కోరిక ప్రకారం ఆమెని తృప్తి పరచేందుకు సేవకులను దేశం నలుమూలలకి పంపక తప్పిందికాదు.

తక్షణమే రాజుగారి సేవకులు గుఱ్ఱాల మీద బయల్దేరి వెళ్లారు. కాని ప్రపంచంలో బైట మనుషులకు కనిపించేచోట వుంటేగా ఆ పిల్లలు, సేవకులకు అచూకీ దొరికేది. వాళ్ళు భూగృహంలో సురక్షితంగా ఉన్నారాయె. అందువల్ల బయల్దేరి వెళ్ళిన సేవకులు ఒక్కొక్కరే బిడ్డలు కనిపించలేదంటూ తిరిగి వచ్చేశారు. రోజులు గడిచిన కొద్దీ రాణీకి బిడ్డలగురించి ఆరాటమూ,





బెంగా హెచ్చు అవుతూ వుంది. రాజు మాత్రం తెలివిగా నాటకం ఆడి తన పిల్లల సంగతి ఎవరికీ ఏమాత్రం ఆచూకీ దొరకకుండా కట్టుబాట్లు చేశానుగదా అని మురిసిపోతున్నాడు. కాని, పైకిమాత్రం తనూ పిల్లలనుగురించి బెంగపడుతున్న వాడిలాగా లోకంకోసం దుఃఖం నటిస్తూనే వున్నాడు.

ఈలోగా రాజు ప్రతిరోజూ మూడోకంటి వానికి తెలియకుండా భూగృహంలోకి వెడుతున్నాడు వస్తున్నాడు. తన ముగ్గురు బిడ్డలూ సురక్షితంగా తను ఏర్పరచిన నౌకరుల అండన పెరుగుతూవుండటం చూచి ఫరవాలేదు కదా అని నిశ్చింతగా వున్నాడు. ఇలా ఒక వారం రోజులు గడిచినై. మళ్లీ రాజుకి యిప్పుడు మరొక పెద్ద అనుమానం పట్టుకొన్నది. ఏమిటీ అంటే: తను భూగృహంలోకి వెళ్ళి పిల్లలను చూచి వాళ్లు సురక్షితంగా వున్నారా లేదా అని తెలుసుకుంటేగాని ఒక్కరోజుకూడా నిలవలేడు. కాని మరోపురుగుకికూడా తెలియకుండా యిలా రోజూ దొంగతనంగా భూగృహంలోకి వెడుతూ వస్తూ వుండటం చాలా కష్టమైన పనిగా తోచింది. ఒకనాడు కాకపోతే ఒకనాటికైనా ఈ సంగతి ఎవరికంటనో



ఒకరికంట పడుతుంది. అది ఆనోటా ఆనోటా వెల్లడిఅయి తను ఏ దుష్టగ్రహాన్ని గురించి భయపడుతున్నాడో ఆ గ్రహానికి తెలిసిపోవచ్చు. పిల్లలజాడ తెలిసిందీ అంటే ఆ గ్రహం ఏదో విధంగా వాళ్ళని పొట్టకెట్టుకుంటుంది కాని మానదు. కనుక ఏమి చెయ్యటమా అని రాజు ఈ క్రొత్తదిగులుతో కుంగిపోసాగాడు. ఎంత ఆలోచించినా ఏమీ పాలుపోయింది కాదు. ఇలా మరి నాలుగు రోజులు గడిచినై.

ఒకనాడు — రాజు ఆ సాయంత్రమే భూగృహంలో పిల్లల్ని చూసి కొంచెంసేపటి క్రితమే వచ్చాడు. బిడ్డలు సురక్షితంగానే







వున్నారు. అందువల్ల రాజు తన శయనాగారంలో ఏ బెంగా లేకుండా నిశ్చింతగా నిద్రిస్తున్నాడు. మంచి నిద్రలో ఉండగా ఒకరాత్రివేళ ఎవరో వచ్చి తనని తట్టి లేపుతున్నట్టు అలికిడి ఐంది. కళ్ళు తెరిచి చూచాడు తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. ఎందువల్లనంటే ఆ వచ్చినది మరెవ్వరో కాదు, తన ముద్దుల కూతురు సుహాసిని! కొంతసేపటివరకూ రాజు ఇది కల అనే అనుకున్నాడు. కాని సుహాసిని పక్కపైన కూచుని, తండ్రిని ఎక్కి తొక్కుతూ, చిలిపిచేష్టలు చేస్తూ "నాన్నా, నాన్నా" అని పిలిచేసరికి రాజు ఇది ఎంత మాత్రము కలకాదు అని నిశ్చయించాడు. తన కళ్ల ఎదట తన చిట్టితల్లి సుహాసిని చిన్నారి చేష్టలు చేస్తూవుంటే, ఎలా కాదనటం? చిలకపలుకులతో తనను పిలవటం స్పష్టంగా వినబడుతూ వుండగా, ఇది కల అని ఎలా అనుకోవటం? రాజు వెంటనే లేచి తెలివి తెచ్చుకొని, సుహాసినిని గుండెలకి హత్తుకుంటూ "ఇదేమిటి తల్లీ, ఈ అర్ధరాత్రివేళ నువ్వు యిక్కడికి ఎలా వచ్చావమ్మా? ఏరీ, మన దాసీలు ఏరి? పరివారమంతా ఎక్కడ? నవుకర్లు ఏమైనారు? ఇంతమందినీ విడిచిపెట్టి నీవు ఒక్కర్తెవూ ఎలా వచ్చావు తల్లీ! చిత్రంగా వుందే" అంటూ, ఒకవంక ఆశ్చర్యంతోనూ, మరొకవంక చెప్పరాని ఆత్రంతోనూ వందలూ వేలూ ప్రశ్నలవెంబడి ప్రశ్నలు కురిపించాడు.

సుహాసిని కొంతసేపటివరకూ బదులు చెప్పలేదు. కాని తండ్రి చెయ్యిపట్టుకొని, మంచంమీదినించి క్రిందికి దిగమని సైగ చేసి, తర్వాత ఆ గదిలోవున్న ఒక పెద్ద పటం దగ్గిరికి తీసుకువెళ్లి "అదో, అబొమ్మ చూశా?" అని అడిగింది. రాజుకి ఏమీ అర్థంకాలేదు.





"నువ్వు యిక్కడకి ఎలా వచ్చావు తల్లీ అని అడుగుతుంటే పటం చూపిస్తా వేమిటమ్మా. ఆపటం నీకు కావాలంటావా? అలాంటివే కాదు, అంతకన్న మంచి మంచి పటాలు ఎన్నో యిస్తాను. నువ్వు యిక్కడి కెలావచ్చావో ముందు చెప్పుతల్లీ" అని రాజు మళ్ళీ బ్రతిమాలసాగాడు.

అప్పుడు సుహాసిని— "అదే నాన్నా, అదే ఆ పటంలోంచే వచ్చా" అన్నది పాపం, అమాయికంగా.

పటంలోంచి ఏమిటి, రావటం ఏమిటీ అని రాజు కొంతసేపు మథనపడి చివరకు పటాన్ని తొలిగించి చూచాడు. పటాన్ని గోడనించి తొలగించటంతోటే కంటపడిన దృశ్యం చూచి, రాజు కొయ్యబారి, అలాగే నిలబడిపోయాడు. ఎందువల్లనంటే పటం తీసివేసినచోట గోడలో ఒక పెద్ద ద్వారం కనిపించింది. రాజు కాసేపటికల్లా తెప్పరిలుకొని కూతురుని వెంటబెట్టుకుని ఆ ద్వారంవెంట లోపలికి పోయాడు. అలా పోగా పోగా అది ఒక సొరంగంఅని రాజు తెలుసుకున్నాడు. అందుచేత బిడ్డను నడిపించక, ఎత్తుకుని జాగ్రత్తగా అడుగులో అడుగువేసుకుంటూ సాగాడు.






సారంగంలో సగందూరం వెళ్లేసరికి సుహాసినిని పెంచేటటువంటి దాది ఎదురు వచ్చింది. సుహాసిని గదిలోంచి మాయం అయ్యేటప్పటికి దాది నిద్రలో వున్నది. కాని మరుక్షణంలోనే మెలకువ వచ్చి చూచేసరికి పక్కమీద సుహాసిని లేక పోవటం, అందుకు తగినట్టు గోడలో అదివరకు అద్దంవున్నచోట ద్వారం కనిపించటం, దాదికి హడలు పుట్టించింది. ఆమె పిల్లను వెతుక్కుంటూ తనకు తెలియకుండానే ఆ సారంగంలోకి వచ్చేసింది. పిల్లను వెంటబెట్టుకుని వస్తున్న రాజుని చూచేసరికి ఆమెకు ప్రాణం లేచివచ్చింది. ముగ్గురూ కలిసి తీరా సారంగం చివరికి వచ్చి చేరుకునేసరికి అంతకుముందు అక్కడ సుహాసిని గదిలోకి దారినిచ్చే ద్వారం కనిపించలేదు. రాజూ, దాదీకూడా హడలిపోయారు. ఒకవేళ ఈ సారంగంలో దారితప్పి వచ్చామా అని అనుమానం కలిగింది. రాజు వెంటనే సుహాసినినీ దాదినీ అక్కడే వుండమని, తను తిరిగి సారంగం చివరిదాకా పోయాడు. ఎంతదూరం పోయినా ఒక్కటేమార్గం కాని రెండు మార్గాలున్నట్టు కనిపించలేదు. సారంగం పోయి పోయి మళ్లీ రాజుగదిలోకే దారి తీసింది. అందువల్ల రాజు యిప్పుడు మరీ భయపడసాగాడు. ఏమిచెయ్యటమా అనే ఆలోచనతో తిరిగి దాది వున్నచోటికి వచ్చాడు. కాని చిత్రంలోచిత్రం! ఒక్క క్షణం క్రితం అక్కడ తను వదలి వెళ్ళిన దాదీ, కుమార్తెకూడా మాయమయ్యారు. ఇదంతా చూచి రాజుకి పిచ్చెత్తినట్లయింది. ఏమీ పాలుపోక అలా ఆ సారంగంలోనే అటూ యిటూ పచారు చెయ్యసాగాడు.

---

[రాజు అనుమానానికి తోడు, అడుగడుక్కి ఈ అవాంతరాలేమిటి? సుహాసినిగతీ, ఆమెతో కూడావుండే దాది సంగతి ఏమైంది? ఇంతకూ రాజు, వాళ్ళ జాడ కనిపెట్టగలిగాడా, లేదా?— వచ్చే నెల చదవండి]








## 4

[సారంగమార్గంద్వారా రాజు, సుహాసినిని వెంటబెట్టుకుని భూగృహానికి బయలుదేరటం, వాళ్ళకి దాది ఎదురురావటం, ఆతర్వాత వాళ్ళు దారితప్పిపోగా రాజు వాళ్ళని సారంగంలో వదిలి తిరిగి వచ్చేసరికి వాళ్ళు మాయం కావటం, అప్పుడు రాజు దారితెలియక అలా ఆ సారంగంలోనే తిరగులాడుతుండటం వరకూ క్రిందటిసారి చదివారుకదూ?]

ఇంతలోకే ఒకచోట ఒక ద్వారం కనిపించింది. అక్కడ దాదీ, సుహాసినీ కనిపించేసరికి రాజుకి ప్రాణం లేచివచ్చింది. ద్వారంగుండా లోపలికి పోయేసరికి అది తన సుహాసిని పడకగదికి చేర్చింది. ఈ వింత సారంగాన్ని గురించిన రహస్యం ఏమిటా అని చూడగా, సుహాసిని గదిగోడలకి చుట్టూ ఎక్కడా సందులేకుండా పైకప్పునించి కింద నేలవరకూ అద్దాలువున్నై. ఆ అద్దా లన్నింటిలోకీ ఒక అద్దం చాల విచిత్రమైంది. నేలమీద ఒకచోట ఒక చిన్న మీట వుంది. దానిని నొక్కితే ఆ అద్దం నేలలోకి దిగిపోయి అక్కడ ఒకద్వారం ఏర్పడుతుంది. ఆ ద్వారమే సారంగంలోకి దారితీసింది. గదిలో వున్నట్టుగానే, ద్వారం దాటగానే సారంగం మొదటిలో కూడా ఒక చిన్న మీట వున్నది. అది నొక్కితే అద్దం మామూలుగా పైకివచ్చి ద్వారం మూసుకుపోతుంది. మళ్ళీ మీట నొక్కితే అద్దం భూమిలోకి దిగిపోయి ద్వారం కనిపిస్తుంది.

ఐతే, సుహాసిని రాజుగదికి ఎలా చేరుకున్నదీ? అనే ప్రశ్న ఒకటుంది. మామూలు ప్రకారంగా దాది సుహాసినిని తన పక్కలో



పడుకోబెట్టుకుని నిద్రపోతున్నది. ఒక రాత్రివేళ సుహాసినికి మెలుకువ వచ్చింది, ఏమీతోచక గదిలో అటూ ఇటూ తిరుగుతుండగా సుహాసిని కాలు అక్కడ నేలమీద వున్న మీటపైన పడింది. వెంటనే అద్దం భూమిలోకి దిగిపోవటం అక్కడ ద్వారం తెరుచుకోవటం జరిగింది. ఈ వింత చూచి సుహాసిని సొరంగంలో ప్రవేశించి నడవగా, అది చివరికి రాజు శయనాగారంలో పటం వెనుకకు చేర్చింది. చీకటిగా వుండటంచేత అక్కడివరకే సొరంగం ఉన్నదనీ, అది దాటి మరొక్క అడుగువేస్తే అక్కడ పటం వుందనీ సుహాసినికి తెలియలేదు. ఇంకా పోదామని ముందుకు నెట్టుకుపోయే సరికి పటం సందిచ్చి, ఆ సందులోంచి నిద్రిస్తున్నరాజు కనిపించాడు ఆమెకు. తక్షణమే సుహాసిని తండ్రివద్దకు పోవాలనే ఆత్రంతో ఎన్నో శ్రమలుపడి బ్రహ్మాండమైన ఆ పటాన్ని ఒత్తిగించింది. ఆ తరవాత రాజు ఈ వింతసొరంగంలో ఎలా చిక్కుకొనే తిరుగులాడ జొచ్చాడో మీరు చదివేవున్నారు.

ఈ విధంగా వింతసొరంగంయొక్క రహస్యమార్గం గురించి తెలుసుకున్న






తర్వాత రాజుకి ఒకవంక సంతోషమూ మరోవంక భయమూకూడా కలిగినై. ఎవళ్లకంటా పడకుండా ఎలాగో భయపడుతూ భయపడుతూ రాజు ఈనాటివరకూ తోటలోనించి భూగృహానికి వస్తూ పోతూ వున్నాడు. ఇప్పుడు ఈ సొరంగ రహస్యం తెలియటంవల్ల ఆ భయం తీరిపోయింది. యిష్టంవచ్చినప్పుడల్లా తన గదినించి బ్రహ్మ రుద్రులకు తెలియకుండా భూగృహంలోకి వచ్చి తన పిల్లల్ని చూచుకోవచ్చు. ఈ అదృష్టానికి రాజు ఉప్పొంగిపోయాడు.

కాని ఇప్పుడు రాజుకి మరొక భయం పట్టుకుంది. తగిన కట్టుబాటు చెయ్యక పోతే యిప్పటిలాగే యికముందుకూడా సుహాసినిగానీ, మిగతా పిల్లలుగానీ ఈ సొరంగంలోనించి తనగది చేరుకోవటం, అక్కడనించి బైటి ప్రపంచంలోకి రావటం జరగవచ్చు. అంతటితో తన జాగ్రత్త ఎందుకూ పనికిరాకుండా పోయి పిల్లలు దక్కకుండా పోవచ్చు. అలా జరగకుండా వుండటానికి ఉపాయమేమిటా అని రాజు అదేపనిగా ఆలోచించసాగాడు. చివరికి ఒక ఉపాయం తట్టింది. అది యేమిటీ అంటే:




ఇంతకుముందు తన ముగ్గురు కుమార్తెలకు భూగృహంలో మూడు గదులు విడివిడిగా ఏర్పాటుచేసి ఒక్కొక్కరిని ఒక్కొక్కదాది సంరక్షణలోవుంచాడు. కాని ఇకమీదట ఈ మీట వున్నగదిలో ఎవరు సంచరించినా, తను తలచినట్టుగా ప్రమాదాలు కలగవచ్చుననే వుద్దేశంతో ఆ గది ఖాళీగా ఉంచటానికే రాజు నిశ్చయించాడు. తన ముగ్గురు కుమార్తెలను తక్కిన రెండు గదులలోనే వుంచి కాపాడుతుండమని దాదులను హెచ్చరించాడు. వాళ్ళు అలాగే అన్నారు. అప్పటికి రాజు మనసు కుదుటబడింది. కొంతసేపు ముగ్గురు








కుమార్తెలతోనూ ముచ్చటలాడి, తర్వాత ఇంతకుముందు సుహాసిని వుంటున్న అద్దాల గదిలోకి వచ్చాడు. మీటమీద కాలువేసేసరికి అద్దం భూమిలోకి దిగిపోయి ద్వారం ఏర్పడింది. ద్వారంగుండా సొరంగంలోకి వచ్చి తిరిగి అక్కడవున్న మీట కాలితో నొక్కేసరికి మళ్ళీ ద్వారం మూసుకున్నది.

ఈ రహస్యమార్గం వున్నట్టు ఎలాగో తనకు తెలియజేసిన దేవుడికి నమస్కరిస్తూ రాజు సంతోషంగా తిరిగి తనగదిలోకివచ్చి చేరుకున్నాడు.

* * *

ఆనాటినించీ రాజు భూగృహంలోకి ఎన్నోసార్లు ధైర్యంగా వెళ్ళి వస్తూవున్నాడు. క్రమంగా రోజులు గడుస్తున్నయ్. కాని తండ్రి తమని చూడటానికి వచ్చినప్పుడల్లా రాకుమార్తెలు ముగ్గురూ, తండ్రి కాళ్ళని చుట్టేసుకుని "మేముకూడా నీతో వస్తాం నాన్నా" అని జాలిగా అడిగేవాళ్లు.

కాని వాళ్ళను తనతో తీసుకువెళ్ళగల ధైర్యంలేదు రాజుకి. అందుకని "ఇప్పుడు కాదమ్మా, మరొకసారి తీసుకువెడతాలే" అని సమాధానపరుస్తుండేవాడు.

క్రమంగా నెలలు దొర్లిపోతున్నై. ముగ్గురు కుమార్తెలూ సురక్షితంగా పెరుగుతున్నందుకు రాజు మురిసిపోతున్నాడు. కాని అక్కడ రాణీ, ఒక్కొకరోజు గడిచిన కొద్దీ బెంగతో కృంగి కృశించి పోతున్నది. ఏమంటే పిల్లల్ని వెతుక్కుంటూ వెళ్లిన నౌకర్లలో చాలమంది తెల్లమొగం వేసుకుని తిరిగి వచ్చేశారు. మధ్య మధ్య రాణీ జ్యోతిష్కుణ్ణి పిలిపించి— "స్వామీ పిల్లలు క్షేమంగా వున్నట్టేనా?" అని అడుగుతుండేది.

"వున్నారమ్మా. పిల్లలేకాదు, వాళ్ళని వెతుకబోయిన ఆ వందమంది నౌకర్లు,





పిల్లలవెంట వెళ్ళిన దాసీలూకూడా క్షేమంగానే వున్నారు. మీరేమీ దిగులుపడకండి. కొద్దిరోజుల్లో అందరూ క్షేమంగా తిరిగి వచ్చే సూచనలు జాతకంలో స్పష్టంగా కనిపిస్తున్నయ్" అని చెబుతుండేవాడు జ్యోతిష్కుడు. అలా చెప్పినపుడు మనస్సులో తృప్తిపడి కొద్దిరోజులవరకూ రాణీ మళ్లీ నిశ్చింతగా వుండేది.

ఈవిధంగా మరి రెండు సంవత్సరాలు గడిచినై. భూగృహంలోకి రహస్య సొరంగంద్వారా రాజు రోజూ వెళ్లి కుమార్తెలను చూచివస్తున్నాడు. బిడ్డలుముగ్గురూ సురక్షితంగానే వున్నారు. కాని రాజు భూగృహంలోకి వెళ్ళినప్పుడల్లా పిల్లలు తమని బయటికి తీసుకు వెళ్ళమని గోలచేస్తూనే వున్నారు. "మమ్మల్ని యిక్కడ ఎందుకు వుంచావు నాన్నా? అమ్మని చూడాలి. అమ్మ దగ్గిరికి తీసికెళ్లూ..." అని ఏడుస్తూ తండ్రి కాళ్ళు చుట్టేసుకునేవారు. వాళ్ళు అలా కన్నీరు కారుస్తూ వుండటం చూచినప్పుడల్లా రాజు గుండె తరుక్కుపోయేది. "పోనీ ఒక్కసారి తీసుకపోయి పిల్లల్ని రాణీకి చూపించుదామా?" అనిపించేది. కాని అలా చేయుటానికి ధైర్యంచాలేది



కాదు. 'ఏమైనాసరే ఈ ఒక్క యేడూ విచలించకూడదు' అని నిశ్చయించుకున్నాడు. అందుచేతనే పిల్లలు ఎంత ఏడ్చినా, ఏదోవిధంగా వాళ్ళని సముదాయించుకొంటూ కాలం వెళ్ళతోస్తున్నాడు.

ఇలా మరికొన్నాళ్లు గడిచింది. మరొక్క నాలుగు రోజులకల్లా పిల్లలకు ఏడేళ్ళూ నిండుతై. అనాటికి గండాలు గడిచి వాళ్లు భూగృహంనించి విడుదల కావచ్చు. "ఇప్పటివరకూ ఈ మూడుసంవత్సరాలలో పిల్లలకి ఏవిధమైన ఆపదా రాకుండా భూగృహంలో సురక్షితంగా కాపాడగలిగానే, ఇక నేముంది. నాలుగురోజులు కాస్త





జాగ్రత్తగా వుంటే నాలుగేళ్ళూ నిండుతై. జాతకరీత్యా నా బిడ్డలు ప్రమాదంలేకుండా బ్రతికి బయటపడతారు" అనుకొన్నాడు.

యథా ప్రకారం రాజు ఒకనాటి ఉదయాన్నే రహస్యమార్గంద్వారా పిల్లల్ని చూడటానికి వచ్చాడు. బిడ్డలు భూగృహంలో ఉండవలసిన గడువు ఆనాటితో తీరిపోతుంది. పిల్లలు తండ్రిని చూడటంతోనే కాళ్ళకి చుట్టేసుకుని "ఈ వేళ మమ్మల్ని బైటికి తీసుకువెడితేకాని వీల్లేదు" అని పట్టుబట్టి మారం చేస్తూ కూచున్నారు. బిడ్డల దుఃఖం చూచి రాజు మనస్సు కరిగిపోయింది. "ఈ మూడు సంవత్సరాలూ ఏ ఆపదో రాలేదుకదా? ఇంకొక్క ఇరవైనాలుగు గంటలలో ఏమి రాబోతుంది? పైగా, ఇంతమంది పరివారం కాపుదలవుండగా అలాంటిది ఎలా జరుగుతుంది?" అని మనస్సుకు ధైర్యం తెచ్చుకుని, పిల్లలు ముగ్గురనూ వందమంది నౌకర్లూ, ముగ్గురు దాసిలతోసహా భూగృహంలోంచి తోటలోకి తీసుకవచ్చాడు. ముగ్గురు పిల్లల్నీ దాసీలకి వప్పగించి తనూ వాళ్ళదగ్గిరే కూచున్నాడు. వందమంది నౌకర్లూ చుట్టూతా కాపలా వున్నారు. ఇన్నాళ్ళకు మళ్లీ బయటి ప్రపంచం చూడగానే పిల్లలు ఎంతో సంతోషంగా గంతులు వేస్తూ ఆడుకుంటున్నారు. వాళ్ళ ఆటలు చూచి రాజు ఎంతో మురిసిపోతున్నాడు.

ఇంతలో ఉన్నట్టుండి ఒక్కసారిగా బ్రహ్మాండమైన సుడిగాలి వచ్చింది. ఆ ప్రదేశమంతా దుమ్ముతో నిండింది. అక్కడ ఉన్నవాళ్ళంతా ఒక్కక్షణం కన్ను మూశారు. మళ్లీ కళ్లు తెరిచేసరికి మూడు గద్దలు వచ్చి ముగ్గురు పిల్లల్నీ ఎత్తుకపోవటం మాత్రం కనపడింది వాళ్లకు. రాజు స్మృతి తప్పి పడిపోయాడు. దాదులు రాజుకి పరిచర్య చేస్తున్నారు.





నౌకర్లు వందమందీ ఆ గద్దలు పోయిన వైపుకి పరుగెత్తారు.

రాజుకి స్పృహ వచ్చి "నవుకర్లుఏరీ ?" అని అడిగేటప్పటికి, సరిగా అప్పుడే వాళ్లు ఒకరివెంట ఒకళ్లు తెల్లమొగాలు వేసికొని తిరిగి రావటం జరిగింది.

సరీగా మూడుసంవత్సరాల క్రిందట రాజు ఏ కల్పితవాక్కులు పలికి కపట నాటకం ఆడాడో అది ఈనాడు అక్షరాలా తన కళ్లఎదట జరిగేసరికి రాజు తనని తాను తిట్టుకున్నాడు.

"ఈనాడు యిలా జరగవలసి వున్నది గనుకనే ఆనాడు ఏవో దుష్టగ్రహం నాలో ప్రవేశించి నాచేత అటువంటి అశుభ వాక్కు పలికించింది. అందుకనే 'నుదుట వ్రాయనిదే నోట పలికించ'దని అంటారు పెద్దలు" అనుకొంటూ రాజు కంటికి మింటికి ఏకధారగా దుఃఖించసాగాడు. ఐతే విధివిలాసము ఎలా ఉన్నదో ఆప్రకారమే జరిగింవి. నిజానికి, అతీతమైన శక్తి యేదో ప్రేరేపించటంవల్లనే రాజుకి మనస్సు యొక్క కట్టుదిట్టం తప్పి, బిడ్డలను తోట లోకి తీసుకపోదామనే బుద్ధిపుట్టింది. జరగ వలసిన ప్రమాదమేమో జరిగింది. తీరా యిప్పుడు చేతులు కాలినతర్వాత ఆకులు పట్టుకొందామనుకుంటే ఏమి లాభం ?

ఇకనిప్పుడు రాణీదగ్గిర ఈ విషయం దాచవలసిన పని యేముందీ? రాజు పరివారంతోసహా మహలు చేరుకుని, చెప్పలేక చెప్పలేక ఈ వైనం రాణితో చెప్పాడు. ఇంకేమున్నది, రాజూ రాణీకూడా దుఃఖ సముద్రంలో మునిగిపోయారు.

---

[ఇటువంటి కఠోరవార్త విన్నతర్వాత రాణీ యిదివరకులాగే ఈసారికూడా బ్రతికిందా? గద్దలు తన్నుకుపోయిన ఆ ముగ్గురు పిల్లలూ ఏమయారు? ఈవిషయాలు వచ్చేనెల చదవండి.]









## 5

[ఏవిధమైన ఆపదా రాకుండా మూడేండ్లపాటు ఎంతో జాగ్రత్తగా కాపాడుతూవచ్చికూడా, చివరకు కొద్ది తొందరపాటువల్ల రాజు తన ముగ్గురు కుమార్తెలనూ ఎలా పోగొట్టుకున్నదీ కిందటినెల చదివారు కదూ? ఆ తర్వాత ఏమి జరిగిందో చదవండి.]

ఈ కఠోరవార్త వినీ వినటంతోటే రాణి కొయ్యబారిపోయింది. పిల్లలతోబాటు రాణీ కూడా తనకు దక్కకుండా పోతుందేమోనని రాజు భయపడ్డాడు.

"మూడేండ్లూ మొండికేసినట్టుగానే ఈ ఒక్కరోజుకూడా పిల్లల్ని ఎలాగో సమాధానపరచ గలిగితే ఈ ముప్పు రాకపోయి వుండును గదా? పాపిష్టివాడిని, ఆపాటి నిబ్బరంలేక, చూస్తూ చూస్తూ చేతులార నా చిట్టితల్లుల్ని పక్షులకు వప్పగించుకొన్నాను. నా రాణీకూడా నాకు దక్కదా?" అంటూ రాజు మొత్తుకొన్నాడు. అక్కడ ఒకళ్ల ముఖానా కత్తివాటు వేస్తే నెత్తురు చుక్క లేదు. గంటలు గడచినా రాణీకి తిరిగి స్పృహ రాకపోయేసరికి, ఆమె బ్రతికే యెత్తు లేదని అందరూ నిరాశచెందారు.

మరి కొద్దిసేపటికల్లా ఆస్థానవైద్యుడు అక్కడికి వచ్చాడు. రకరకాల ఓషధులు యిచ్చి ఎలాగైతేనేం చివరకు రాణీకి స్పృహ తెప్పించాడు. తిరిగి అందరి ముఖాలలో క్షణమాత్రం ఆనందం తొణికిసలాడింది. కాని ఆ సంతోషం అట్టే సేపు నిలవలేదు. రాణీకి స్పృహ అయితే వచ్చిందికాని, ఈసారి తగిలిన దెబ్బతో ఆమె మతి పూర్తిగా చలించిపోయింది—"ఏరీ నా చిట్టితల్లులు? ఎక్కడ దాచారో







చెప్పండి" అంటూ పిచ్చి పిచ్చిగా మాట్లాడసాగింది.

"ఇంకా నీదగ్గిర నేను మర్మం పెడతానా? నామాట నమ్ము. పిల్లల్ని ఎక్కడా దాచలేదు. గద్దలు తన్నుకుపోయినై. నా మాట నమ్మకం లేకపోతే అదుగో, సేవకులున్నారు వాళ్ళని అడిగిచూడు" అని దీనంగా అన్నాడు రాజు.

కాని ఏమిచెప్పినా రాణీ అర్థంచేసికోగల స్థితిలో లేదు. "మీరంతా ఒకటే. మీతో నాకేంపని? నా పిల్లల్ని వెతికి నేనే తెచ్చుకొంటాను. నన్ను పోనివ్వండి" అంటూ లేచి పోబోయింది.

గోరుచుట్టుపైన రోకటిపోటన్నట్టు ఈ క్రొత్త అవాంతరం చూచి రాజుకి ఏమీ పాలుపోయిందికాదు. "ఈమె మనస్సు కుదుటబరచలేరా?" అన్నట్టు ఎంతో జాలి గొలిపేట్టు చూశాడు ఆస్థానవైద్యుడివంక.

ఆయన బాగా ఆలోచించి వెంటనే ఒక ఔషధం ఇచ్చాడు. ఆ మోతాదుతో రాణీ నోరు మెదపటం మానివేసి ఒక శిలాప్రతిమలా వుండిపోయింది.

తరువాత ఆస్థానవైద్యుడు రాజుని ప్రక్కకు పిలిచి—"రాజా! ఇప్పుడు అమ్మాజీవారికి శరీరబాధ యేమీ లేదు. చిక్కు యావత్తూ మానసిక సంబంధమైనదే. అందుకుగాను మనం చేయవలసినదల్లా చిరంజీవులను పట్టితెచ్చి ఆమె యెదట పెట్టడం. ఎంత త్వరలో మనం ఈ పని చేయగలిగితే అంత చప్పున రాణీవారు తేరుకొంటారు. కనుక, ఇతర చింతలుమాని, ముందు ఎలా ఐనా మన ముద్దుబిడ్డలను వెతికిపట్టి అమ్మాజీవారి ఎదటపెట్టటానికి ప్రయత్నించాలి. ఈ ఒక్క పనిలో తాము చేయగలిగినదంతా చేయించండి. రాణీవారి ఆరోగ్యాన్ని గురించి నేను చూచుకొంటాను" అని ధైర్యం చెప్పాడు.





"అలాగే చేదాం. ఇందునుగురించి ఇప్పుడే చాటింపు వేయిస్తా. మీరుమాత్రం రాణీని కనిపెట్టి వుండండి" అని మళ్ళీ వేడుకున్నాడు రాజు.

ఆప్రకారం రాజు తన యావత్తు సిబ్బందినీ మరిఒకసారి దేశం నలుమూలలకూ పంపించాడు. బిడ్డలజాడ తెలుసుకువచ్చిన వారికి తనరాజ్యం యిస్తాననికూడా చాటింపించాడు.

*  *  *

వారాలూ, నెలలూ గడిచినై. కాని పిల్లల్ని వెతకబోయిన సిబ్బందిలో ఒక్కరూ తిరిగి రాలేదు. చాటింపు విని ఒక్క సమర్థుడు కూడా ముందుకురాలేదు. ఇదంతాచూడగా రాజుకీ మతి చలించేలాగ కనుపించింది. అక్కడ చూడబోతే రాణీపరిస్థితిలో కూడా మార్పు ఏమీ కానరాలేదు.

ఒకనాటి తెల్లవారగట్ల రాజు మూడో అంతస్థుపైన పచారు చేస్తున్నాడు. అమసక వెలుగులో దూరాన, మూడు స్వరూపాలు తన మహలువైపు వస్తుండటం కనిపించింది. వాళ్లు ముగ్గురుపిల్లలు. సమానమైన ఎత్తూలావూ కలిగి, అల్లంతదూరానవున్నా ముగ్గురూ ఒకే అచ్చులో పోసినట్టున్నారు.






వాళ్లు తన కుమార్తెలే అయివుంటారనుకుని రాజు ఎంతో ఆశతో గబ గబ దిగివచ్చి, వాళ్ళవైపు పరుగెత్తాడు. తీరా దగ్గరకు వెళ్లేసరికి ఆముగ్గురూ మగపిల్లలని తెలిసింది. అయినా వాళ్ల ముగ్గురిలో వుండే ఒకేవిధమైన పోలిక చూచి రాజుకి మనసులో ఒక చిత్రమైన అనుమానం కలిగింది.

"ఒకవేళ నా కుమార్తెలే, ఆ దుష్ట గ్రహాల మాయవల్ల యిలా మగ పిల్లలుగా మారిపోయి వుండరుకద!" అనుకుని వాళ్ల వంక పరీక్షగా చూడసాగాడు.

ఆశతో, నిరాశతో క్షణక్షణానికి రక రకాలుగా మారుతున్న రాజు ముఖలక్షణాలను



గమనిస్తూ ఆ ముగ్గురు పిల్లలలో ఒకడు ఆయనకేసి విస్తుపోయి చూడసాగాడు. చివరికి రాజు ఉండబట్టలేక "మీరెవరు నాయనా? మీదేవూరు? యిలా ఎందుకు వచ్చారు?" అని వేగిరపాటుతో, ప్రశ్నల వెంబడి ప్రశ్నలు అడిగాడు.

తమని ప్రశ్నిస్తున్నది రాజైవుంటాడని ఆ కుర్రవాళ్ళు గ్రహించలేక పోయారు. ఎందువల్లనంటే ఒంటికి సరియైన దుస్తులా లేవు. పైగా ఆయన ముఖంలో కళా కాంతి లేదు. కావటానికి రాజే అయినా, ఆ నిమిషాన రాజు ఒక సామాన్య మానవునిలాగనే వున్నాడు. ఎవరైనప్పటికీ, అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పాలికదా! అందుకని కుర్రవాళ్లు—"యిక్కడికి దక్షిణాన వుండే భద్రపురి మావూరు. మీ రాజావారి సాటింపు విని వచ్చాం" అన్నారు.

"ఓహో! అలాగనా. అయితే పదండి. నాకూ అక్కడ పనివుంది. మిమ్మల్ని రాజుగారి దగ్గరకు తీసుకువెళ్ళగల" నంటూ రాజు వాళ్ళని వెంటబెట్టుకుని మహలు చేరుకున్నాడు.

తర్వాత ఆయన వాళ్ళ ముగ్గురిని కుర్చీలలో కూర్చోపెట్టి తాను తన సింహాసనం





అలంకరించాడు. "అబ్బాయిలూ! మీకు రాజుతో పని వున్నదన్నారుకదూ!" అంటూ ప్రక్కనున్న కిరీటాన్ని తలపైనధరించాడు.

ఇదిచూచి ఆ కుర్రవాళ్ళలో ఒకతను "ఆ! తమరేనా రాజావారు?" అని ఆశ్చర్యపోయి లేచి నమస్కరించాడు. వెంటనే మిగతా యిద్దరుకూడా లేచి నిలబడి నమస్కరించారు. "ఔను, నాయనా! మీరు చూడవచ్చిన ఆ దురదృష్టపు రాజు నేనే. నన్ను గుర్తించలేకపోవటంలో మీ తప్పులేదు. నా పరిస్థితి అలా వున్నది. దానికేం గాని, మీ చరిత్ర చెప్పండి ముందు" అని ఆత్రంతో అడిగాడు.

అప్పుడు ఆ కుర్రవాడు యిలా చెప్ప సాగాడు—"మహారాజా! మేము భద్ర పురిలో నివసించే ఒక పేదరాలి కుమాళ్లం. నాపేరు వెలుగు; ఇతనిపేరు చీకటి; అతని పేరు సంధ్య" అని తక్కిన యిద్దరివైపు చూపాడు.

రాజుకి ఆశ్చర్యంతోపాటు నవ్వు వచ్చింది—"యేమిటీ! - మీపేర్లు సంధ్యా, చీకటీ, వెలుగూనా? చిత్రంగా వున్నయ్యే! ఇటువంటి పేర్లు పెట్టుకోడానికి ఏమైనా కారణముందా?" అని అడిగాడు.



అందుకు వెలుగు యిలా చెప్పాడు—"అయ్యా! మేము ముగ్గురం మా తల్లి కడుపున ఒకేరోజున కొద్ది గంటల తేడాలో పుట్టాము. యితను సంధ్యవేళ పుట్టాడు. ఆ తరవాత అతను అర్ధరాత్రివేళ పుట్టాడు. ఆ తరవాత నేను సూర్యోదయమప్పుడు పుట్టాను. ముగ్గురం ఒకేఅచ్చులో పోసినట్లువుండటంచూచి మా తల్లి మాకు ఏమి పేర్లు పెట్టితే బాగుండునా అని ఎంతో ఆలోచించిందట. చివరికి మేము పుట్టిన వేళలకు తగినట్టుగా మాపేర్లు యిలా సంధ్య అనీ, చీకటి అనీ, వెలుగు అనీ పెట్టిందట" అన్నాడు.







"భేష్! బాగావుంది. అయితే మీరు ముగ్గురూ కవలలన్నమాట! ఎంత చిత్రం! నాచిట్టి తల్లులూ కవలలే. కవలల్ని పట్టటానికి కవలలు వెతుక రావటం కేవలం దైవనిర్ణయంగా వున్నదే" అంటూ రాజు ఆ కుఱ్ఱవాళ్ళని తనదగ్గిర కూచో పెట్టుకుని, "అయితే, మీరు యిలా బయలుదేరినట్లు మీ అమ్మగారికి తెలుసునా?" అని అడిగాడు.

"తెలియకేం? మాతల్లికి చెప్పకుండా మేము ఏపనీ చెయ్యము. ఆమె యిష్ట పడిన మీదటే మేము యిలా బయలుదేరి వచ్చాము. పోతే, యింటివద్ద వృద్ధురాలైన మా తల్లిని వదిలి మేము ముగ్గురమూ వచ్చేస్తే ఎలాగ అని మీరడగవచ్చు. దానికీ కారణం వున్నది. మేము పుట్టిన వేళా విశేషమేమోకానీ సంధ్యవేళ పుట్టినతను ఎక్కువ వెలుగుకానీ, చీకటి గానీ చూడ లేడు. సూర్యాస్తమయం అయినదగ్గర నుంచీ, దాదాపు బాగా చీకటి పడేటంత వరకు మాత్రమే యితను నిర్భయంగా సంచరించగలడు. ఇతనిచూపు అంతవరకే. ఈలోపునగానీ ఆపైనగానీ అతను అంధుడి క్రిందనే లెక్క. ఆతర్వాత వాని విషయం వినండి. ఇతను వెలుతురనేది ఏమాత్రమూ సహించలేడు. అందువల్ల చీకటి రాత్రులు ఇతనికి అనుకూలం. చివరికి నా సంగతి: నాకు పూర్తి వెలుగు కావాలి. బాగా తెల్లవారితేగాని బయటికి రాలేను. తిరిగి సూర్యాస్తమయం ఆయేవేళకే యిల్లు చేరుకోవాలి. మా యీ వింతస్వభావాలను ఆధారం చేసికొనే ఇప్పుడు మేముముగ్గురం ఇక్కడకు రావటానికి సాహసించగలిగాము. తరవాత - రాకొమార్తెలను వెతికి తీసుకురావటం అనేది అంత తేలికైన పని కాదని మాకుతెలుసు. ఈపని సాధించటం మాముగ్గురిలో ఏ ఒక్కరివల్లా కాదనీ తెలుసు. ఐతే, రోజు ఇరవైనాలుగ్గంటల

లోనూ ముల్ల్రప్రొద్దులా ముగ్గురమూ ఎటు వంటి పనినైనా చక్కబెట్టటానికి సమర్థుల మయి వుండటంచేత, ఇప్పుడు ఈ అన్వేషణ కార్యములో ముగ్గురమూ కష్టపడి రోజూ ఒక్కొకవేళలో ఒక్కొకళ్ళము మా పనులు మేము చేసికొన్నట్టయితే మాకు అసాధ్యమనేది ఉండనే ఉండదు. ఏకార్యమైనా తప్పక జయించుకు రాగలము. ఈ కారణంచేతనే మా తల్లిని ఒంటిపాటుగా వదిలి, ఇప్పుడు ముగ్గురమూ కలిసి బయలేరవలసి వచ్చింది" అని చెప్పాడు.



అందుకు రాజు, "నీవు చెప్పినది చాలా బాగుంది. మీ తల్లిని గురించి మీకు ఏవిధమైన చింతా అక్కరలేదు. ఇప్పుడే ఆమెను రప్పించుతాను. మాతో పాటు మహలులో వుంటారు" అన్నాడు.

"మాకదే పదివేలు" అన్నారు కుర్రవాళ్ళు ముగ్గురూ ఏకకంఠంతో. ఉన్న పాటుగా రాజు తన సేవకుల్ని భద్రపురికి పంపి ఆ కుర్రవాళ్ళ తల్లిని రప్పించాడు. రాజుచూపిన ఈ ఔదార్యానికి ఆమెకూడా ఎంతో మురిసిపోయింది.

రాజు ఆ వృద్ధురాలితో — "అమ్మా! కుర్రవాళ్ళవల్ల మీ వంశచరిత్ర తెలుసుకున్నాను. యిలాటి ధైర్యసాహసాలుగల కపలబిడ్డలను కన్ననీవు ధన్యురాలివి తల్లీ!" అంటూ, ఆమెపట్ల తనకుగల భక్తివిశ్వాసాలను వెల్లడించాడు.

ఆమె అనుమతిపొంది, రాజు కుర్రవాళ్ల పేర్లు కొద్దిగా మార్చి, సంధ్యాకుమారుడు, నిశీథుడు, ఉదయనుడు అని పిలవ జొచ్చాడు. కుర్రవాళ్లూ, తల్లీకూడా ఇందుకు ఎంతో సంతోషించారు.

మరునాడే రాజు కుర్రవాళ్ళకి ఒకటో రకమైన కత్తులూ, కఠార్లూ యిచ్చి వాళ్లకు తలకొక గుర్రాన్నీ ఏర్పాటు చేయటానికని అశ్వశాలకు తీసుకవెళ్ళాడు.





ఆ కుఱ్ఱవాళ్ళ పేర్లకు తగినట్టు రాజు, ఉదయనుడికి సూర్యకాంతిలా ధగ ధగ మెరిసే తెల్లటి గుఱ్ఱాన్నీ, నిశీధుడికి నిగనిగలాడే నల్లటి గుఱ్ఱాన్నీ, సంధ్యాకుమారుడికి ఎఱ్ఱని గుఱ్ఱాన్నీ యిచ్చాడు.

ఒక సుముహూర్తాన తెల్ల గుఱ్ఱంపైన ఉదయనుడూ, నల్లగుఱ్ఱంపైన నిశీధుడూ, ఎఱ్ఱగుఱ్ఱంపైన సంధ్యాకుమారుడూ సుహాసినీ సుభాషిణీ, సుకేశినీలను వెతుక్కుంటూ బయలుదేరారు.

వాళ్లు బయలుదేరేముందు రాజు మూడు నల్ల జెండాలుతెచ్చి మూడు గుఱ్ఱాలకూ ముందుభాగాన కట్టాడు. "నా చిట్టి తల్లుల్ని తీసుకుని ఏ క్షణాన మీరు తిరిగి వస్తారో ఆక్షణాన వీటిని పీకిపారెయ్యండేం, మరిచిపోక" అని హెచ్చరిక చేశాడు.

ఆ తరువాత తమ తల్లీ, రాజూ మనసారా దీవించగా, కుఱ్ఱవాళ్లు ముగ్గురూ వాయువేగంతో సాగిపోయారు.

---

పగటివేళ కళ్లు కనుపించని నిశీధుడూ, సంధ్యాకుమారుడూ ఉదయనుడివెంట ఎలా వెళ్లకలిగారు? ఇంతకూ వాళ్లు రాకుమార్తెలను కనుక్కోగలిగారా? ఈ వింత విషయాలన్నీ వచ్చేనెల చదవండి.









## 6

[తన ముద్దుల కుమార్తెలు—సుహాసినీ, సుభాషిణీ, సుకేశినీలను వెతికి తెచ్చినవానికి తన రాజ్యం యిస్తానని రాజు చాటింపించటం, అది విన్న భద్రపురి కవలలు ఉదయనుడూ, నిశీథుడూ, సంధ్యాకుమారుడూ రాకుమార్తెలను వెతుక్కొంటూ బయలుదేరటంవరకూ క్రిందటినెల చదివారుకద. అతర్వాత ఏమి జరిగిందీ అంటే:]

తెల్లగుఱ్ఱంపైన ఉదయనుడు ముందు పోతున్నాడు. పట్టపగలు కావటంవల్ల ఉదయనుడికి బాధలేదు. కాని సంధ్యా నిశీథుల సంగతేమిటి? వాళ్ళకు కళ్లువుండి కూడా గ్రుడ్డివాళ్ల కిందనే లెక్కకదా! అందుచేత దారితెలియకపోయినా ముందు పోతున్న ఉదయనుడి గుఱ్ఱపు డెక్కల చప్పుడు ఆనవాలుగా పెట్టుకుని అతని వెంటన్నే పోతూ వున్నారు. క్రమంగా సూర్యుడు పడమటికి క్రుంగజొచ్చాడు. "నాపని అయిపోయింది—ఇకనువ్వు దారి చూపు సంధ్యా" అన్నాడు ఉదయనుడు. ఆమాటప్రకారం ముందు సంధ్య దారి తీయుగా, అతని వెనక నిశీథుడు, అవెనక ఉదయనుడు వెళుతున్నారు.

అలా పోయి పోయి బాగా చీకటిపడే వేళకు వాళ్ళు ఒకపెద్ద అరణ్యం చేరుకున్నారు. చీకటి పడటంవల్ల యిక ఉదయనుడూ, సంధ్యా విశ్రాంతి తీసుకోవలసినవాళ్లే. కాని అర్ధరాత్రివేళ ఆ నట్టడవిలో ఎక్కడని విశ్రాంతి తీసుకోవటం? అప్పుడు నిశీథుడు వాళ్ళని ఒక చెట్టుపైన కూర్చోబెట్టి—"మీరు యిక్కడే వుండండి. నేనుపోయి ఈరాత్రికి మీరు తలదాచుకునేందుకు వీలైన చోటు ఎక్కడైనా ఉందేమో చూచివస్తాను" అని వాళ్ల







గుఱ్ఱాల్ని ఆ చెట్టుకే కట్టివేసి, తన నల్లి గుఱ్ఱంపైన బయలుదేరాడు.

నిశీథుడు చాలా దూరం పోయి చివరకు ఆ అరణ్యమధ్యంలో ఒక పాడుబడ్డ యింటి వద్దకు చేరుకున్నాడు. వాకిలిదగ్గిరికి వెళ్ళి తలుపుతట్టి చూచాడు. జవాబు లేదు. కిటికీ దగ్గిరికివెళ్ళి తొంగి చూచాడు— లోపల అలికిడి యేమీలేదు. ధైర్యంచేసి తలుపు తెరుచుకుని యింట్లోప్రవేశించాడు. ఏమూల చూచినా నారపీచు కుప్పలే. అంతకుతప్ప ఆ యింట్లో విచిత్రమేమీ లేదు. ఇంటి యజమాని ఎవరో చూద్దా మని కొంతసేపు అక్కడే వేచివున్నాడు.

కాని ఎంతకూ ఎవరూ రాకపోయేసరికి అది ఏదో పాడుబడిన యిల్లుఅయివుంటుం దనుకున్నాడు. తనకూ, తన సోదరులకూ ఇది తల దాచుకోటానికి తగిన స్థలమేనని నిశ్చయించుకొని, తిరిగి నల్లగుఱ్ఱంపైన బయలుదేరి ఉదయనుడూ, సంధ్యా వున్న చెట్టు వైపుకి సాగాడు.

నిశీథుడు అక్కడ సోదరులను కూర్చొబెట్టి వచ్చేసిన మరుక్షణమందే ఉదయనుడూ, సంధ్యా ఎక్కిన చెట్టుక్రిందని ఏదో అలికిడి అయింది. పురుగూ పుట్రా వుండే అడవికదా, అటువంటి దేదైనా అయి వుంటుందనుకుని వాళ్ళు ఆత్రంతో అలాగే నిశీథునికోసం ఎదురుచూస్తూవున్నారు.

ఉన్నట్టే వుండి ఉదయనుడు తన నడుము చుట్టూ తడిమి చూచుకొని "సంధ్యా! ఏదో నారపీచులాగా తగులు తోంది ఏమిటో నడుముకి" అనబోయాడు. ఉదయనుడి నోటినించి ఈ మాటలు పూర్తిగా వచ్చాయో లేదో సంధ్యకూడా అవును, "నా నడుముకీ అలాగే తగులు తోంది. నీవు చెప్పినట్టు ఏదో నారపీచు లాగానే కనబడుతూవుంది. ఏమైవుంటుంది చెప్మా?" అని ఆలోచించసాగాడు.

ఇలా వాళ్లు ఆలోచిస్తూవుండగానే వాళ్ల నడుముచుట్టూ ఏదో తాడు బిగించి లాగబడుతున్నట్టు ఇద్దరూ గ్రహించారు. చేతులతో చుట్టూ తడిమిచూచారు. ఎక్కడా మనిషి అలికిడి కనుపించలేదు.

ఇంతలో—"మహామహావాళ్ళకే నేను కనుపించలేదు, మీకా కనుపించేది?" అనే మాటలు వినిపించినై.

ఎప్పుడైతే ఈ మాటలు వినిపించినయ్యో, అప్పుడు తమని ఏదో దెయ్యమో భూతమో యిలా తాటితో బిగించివుంటుందని ఉదయనుడూ సంధ్యా తెలుసుకున్నారు. కాని ఏమిచెయ్యాలో తోచింది కాదు. "సమయానికి మా నిశీథుడు లేకపోయాడు గాని, వుంటే నీ అంతు కనుక్కొని వుందుము. ఇప్పటికైనా మించిపోయింది లేదులే. మాఅన్నయ్య ఈపాటికి బయల్దేరి వస్తూనే వుంటాడు. వాడు వచ్చేలోగా మర్యాదగా మమ్మల్ని వదిలిపోతావా సరే సరి—లేదా ఈరోజునే నిన్ను యమలోకానికి పంపించివేస్తాడు" అని బెదిరించి చూచారు.

కాని ఆ వచ్చినవాడు సామాన్యుడా? "ఓస్! మీ బెదిరింపులు నాదగ్గరనా?





మీ అన్నయ్యలాటివాళ్లు ఒకరుకాదు వంద మంది వచ్చినా నన్నేమీ చెయ్యలేరు. అయినా మీ అన్నయ్య వచ్చేవరకూ నేను యిక్కడ వుండబోయాను గనకనా?" అంటూ ఆ వచ్చినవాడు వాళ్లని తన గడ్డం చివర కట్టి చరా చరా సాగిపోయాడు. పోతూ పోతూ ఆ వచ్చినవాడు మరొక కొంటెపనికూడా చేసిపోయాడు. చెట్టుకి కట్టివున్న రెండు గుఱ్ఱాలపైనా ఏదో భస్మం చల్లాడు. అలా చల్లటంతోటే అవి రెండూ మాయమైపోయాయి.

మరికొంతసేపటికల్లా నిశీధుడు చెట్టు వద్దకు వచ్చి చూచేసరికి ఏమున్నదీ— చెట్టుపైన తన సోదరులూలేరు, చెట్టుక్రింద వాళ్ల గుఱ్ఱాలూలేవు. అతనికి ఏమీ తోచింది కాదు. ఒకవేళ తను రావటం ఆలస్యం అయిందని చెప్పి వాళ్ళు తనని వెతుక్కొంటూ మరోదారిన వెళ్లారేమో ననుకుని, సోదరులను వెతుక్కుంటూ. తన నల్లగుఱ్ఱంపైన తిరుగుముఖం పట్టాడు. అలా వెతుక్కుంటూ నిశీధుడు ఆ మహారణ్యమంతటా కలియతిరిగాడు. కాని ఎక్కడా వాళ్ళ ఆనవాలు చిక్కిందే కాదు. అప్పటికి రాత్రికూడా చాలాభాగం గడిచిపోయింది. మరో రెండు గంటలలో తెల్లవారబోతుంది. తీరా తెల్లవారిందీ. అంటే తను ఒక్క అడుగైనా ముందుకు వెయ్యలేడు. అందుచేత ఆఖరు ప్రయత్నంగా మరొక్కసారి అడవి అంతా గాలించాడు. లాభం లేకపోయింది.

చివరకు ఒక ఆలోచన తట్టింది— "ఒకవేళ వాళ్లు నేను చూచివచ్చిన ఆ యింటికే వెళ్ళారేమో" అని అనుకొన్నాడు. ఈ ఆలోచన స్ఫురించగానే గిరుక్కున మళ్లీ తిరుగా ఆ పాడుబడిన యింటికివచ్చి చేరుకున్నాడు. తన సోదరులు గుఱ్ఱాలను బైట కట్టివేసి వుంటారుకదా అని తలిచాడు







నిశీథుడు. కాని అలా ఏమీ కనిపించక పోయేసరికి నిరాశ చెందవలసి వచ్చింది. అయినా చూద్దామని చెప్పి తలుపు తోసుకుని యింట్లోకి వెళ్ళాడు. ఎంత వింత !! ఒక లావుపాటి నారత్రాటితో కట్టబడి ఉదయనుడూ, సంధ్యా ఆ గదిమూల నిద్రిస్తూ వున్నారు. పైగా వాళ్లకి దగ్గరలోనే నేలమీద నెత్తురు చుక్కలు కనుపిస్తున్నై. అంతకంటే ఘోరం!—ఉదయనుడి చెయ్యి ఒకటి మాయమైపోయింది. పోనీ అంటే నరికివేసిన గుర్తయినా లేదు.

ఇదంతా చూచి నిశీథుడికి మతిపోయినట్టనిపించింది. కొంతసేపటికి స్తిమితం తెచ్చుకొని సోదరులను తట్టి లేపాడు. నిశీథుణ్ణి చూడగానే వాళ్లకి ప్రాణం లేచి వచ్చింది—"తమ్ముడూ!- ఆ దుర్మార్గుణ్ణి తప్పించుకుని ఎలా వచ్చావురా? మళ్లీ మనం కలుసుకుంటామని ఆశపడనేలేదు మేము" అంటూ నిశీథుణ్ణి కౌగిలించుకొని, కన్నీరు కార్చారు సోదరు లిద్దరూ.

"మీకు వచ్చిన భయంలేదు. విచారించకండి. యిక్కడికెలా వచ్చారు మీరు? ఈ కట్లేమిటి? అన్నయ్యా!—నీ చెయ్యేమయింది? ఈ నెత్తురు చుక్కలేమిటి?" అని ఆత్రంకొద్దీ ప్రశ్నలు కురిపించాడు, నిశీథుడు.

"ఇదంతా మన దురదృష్టం తమ్ముడూ! నీవు మమ్మల్ని వదిలి వెళ్లిన కాసేపటికల్లా మమ్మల్ని ఎవడో తాటితో కట్టితెచ్చి ఈయింట్లో పడేశాడు. ఆ దుర్మార్గుడు ఎవడో, మమ్మల్ని ఎక్కడికి తీసుకుపోతున్నాడో మేము చీకటిలో తెలుసుకోలేక పోయాం. ఎప్పుడు తెల్లవారుతుందా అనేదే మా ఆరాటం. ఇప్పుడిప్పుడే తెల్లవారబోతున్నది కనుక నేను కొంచెం చూడగలిగాను. మమ్మల్ని యిక్కడికి కట్టి తెచ్చినవాడు ఒక విచిత్రమైన మనిషి. వాడిని








చూస్తే మాకు నవ్వూ వచ్చింది, కోపమూ వచ్చింది. భూమికి సరీగా జానెడంటే జానెడెత్తునే వున్నాడు. కాని చిత్రమేమిటంటే వాడికి వందజానెలు పొడుగు గల గడ్డం వుంది. ఆ గడ్డాన్నే మా నడుములకు చుట్టి తాడులాగా పేనాడు. ఇప్పటివరకూ వాడూ మా ప్రక్కనే పడుకుని వున్నాడు. ఇప్పుడే లేచి ఎక్కడికో పోయినట్టుంది. వాడు లేచేసరికి ఇక్కడ నేలమీద నీ పాదాల గుర్తులు కనిపించినై. అవి కంట పడగానే అగ్గి రగులుస్తూ 'ఓహెూ మీ పెద్దన్న యిక్కడికి వచ్చి వెళ్ళినట్టున్నాడే? సరే వుండండి. వాడినికూడా పట్టి తెస్తాను' అంటూ గభీమని లేవబోయాడు. ఆ తొందరలో వాడు మమ్మల్ని తన గడ్డానికి కట్టుకున్న సంగతే మరిచిపోయినట్టుంది! నాకు వళ్ళు మండి వాడి గడ్డం పట్టుకు పీకేసరికి నాలుగు పీచులు కుదుళ్లకంటా వూడి వచ్చి బొలబొలా రక్తం కారింది.

వాడు కళ్ళవెంట చింతనిప్పులు కక్కుతూ 'ఔరా ఎంత పొగరు నీకు; ఇంతా నయంలే, గడ్డమంతా ఊడలాగేశావు కావు' అంటూ కసిరాడు.

'ఈ నా గడ్డమే నాకు పంచప్రాణాలూ అయివుండె. ఇందులో ఒక్క వెంట్రుక రాలిందంటే ఒక ప్రాణం ఎగిరిపోయిందన్న మాటేకద. ఇప్ప డీ పొగరుబోతు నాలుగు పొడుగుపాటి కేశములు పీకి వేశాడే. అవి మళ్ళా ఈ జన్మలో మొలిచే అస్కారమూ లేదు. ఎలా అహెూరించేది!' అని గొణుగుకొంటూ, 'అరేయ్, నీ నేరానికి ఇదే తగినశిక్ష, అనుభవించు' అంటూ జేబులోంచి ఏదో అంజనం తీసి నా భుజానికి పూశాడు. అంతే. ఆ మరుక్షణమే నా చెయ్యి మాయమైపోయింది. ఈపని చేసిన తర్వాత వాడు తన గడ్డాన్ని మమ్మల్ని కట్టుకున్నంతవరకు కత్తిరించుకుని నులు

వుగా లేవగలిగాడు. కాని చిత్ర మేమి టంటే, ఆ పొడుగుగడ్డం మళ్ళీ ఎప్పటి లాగానే తయారై వుంది" అని చెప్పి ముగించాడు. ఇదంతా విని నిశీథుడు చాల ఆశ్చర్యపోయాడు.

ఇంతలోకే బాగా తెల్లవారింది. అప్పుడు ఉదయనుడు—"సరే యింక ఆలస్యం చెయ్యటం దేనికి. వాడు నీకోసం తిరిగి తిరిగి విసిగి వేసారి ఈపాటికి మళ్లీ ఇటు వస్తూవుండి వుండాలి. తెల్లవారింది కనుక నిశీథా!—యిక నీవల్ల ఏమీ ప్రయోజనం లేదుకదా? అందుచేత నా బదులు నిన్ను సంధ్యతో కలిపి కట్టివేస్తాను. ఒకచెయ్యి మాత్రమే పైకి కనిపించేట్టు జాగ్రత్తగా కూర్చుని వుండు. తర్వాత సంగతి చూచు కొందాం" అన్నాడు.

సరేనంటే సరేననుకున్నారు ముగ్గురూ. వెంటనే నిశీథుడు వాళ్ళ కట్లు విప్పాడు. ఉదయనుడు లేచి నిశీథుణ్ణి సంధ్యతో పాటు కట్టి పడేశాడు. బైటవున్న నిశీథుడి నల్లగుఱ్ఱాన్ని అక్కడ దగ్గర్లో ఒక గుహలో కట్టేసి, తనుమాత్రం తిరిగి ఆ పాడుబడ్డ యింటికి దగ్గర్లోనే ఒక పొద మాటున నక్కివున్నాడు.



సరిగ్గా మధ్యాహ్నం అయేవేళకు ఆ బారెడుగడ్డపు జానెడు మనిషి—"కానివ్వు ఎక్కడికి పోతాడు? ఇవాళ కాకపోతే రేపు. అంతేకదా? అహహా, అహహా" అంటూ విరగబడి నవ్వుతూ ఉదయనుడు దాగివున్న పొదపక్కనించే పోయాడు.

వాడిని యింట్లోకి పోనిచ్చి ఉదయనుడు మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ ఒక కిటికీ దగ్గరచేరి యింటిలోపలికి తొంగి చూచాడు. అప్పుడు ఒక చిత్రమైన విషయం ఉదయనుడి కంటబడింది. ఆ బారెడుగడ్డపు జానెడు మనిషి జేబులోంచి ఏదో మందుతీసి నిశీథుడిపైన, సంధ్యపైన





చల్లాడు. వెంటనే వాళ్లు ఆనవాలైనా లేకుండా మాయమైపోయారు. ఆతర్వాత వాడు తన మెడలోవున్న ఒక దండ తీసి అక్కడ ఒక వంకెకు తగిలించాడు. దండ తీసివేశాడో లేదో ఆశ్చర్యం, వాడు మామూలు మనిషి అయిపోయాడు. ఆ గడ్డమూ లేదు ఏదీలేదు.

ఇదంతా ఉదయనుడు కిటికీలోనించి కనిపెడుతూనే వున్నాడు. మెడలోవున్న దండ తీసివేసి వాడు గుర్రుపెట్టి నిద్ర పోయాడు. ఇదే అదనుచూచి ఉదయనుడు మెల్లగా యింట్లో ప్రవేశించి ఆ దండ కాస్తా కాజేసి తెచ్చి తన మెడలో వేసుకున్నాడు. ఇంకేముంది, ఉదయనుడు వెంటనే బారెడుగడ్డపు జానెడు మనిషిగా మారిపోయాడు. ఈ వింతమార్పు చూచి ఉదయనుడికి నవ్వు వచ్చింది. "ఒహెూ! ఇదా నీ కిటుకు" అనుకున్నాడు మనసులో. ఇప్పుడు తన చొక్కాకుగల జేబులన్నీ తడిమి చూచుకున్నాడు. ఒక జేబులో ఏదో తెల్లటి భస్మం వుంది. చెట్టు క్రింద గుఱ్ఱాల్నీ, యింట్లో మనుషుల్నీ గెడ్డంవాడు మాయంచేసింది ఈ భస్మంతోటే. రెండోజేబులో ఒక ఎఱ్ఱని అంజనపు డబ్బీ వుంది. ఉదయనుడి చెయ్యి పోగొట్టింది ఈ అంజనం రాచే. మూడో జేబులో అలాటిదే మరొక పచ్చని అంజనపు డబ్బీ, ఒక పెద్ద తువ్వాలూ, ఇంకా మరి ఏదో నల్లని భస్మమూ వున్నై. ఐతే వాటిలో ఏది ఎందుకు ఉపయోగిస్తుందో ఉదయనుడికి బోధపడలేదు.

---

[గెడ్డపువాడి కిటుకు తెలుసుకొన్న ఉదయనుడు, తనకు చిక్కిన వస్తువులతో ఏమి సాధించగలిగాడు? ఇంతకూ, ఆ బారెడు గడ్డపు జానెడు మనిషి వాళ్లని అంతటితో వదిలాడా, లేదా? ఈ వింతలన్నీ వచ్చేనెల నంచికలో]








## 7

[ బారెడుగడ్డపు జానెడుమనిషియొక్క మాయలో ఉదయనుడూ, నిశీధుడూ, సంధ్యా కుమారుడూ ఎలా చిక్కుకున్నదీ, ఆతర్వాత దైవవశాత్తు మాయలవాడికిటుకు ఉదయనుడు ఎలా కనిపెట్టగలిగింది తెలుసుకొనే వున్నారుకదా! తరువాత ఏమి జరిగిందంటే—]

మామూలప్పుడే సహజసిద్ధంగా సంధ్యకూ, నిశీధుడికీ పగటివేళ కనుపించదుకదా? అందుకు తోడు ఇప్పుడు గెడ్డపువాడు వాళ్లని మాయంచేశాడాయె! ఆ మాయవల్ల ఉదయనుడు జానెడు మనిషిగా మారిపోవటమూ మంచంపై పడుకొని ఉన్న గెడ్డంవాడు మామూలు మనిషి కావటమూ వాళ్లు తెలుసుకోలేకపోయారు. గెడ్డంవాడు ఏ క్షణాన లేస్తాడో, లేచి యింకేమి ప్రమాదం తెచ్చిపెడతాడో అని బేజారెత్తిపోతున్నారు. పైగా తమ సోదరుడేమయాడో అనే బెంగ!

గెడ్డంవాడి కిటుకు తనకు తెలిసిపోవటమే గాక, వాడిని మోసంచేసి తనుకూడా వానిలా మారిపోయాను కదా అని ఉదయనుడు సంతోషించాడు. ఈ సంతోషంలో ఉదయనుడు తన సోదరుల సంగతే మరిచిపోయాడు. ఇప్పుడు ఉదయనుడి దృష్టి అంతా తన జేబులలోవున్న భస్మాలపైనే వుంది. ఈ భస్మాలూ, అంజనాలూ ఎందుకు ఉపయోగపడతయ్యా అని ఆలోచిస్తూ వుండగా యాధాలాపంగా సోదరుల సంగతి గుర్తుకు వచ్చింది. చూచాడు. ఏరీ వాళ్లు? ఉదయనుడికి ఏమీ పాలుపోయిందికాదు. ఏమి చెయ్యటానికీ తోచక అలాగే పచార్లు చేస్తుండగా మెలకువవచ్చి గెడ్డపువాడు లేచాడు. ఎదుట అచ్చగా తన స్వరూపం







తోనే ఒక చెయ్యిలేని ఉదయనుడు కనిపించేసరికి గెడ్డపువాడికి అంతా అర్థం అయిపోయింది. తన బండారం బయటపడిందే అని లోలోపల మండిపోతున్నా పైకిమాత్రం కొంచెంకూడా కోపం కనబరచలేదు.

వాడు నెమ్మదిగా ఉదయనుడివైపుకి నడచివస్తూ, "మీరెవరో అసాధ్యులలాగా వున్నారే! ఇంతకాలానికి నా రహస్యం కనిపెట్టగలిగిన సమర్థులను చూడగలగటం నిజంగా నా అదృష్టమే అని భావిస్తున్నాను. ఐతే, దీనివల్ల మీకు కలగబోయే లాభం ఏమి లేదు. మీరు యిక్కడికి వచ్చిన పని ఏమిటో చెప్పితే నేను క్షణంలో నెరవేరుస్తాను. నేనుండగా మీరు శ్రమపడటమెందుకు?" అని అంటూ, ఉదయనుడి మెడలోవున్న దండకోసం అనేకవిధాల ప్రాధేయపడి అడిగాడు.

అంత తేలికగా టోపీపడేవాడా ఉదయనుడు! "ముందు నా సోదరులను ఎక్కడ దాచావో చెప్పు, తరవాత సంగతి ఆలోచిద్దాం" అన్నాడు.

"ఎక్కడా దాచలేదు. ఇక్కడే వున్నారు. అదుగో నీ చొక్కా ఎడమజేబులో వున్న డబ్బీలోని నల్లని భస్మం అక్కడ చల్లు" అంటూ వాళ్లని మాయం చేసిన చోటు చూపించాడు. అలాగే ఉదయనుడు నల్లని భస్మం చల్లేసరికి ఒక్కసారిగా నిశీథుడూ, సంధ్యా ప్రత్యక్షమయారు.

తర్వాత ఉదయనుడు "సరేకాని, నా చెయ్యి తిరిగివచ్చే మార్గం కూడా చెప్పు" అన్నాడు గెడ్డంవాడితో.

"దీనికి మందు నీదగ్గిరే వుంది. చూడు నీ కుడిజేబులో పచ్చని అంజనపు డబ్బీ వుంది. అది తీసి మొండిచేతికి రాయి" అన్నాడు గెడ్డపువాడు.

ఉదయనుడు అలాగే చేసేసరికి తిరిగి మామూలుచెయ్యి వచ్చేసింది.





ఇప్పుడు ఉదయనుడికి తన జేబులో వున్న తెల్ల భస్మమూ, ఎర్ర అంజనమూ ఎందుకు ఉపయోగపడతయ్యో తెలుసుకోవాలని తొందర కలిగింది. గెడ్డపువాడికి అవి చూపుతూ "ఇవి దేనికి?" అని అడిగాడు.

గెడ్డపువాడు నవ్వుతూ, "ఈమాత్రం గ్రహించలేవూ? నీ సోదరులని మాయం చేసింది ఈ తెల్లని భస్మంతోనే. నీ చెయ్యి మాయం చేసింది ఆ ఎర్రని అంజనంతో" అంటూ మర్మాలన్నీ బయటబెట్టాడు.




"మరైతే ఈ తువ్వాలు దేనికి?" అని ప్రశ్నించాడు ఉదయనుడు.

"దానివల్ల రెండు ఉపయోగాలు ఉన్నయ్. మీరు కోరుకొన్న ఆహారం ఏదైనా సరే మనసులో తలుచుకుని తువ్వాలు పరిచారంటే వెంటనే అది తయారవుతుంది. ఏవిధమైన వ్యాధినయినా యిది నయం చేస్తుందికూడా" అని చెప్పాడు గెడ్డపువాడు.

"అయితే మా కంటిచూపులలో భేదాలు మారిపోయేట్టు చేయగలదా ఈ తువ్వాలు?" అని మళ్లీ అడిగాడు ఉదయనుడు.

"చూపులేమిటి, భేదాలేమిటీ?" అని గెడ్డపువాడు ఆశ్చర్యంతో అడిగేసరికి, ఉదయనుడు తను చీకటిలో చూడలేకపోవటం, అలాగే తన సోదరులు వాళ్లకు అనుకూలం కాని వేళలలో చూడలేకపోవటం వివరంగా చెప్పాడు.

అంతా విన్నతరువాత గెడ్డపువాడు, "ఓహో ఇదా సంగతి? మీ ముగ్గురికి మామూలు చూపు వచ్చే మార్గం చెబుతా కాని ముందు నా దండ నాకు యివ్వు, మరి" అన్నాడు.

కాని ఉదయనుడికి తెలుసు, ఏమాత్రం ఏమరివున్నా గెడ్డపువాడు తమని ప్రాణాలతో వదలడని. అందువల్ల యుక్తిగా యిలా చెప్పాడు—"తాతా! మాకు చూపు వచ్చే








మార్గం చెప్పు. ఇది వక్కటే మాకు మిగిలి వున్న కోరిక, ఇక్కడికి పడమటి దిక్కుగా పది మైళ్ల దూరంలో ఒక గుహ వుంది. నీ దండ ఆ గుహలో వుంచి వెళిపోతాము. నీవు వచ్చి దానిని తీసుకుపోవచ్చు" అని చెప్పాడు.

ఆ దండ తనకు అయువుపట్టయి వుంది కనుక గెడ్డపువాడు ఈ యేర్పాటుకు వప్పుకొనక తప్పిందికాదు.

ఇంతలో నిశీధుడూ, సంధ్యా లేచి వచ్చి, "అన్నయ్యా! వీడి జీవానికి పడి మనం యింతవరకూ కడుపులు కాల్చుకునే వున్నాం. భలే ఆకలి వేస్తోంది. ఏదీ ఆ తువ్వాలు మహత్తు ఎంతవరకు నిజమో చూదాం!" అన్నాడు.

నిజానికి ఈమాట ఉదయునుడికి తోచనే లేదు. ఎప్పుడైతే సోదరులు ఈ మాట అన్నారో ఉదయనుడు రకరకాల ఫలాల పేర్లూ తలుచుకుని తువ్వాలు పరిచాడు. మరుక్షణాన తువ్వాలు నిండా నవనవలాడుతూ రకరకాల పళ్లూ నిండి కనుపండువుచేసినై. ఉదయనుడు కొన్నిఫలాలు తన సోదరులకిచ్చి, తాను కొన్ని తీసుకున్నాడు. కాని ఎన్ని తీసినా తువ్వాలుమీది పళ్లు తరగనేలేదు. అందుచేత, దుష్టుడైనప్పటికీ గెడ్డపువాడికికూడా కొన్నిపళ్లు పెట్టాడు.

కడుపునిండాక ఉదయనుడు తువ్వాలు మడిచి జేబులో వుంచుకుని "మరి ఇక మా చూపులు సరి అయ్యే మార్గం చెప్పు. చూపులు వస్తే మాదారిన మేము పోతాం" అన్నాడు.

అందుకు గెడ్డపువాడు "నీ దగ్గిరవున్న ఎర్ర అంజనం వుండచెయ్యి. ఆ వుండని ఈ నారపీచులో చుట్టి ముట్టించు. దానిలోంచి బ్రహ్మాండమైన పొగ వస్తుంది. మీరు ముగ్గురూ ఈ తువ్వాలు తలపైన కప్పుకొని





ఆ పొగ మీ కళ్లకి తగిలేట్టు చూడాలి. ఒక్క అయిదు నిమిషాలు అలా వున్నట్టైతే మీకు మామూలు చూపు వచ్చేస్తుంది" అని చెప్పాడు.

అలాగే ఉదయనుడు ఎర్ర అంజనం వుండచేసి ఆ వుండని నారపీచులో కట్టాడు. కాని నిప్పు ఎక్కడినుంచి తేవటం?

ఉదయనుడు ఏమి చెయ్యటమా అని ఆలోచిస్తుండగా గెడ్డపువాడు రెండు చెకుముకి రాళ్లు తెచ్చి నిప్పుచేసి అంటించాడు. నారపీచులోవున్న ఆ వుండ అంటుకోగానే బ్రహ్మాండమైన పొగ లేచింది.

ఉదయనుడు తన సోదరులనుకూడా తీసుకుని, ముగ్గురూ ఆ పొగలో కూచుని తలల పైన తువ్వాలు కప్పుకున్నారు.

అయిదు నిమిషాల తరవాత ముగ్గురూ బయటికి వచ్చారు. ఒక్కొక్కళ్ల కళ్ల వెంబడి నీరు కాలువలా ప్రవహించి, కొంత సేపటికల్లా కంటితడి ఆరిపోయింది.

కాని, ఆశ్చర్య మేమిటంటే, తమకు మామూలు చూపు వస్తుందని యింతా చేస్తే గెడ్డపువాడు చెప్పినట్టు చెయ్యటంవల్ల చూపు రాకపోవటమే కాక, యిప్పుడు కనుగ్రుడ్లే మాయమైపోయినై.









ఉదయనుడు ఉగ్రుడైనాడు. "ఏమిరా దుర్మార్గుడా! ఇదేనా నీవు మాకు చూపులు తెప్పించటం?" అంటూ ఉరమసాగాడు.

అందుకు గెడ్డపువాడు "తొందరపడకు బాబూ! మిమ్మల్ని మోసమే చెయ్యాలనుకుంటే ఈ రహస్యాలన్నీ చెప్పేవాడినా? అసలు పని ముగియుందే అలా కేకలు వేస్తావెందుకు? ఇప్పుడు కనుగ్రుడ్లుకూడా లేవు కదా? నీ దగ్గిరవున్న ఆ పచ్చ అంజనం రెప్పలపైన రాచుకొని చూడు" అన్నాడు.

అలాగే ఉదయనుడు ఆ అంజనం కంటి రెప్పలపైన రాచుకునేసరికి మామూలుగా కళ్లు వచ్చేసినై. వెంటనే సోదరుల కళ్లకి కూడా రాచాడు. వాళ్లకి వచ్చేసినై. తాను గెడ్డంవాడిపైన అనవసరంగా కోపపడ్డందుకు ఉదయనుడు సిగ్గుపడ్డాడు. రాత్రి వేళల తప్ప చూపు కనిపించని నిశీధుడూ, సంధ్య వేళ తప్ప చూపు కనిపించని సంధ్యాకూడా యిప్పుడు చక్కగా చూడగలుగుతున్నారు. ఇందుకు వాళ్లు ఎంతో ఉప్పొంగిపోయారు.

అతర్వాత వాళ్లు తమ గుఱ్ఱాల్ని తెచ్చుకుందామని చెప్పి బయలుదేరారు. మొదట ముగ్గురూ అడవిలోకి వచ్చి అంతకుముందు గుఱ్ఱాల్ని కట్టేసిన చెట్టుదగ్గరికి చేరుకున్నారు. ఉదయనుడు తనదగ్గిరవున్న నల్ల భస్మం అక్కడ చల్లేసరికి యథాప్రకారం గుఱ్ఱాలు రెండూ ప్రత్యక్షమైనై. వాటిని తీసుకుని వాళ్లు గుహలో దాచిన నల్లగుఱ్ఱంకోసం వెళ్లి, దాన్నికూడా తీసుకుని గెడ్డంవాడి ఇంటికి తిరిగివచ్చారు.

అప్పుడు గెడ్డంవాడు—"మీ కోరికలన్నీ నెరవేరినట్టేకదా? ఇక మీదారిన మీరు వెళ్లండి. వాగ్దానం ప్రకారం నా దండ మాత్రం ఆ గుహలో వదిలి వెళ్లండి మాట తప్పితేమాత్రం..." అని యింకా ఏమో చెప్పబోతుండగా నిశీధుడు అడ్డుతగిలి, "సరేకాని, అసలింతకూ, నీవెవరవు?





దారినపోయే అమాయకులను ఎందుకిలా నిర్బంధిస్తున్నావు?" అని అడిగాడు.

అందుకు గెడ్డపువాడు, "ఆ సంగతి నేను చెప్పకూడదు. అది గొప్ప రహస్యం. అది వెల్లడించినట్టయితే నేను తలపగిలి చస్తాను. కనుక క్షమించండి" అన్నాడు.

సోదరులు ముగ్గురూ ఒక్క మాటగా వానిపైన సానుభూతి కనబరిచి, ఈరహస్యం గురించి అడగకుండా వదిలేశారు. తర్వాత వాళ్లు తమతమ గుఱ్ఱాలమీద బయలుదేరి పోసాగారు. పోతూ పోతూ ఉదయనుడు గెడ్డపువాడితో, "మరొక్క కోరిక వున్నది. నీ దండ అయితే నీకు యిస్తాము కాని ఈ అంజనాలూ, భస్మాలూ, తువ్వాలూ మాకు యివ్వాలి సుమా" అన్నాడు.

ఇందుకుకూడా గెడ్డపువాడు ఒప్పుకోక తప్పిందికాదు. తర్వాత తెల్లగుఱ్ఱంమీద ఉదయనుడూ, నల్లగుఱ్ఱంమీద నిశీధుడూ, ఎఱ్ఱగుఱ్ఱంమీద సంధ్యా బయలుదేరారు.

వాళ్లు అలా పోయి పోయి చివరకు గెడ్డపువాడికి గుర్తు చెప్పిన గుహ చేరుకున్నారు. మాట యిచ్చినప్రకారం ఉదయనుడు తనమెడలో దండతీసి ఆ గుహలో పెట్టాడు. ఎప్పుడైతే దండ మెళ్లోనించి తీసి




వేశాడో, అప్పుడు ఉదయనుడికి మామూలు రూపం వచ్చేసింది. ఆతర్వాత వాళ్లు తిరిగి తమ గుఱ్ఱాలమీద సాగిపోయారు.

కొంతదూరం పోగా వాళ్లు ఒక కీకారణ్యంలో ప్రవేశించారు. అప్పటికే చీకటి పడుతూవుంది. రాత్రిపూట ఆ అరణ్యంలో ఎక్కడ తల దాచుకోవటం? ఏమి చెయ్యటమా అని వాళ్లు ఆలోచిస్తూవుండగా మూడు సింహాలు తమవైపు గర్జించుకుంటు రాసాగినై. నిశీధుడికీ, సంధ్యకూ ఏమీ తోచిందికాదుగాని యుక్తిపరుడైన ఉదయనుడు తన దగ్గిరవున్న తెల్ల భస్మం తీసి నిశీధుడిమీదా, సంధ్యమీదా వాళ్ల గుఱ్ఱాల





మీదా చల్లాడు. వెంటనే వాళ్లు మాయమ యారు. తన గుఱ్ఱంపైనా తనపైనాకూడా చల్లుకున్నాడు. తనూ మాయమయాడు!

వాళ్లు మాయం కావటమూ, ఆ మూడు సింహాలు ఉరుకులెత్తుతూ అక్కడికి చేరటమూ ఒక్కమాటే జరిగింది. విందు భోజనం దొరికిందికదా అని ఎంతో ఆశతో వచ్చిన ఆ సింహాలకి పాపం నిరాశ అయిపోయింది. కొంతసేపు అక్కడే తచ్చాడి, వాటిదారిన అవి పోయినై.

కాని సింహాలు వెళ్లిపోయినా మామూలు రూపంతో రాత్రివేళ ఆ మహారణ్యంలో సంచరించటం ప్రమాదకరమని తలచి, తెల్లారేపరకూ అదృశ్యరూపంతోనే వుండిపోయారు అన్నాదమ్ములు.

తెల్లవారింది. ఉదయనుడు తనవద్దవున్న నల్లభస్మం తనపైనా తన గుఱ్ఱంపైనా సోదరులపైనా వాళ్ల గుఱ్ఱాలపైనా చల్లేసరికి మళ్లీ మామూలు రూపాలు వచ్చేసినై.

ఇప్పుడు వాళ్లు ముగ్గురూ గుఱ్ఱాలపైన వాయువేగాన స్వారి చేయగల్గుతున్నారు. గెడ్డంవాడి దయవల్ల అందరికీ సరియైన చూపు వచ్చింది కనుక ఎవరు ముందూ, ఎవరు వెనకా అన్న బాధ లేదు. కొంత దూరాన వారికి ఒక నిర్మానుష్యమైన ప్రదేశంలో ఒక భవనం కనుపించింది.

"ఆ భవనం ఎవరు ముందు చేరుకోగలమో చూద్దాం" అంటూ ముగ్గురూ తమ తమ గుఱ్ఱాల్ని జోరుగా అదలించారు. ఉదయనుడి గుఱ్ఱం శరవేగంతో పోతున్నది. అతనికి కొంచెం వెనుకలో సంధ్య, నిశీధుడు సమానవేగంతో వస్తున్నారు. కాని చిత్రం!— ముందు పోతున్న ఉదయనుడు రెప్పపాటులో మాయమయ్యాడు.

---

[ఉదయనుడు ఏమైనట్లు? ఆ భవనానికీ అతను మాయం కావటానికి ఏమైనా సంబంధ మున్నదా? ఇంతకూ మళ్లీ సోదరులు ముగ్గురూ కలుస్తారా, లేదా?—వచ్చేనెల చందమామలో]








## 8

[గెడ్డపువాని పుణ్యమా అంటూ మన కవలసోదరులకు తిరిగి మామూలు చూపు రావటం, పైగా చిత్రమైన అంజనాలూ, భస్మాలూ, మాయతువాలూ సంపాదించటం, అవి తీసుకుని రాకుసూర్తైలను వెతుకుతూ గుఱ్ఱాలమీద వస్తుండగా ముందు పోతున్న ఉదయనుడు హఠాత్తుగా మాయం కావటం—ఇంత వరకూ చదివారుకదూ! ఆ తర్వాత—]

ఎప్పుడైతే ఉదయనుడు హఠాత్తుగా మాయమయ్యాడో, అప్పుడు సంధ్యా, నిశీధులు తమ గుఱ్ఱాలను లాగిపట్టి, వేగం తగ్గించి, నెమ్మదిగానే ముందుకు సాగారు. కొంత దూరం పోయేసరికి భవనం ముందువైపు ఒక పెద్ద కందకం కనుపించింది. తమ సోదరుడు గుఱ్ఱంతో కూడా అందులో పడిపోయి వుంటాడని సంధ్యా నిశీధులు గ్రహించారు; కాని బ్రహ్మాండమైన లోతుగల ఆ కందకంలో ఉదయనుడి జాడకానీ అతని గుఱ్ఱంజాడకానీ కనుపించలేదు. వాళ్లకి ఏమీ పాలుపోయింది కాదు. భవనం ప్రవేశిద్దామా అంటే కందకం వెడల్పు కాస్తా కూస్తా కాదు. పోనీ, కందకానికి అసలు మొదలెక్కడో చివరెక్కడో కనిపెడితే భవనం తేలికగా ప్రవేశించవచ్చుననుకున్నారు. ఈ వుద్దేశంతో వాళ్లు గుఱ్ఱాలను నడిపించుకొంటూ కందకం అంచునే అడుగులు వేయజొచ్చారు. కాని ఎంతదూరం పోయినా కందకానికి దరీ అంతూ కనపడలేదు. తిరిగితిరిగి వారు మళ్లీ బయలుదేరిన చోటికే వచ్చేశారు. దీనిని బట్టి ఆ కందకానికి మొదలూ చివరా లేదనీ, భవనంలో ఎవరూ







ఇందుకు నిశీధుడుకూడా 'భేష్!' అన్నాడు. వాళ్లు మళ్లీ తమ గుఱ్ఱాలనెక్కి కొంతదూరం వెనక్కివెళ్లి శరవేగాన వచ్చి, ఒక్కదూకులో కందకం దాటారు.

అదృష్టవశాత్తూ, ఇద్దరూ కూడా ఎట్టి ప్రమాదమూ లేకుండా కందకానికి అవతలి గట్టున పడ్డారు. "ఇదంతా మన ముందు మంచికే సూచనగా కనబడుతున్నది. ఇక ఫరవాలేదు, కోటలో పాగా వేశామన్న మాటే" అని అనుకొని సంతోషించారు అన్నాదమ్ములు. ఈ సంతోషంతో వారు భవనం ప్రవేశించారేకాని, తీరా చూడగా ఆ భవనంలో మనుష్యసంచారమే లేదు. లెక్కలేనన్ని ద్వారాలు వున్నై కాని ఒక్క దానికీ తలుపులు లేవు. వారు ఒక్కొక్క ద్వారమే దాటుకుంటూ పోతుండగా ప్రతి ద్వారానికీ యిరువైపులా మానవుల శిలా ప్రతిమలు కనబడినై.

చివరికి ఒక పెద్ద ద్వారం చేరుకున్నారు. నిజానికి అది ద్వారం కానేకాదు. ఒక బ్రహ్మాండమైన రాక్షసుడు ఈ రూపంలో ఆకాశమెత్తున నిలబడి నిద్రపోతూ వున్నాడు. వాడి కాళ్లమధ్యనున్న ఖాళీ స్థలమే ద్వారంవలె కనుపిస్తున్నది. ఈ

చొర వీలులేకుండా వుండటానికే చుట్టూతా ఈ కందకం త్రవ్వబడిందనీ వాళ్లు నిశ్చయించారు. కాని ఇంతకూ భవనం ప్రవేశించగలిగే మార్గం స్ఫురించనేలేదు.

కొంతసేపు తీవ్రంగా ఆలోచించినమీదట సంధ్య ఇలా అన్నాడు—"అన్నయ్యా! ఎలాగైనా మనం ఈకందకం దాటితీరాలి. గుఱ్ఱాలమీద దౌడుతీసుకొంటూ వచ్చి ఒక్క దూకున దాటుదాము. దాటగలిగామా అదృష్టవంతులమే. లేదూ, కందకంలో పడటమే సంభవిస్తే మన ఉదయనుడి కోసం కాయశక్తులా వెతుకుదాము" అంటూ అన్నను హుషారీ చేశాడు.








రాక్షసుడికి రెండు వైపులా రెండు సింహాల ప్రతిమలు వున్నై. అవి జీవకళతో వుట్టిపడుతూ, మీదికి ఉరుకుతామన్నట్టు భయంకరంగా చూపట్టేసరికి, సోదరులిద్దరూ ఒక్కమాటుగా కెవ్వుమన్నారు.

ఈ కేక చెవినిబడి రాక్షసుడికి మెలకువ వచ్చేసింది. అమాంతం సంధ్యానిశీధులను తన గుప్పిటిలోకి తీసుకుని— "భేష్! భేష్!! మరొరెండు విగ్రహాలు!!!" అన్నాడు ఎంతో ఉత్సాహంతో. వాడు ఈ మాట అనగానే వాడు భవనంలో చూస్తూ వచ్చిన మానవవిగ్రహాలు ఏవో మాయవల్ల తయారైనవే అని ఊహించగలిగాడు.

తలవని తలంపుగా ఇలా చిక్కబడిపోయినందుకు సంధ్యానిశీధులు విచారించారు. కాని విచారించి వారు చేయగలదేమున్నది?

ఇటువంటి చిక్కులు జీవితంలో ఎన్నో తగులుతూవుంటై. నిజానికి, చిక్కులలో పడి బుద్ధిబలంవల్ల వాటినుండి తప్పించుకు బయటపడటంలోనే వున్నది మానవుని తెలివి. ఈ వుద్దేశంతో వారు ధైర్యం తెచ్చుకున్నారు. "చావుకిన్ని చావులున్నవా? ఏమైతేకానీ, ఒక పథకంవేసిచూస్తాను ఈ రాక్షసుడికి" అనుకున్నాడు, నిశితమైన బుద్ధినైపుణి గల నిశీధుడు.

అలా అనుకుంటూ నిశీధుడు రాక్షసుని ఎదుట నించుని, "ఏమయ్యోవ్, మేము ఎవరమనుకుంటున్నావో. మేము ఇక్కడికి దొంగతనంగా రాలేదు. ఫలానా గెడ్డపువాడు మీకు ఒకవార్త అందించమని మమ్మల్ని పంపాడు. అందుకే..." అని యింకా ఏమో చెప్పబోతుండగా రాక్షసుడు ఆత్రంతో "ఏమిటీ వాడు బతికే వున్నాడా? ఇన్నాళ్లూ తిరిగి రాకపోయేసరికి వాడు ఏదో ప్రమాదం వచ్చి చనిపోయాడనుకున్నామే! అయితే ఇంతకూ వాడు మీకు





చెప్పి పంపిన వార్త ఏమిటో త్వరగా చెప్పండి" అని తొందరపెట్టాడు.

అప్పుడు నిశీధుడు—"అతని ప్రాణాని కేమీ మోసం లేదు. కాని అతడి జీవిత రహస్యం ఎవరో కనిపెట్టివేశారట. కనిపెట్ట టమేకాదు. అతడిదగ్గిర వున్న భస్మాలూ, అంజనాలూ, తువ్వాలూకూడా కాజేసి పోయారట. అవి లేనిదే తను ఒక్క అడుగైనా ముందుకి వెయ్యలేడట. అందు వల్ల ఈ వార్త మీకు అందజేసి, మళ్లీ కొన్ని అంజనపు డబ్బాలూ, భస్మాలూ పంపమని చెప్పమన్నాడు" అని ఎంతో నమ్మేటట్టు చెప్పాడు.

అంతా విని రాకసుడు—"అలాగా, పాపం! అందుకనే వాడు తిరిగి రాలేక పోయాడు. ఇంకా నయం ఆ దుర్మార్గు లెవరో, వాడి దండ కాజేశారు కారు. అదే జరిగితే వాడిని రక్షించటం ఎవరివల్లా కాదు. సరే, యిక నేను పోయి వస్తాను. మీరు మాత్రం ఒక్క పురుగునికూడా లోపలికి రానివ్వకుండా జాగ్రత్తగా చూస్తూవుం డండి" అని చెప్పి బయలుదేరాడు.

ఎప్పుడైతే రాకసుడు వదిలిపోయాడో సంధ్యా నిశీధులు సంతోషంతో ఎగిరి గంతే




శారు. అంతటి రాకసుణ్ణి టోపీ వేశాంగదా అని వారు ఉప్పొంగిపోయారు. ఇంతలో నిశీధుడు "యిక ఒక్క క్షణంకూడా మనం ఆలస్యం చెయ్యకూడదు. వాడు తిరిగి వచ్చే లోగా మనం ఈ భవనంయొక్క రహస్యం ఏమిటో కనుక్కోవాలి" అన్నాడు.

అన్నాదమ్ములు ముందుకు సాగారు. మరికొన్ని ద్వారాలు దాటి, చివరిద్వారం కూడా దాటి వెళ్ళేసరికి ఒక పెద్ద కొలను కనుపించింది. అందులో అందాల హంసలు ఈదులాడుతున్నాయి.

ప్రొద్దుటనగా బయలుదేరి హైరాణ పడుతూవున్న ఆ అన్నాదమ్ములకు చాలా








దాహంవేసింది. దప్పిక తీర్చుకుందామని సంధ్య కొలనులో దిగి, పుడిసెడు నీళ్లు తీసుకుతాగాడు. కాని ఆ నీరు గొంతు దిగిందో లేదో, పాపం!- సంధ్య శిలాప్రతిమగా మారిపోయాడు.

తన కళ్ళయెదటనే సోదరుడు యిలా రాయి అయిపోవటంచూచి నిశీథుడు ప్రతిమలా నిలుచుండిపోయాడు. "ఇంకా నయం, నేనుకూడా తొందరపడి తాగినట్టయితే నాగతీ యింతే అయేది. ఉదయనుడి గతి ఏమయిందా అని పాలుపోకుండా వున్న ఈసమయంలో సంధ్యకూడా యిలా అయిపోయాడే! నాకూ ఏదైనా ఆపద వచ్చిందా, మా అతీగతీకూడా లోకానికి తెలియకుండా పోతుందే" అని అనేక విధాల చింతించాడు.

నిశీథుడు మరికొంతదూరం ముందుకు పోయేసరికి ఒక పెద్ద తోట కనుపించింది. ఆ తోటలో రకరకాల ఫలవృక్షాలున్నై. అన్నిటికంటే చిత్రమైనది ఒక మామిడిచెట్టు. ఆ చెట్టునవున్న కాయలు యిన్నీ అన్నీకావు. ఎక్కడోగాని ఆకే కనుపించటంలేదు. అంత విరగ కాచిందన్నమాట ఆ మామిడిచెట్టు.

నిశీథుడికి ఇప్పుడు బాగా ఆకలివేసింది. గబగబ ఇన్నిపళ్ళు కోసి, ముందు పడవేసుకుని, ఒక పండుతీసి తినబోయాడు. కాని చిత్రమేమిటో, పండు కొరకటంతోటే నిశీథుడు కోతిగా మారిపోయాడు. కోతిగా మారిపోవటంతో 'అయ్యో బాబో, ఇంకా యేమి విడ్డూరాలు జరగబోతాయో, ఈ రాక్షసమాయలు ఎవరు తెలుసుకోగలరు?' అనుకొని, నిశీథుడు తక్కిన పళ్ళు తినకుండా ఎక్కడివక్కడనే వదిలేశాడు. ఆ కోతిరూపంలోవున్న నిశీథుడు తన సోదరుడైన సంధ్య శిలారూపందాల్చిన కొలను వద్దకువచ్చి, చుట్టుచుట్టూ తిరుగసాగాడు.







ఇంతలో కొలనులోనించి ఏదో బుడబుడ మని శబ్దం వచ్చింది. మరి కొద్దిసేపటికల్లా నీటిలోనించి ఒక హంస తనవైపు రావటం కనుపించింది. ఇదంతా కోతిరూపంలోవున్న నిశీధుడు స్పష్టంగా చూడకలుగుతూనే వున్నాడు.

మరికొద్దిసేపటికల్లా ఆ హంస పూర్తిగా బైటికివచ్చి ఒక మనిషిగా మారిపోయింది. నిశీధుడు ఎగిరి గంతేశాడు. ఎందుకని? ఆ వచ్చింది కందకంలో పడి కనబడకుండా పోయిన తనప్రియ సోదరుడు ఉదయనుడే!

ఉదయనుడు ఒడ్డుకి రాగానే సంధ్య శిలాప్రతిమ కంటబడి, కొయ్యబారిపోయాడు.

ఇంతలో కోతిరూపంలోవున్న నిశీధుడు ఉదయనుడి కాళ్లను చుట్టేసుకున్నాడు. అది మామూలుకోతే అనుకుని మొదట ఉదయనుడు దాన్ని విదిలించి కొట్టాడు. కాని, అది విడవకుండా కాళ్లని చుట్టేసుకోవటంచూచి తన సోదరుడైన నిశీధుడే ఇలా మారిపోయి వుంటాడని అనుమానించక తప్పిందికాదు.

ఐతే, ఏమిచెయ్యాలో ఉదయనుడికీ తోచలేదు. సంధ్య యిలా రాయిగా ఎందుకు మారాడో, కోతిరూపంలోవున్నది తన సోదరుడు అవునో కాదో తనకు ఎలా తెలుస్తుంది?

కొంతసేపు అలా ఆలోచించి, ఛటుక్కున ఏదో ఉపాయం స్ఫురించినవానిలా తన జేబులోవున్న భస్మాలూ, అంజనాలూ బైటికి తీశాడు. సంధ్య శిలావిగ్రహంపైన నల్లభస్మం చల్లాడు. ఏమీ కాలేదు. పచ్చ అంజనం రాచిచూచాడు. మార్పు కనిపించలేదు. ఎఱ్ఱఅంజనం రాచాడు. అప్పటికీ ఆ శిలాప్రతిమ అలాగే వుండిపోయింది. ఇన్ని విధాల ప్రయత్నించినా ఫలితం దక్కక పోయేసరికి, ఉదయనుడు ఆ అంజనాలూ





భస్మాలూ కోతిరూపంలోవున్న నిశీథుడిపైన చల్లాడు. కాని ఈసారీ వాటివల్ల మార్పు ఏమీ రాలేదు. కోతి కోతిగానే వుండి పోయింది.

ఉదయనుడికి ఏమిచెయ్యాలో పాలు పోక కొలను ఒడ్డునే కూర్చుని ఆలోచనలో పడ్డాడు.

అప్పుడు కొలనులోని హంసలలో ఒకటి ఉదయనుడి పాదాలముందుగా పోయింది. ఉదయనుడు చటుక్కున దాన్ని పట్టుకొని బైటికితీశాడు. బైటికిరాగానే ఆ హంస ఒక అందాల కన్యగా మారిపోయింది.

ఆ కన్య సిగ్గుతో తలవంచుకుని మాట్లాడకుండా నిలబడింది. ఆమెతో ఉదయనుడు—"నీ వెవరవు? ఇలా హంస రూపంతో ఈ కొలనులో ఎందుకున్నావు? చెప్పితే......" అని యింకా ఏమో అనబో తుండగా—

"ఎక్కడరా మీరూ?" అనే పెద్దకేక ఒకటి వినిపించింది.

ఎప్పుడైతే ఈకేక వినిపించిందో వెంటనే ఆ కన్య వస్తున్నది భవనాన్ని కాపలాకాసే రాక్షసుడేఅని తెలుసుకుని, ఉదయనుడితో-"అదంతా తర్వాత చెబుతా. ముందిప్పుడు ప్రాణాలు రక్షించుకోవాలి" అంటూ, సంధ్య శిలాప్రతిమనూ, ప్రతిమదగ్గిరవున్న కోతినీ కొలనులోకి తోసివేసింది. వెంటనే అవి రెండూ హంసలుగా మారిపోయాయి. తర్వాత ఉదయనుడి చెయ్యి పట్టుకుని తనుకూడా కొలనులోకి దూకింది. దూకీ దూకటంతోనే వాళ్ళిద్దరూకూడా హంసలై పోయారు.

---

[హంస రూపంలో వున్న ఆ కన్య ఎవరు? మన కథలకు తిరిగి మామూలు స్వరూపాలు వచ్చాయా? ఇంతకూ వాళ్లు చిక్కుపడిన ఆ మాయా భవనం ఎవరిది? ఈ చిత్రాలన్నీ వచ్చే నెల చందమామలో చదవండి]








## 9

[ప్రాణాలకు తెగించి ఎలాగో మాయాభవనం చేరుకొన్న సంధ్యా నిశీధులు ఎలా చిక్కుబడిపోయినదీ, ఆతర్వాత వాళ్లు యుక్తివల్ల ఎలా తప్పించుకున్నదీ, చివరికి వాళ్ల ఉనికి ఉదయునుడు ఎలా తెలుసుకోగలిగిందీ క్రిందటిసారి చదివారు. ఆటుతర్వాత—]

"ఎక్కడరా మీరూ?" అనే కేక ఒకటి వినిపించిందన్నాము. ఆ కేక పెట్టింది ఎవరనుకొన్నారు? సంధ్యా నిశీధుల యుక్తి వల్ల గెడ్డపువాడివద్దకు సాగనంపబడిన రాక్షసుడే. వాడు గెడ్డపువాణ్ణి కలుసుకున్న తర్వాత అసలు విషయం వెల్లడి అయింది. "అయ్యో! వాళ్లని అక్కడే వదిలి వచ్చావా? నాదగ్గిర భస్మాలూ అవీ కాజేసి పోవటమే కాక పైగా నీకుకూడా భలే టోపీ వేశారె! వీళ్లెక్కడో గడుగ్గాయిల్లా వున్నారు చూడబోతే. ఇప్పటికైనా మించిపోయింది లేదు, నువ్వు వెంటనే తిరిగి వెళ్లి వాళ్లని పట్టుకో. లేదా మన భవనంయొక్క రహస్యం వాళ్లకి తెలిసిపోతుంది. అది కాస్తా వాళ్లకు తెలిసిందా, నీకూ నాకూకూడా ఆయువు మూడిందన్నమాటే. కనుక వెళ్లు, త్వరగా వెళ్లు" అని గెడ్డపువాడు రాక్షసుణ్ణి తొందరపెట్టసాగాడు.

గెడ్డపువాని సలహా ప్రకారం రాక్షసుడు భవనానికి తిరిగివచ్చేసరికి, తను కాపలా వుంచివెళ్లిన ద్వారంవద్ద సంధ్యా నిశీధులు కనుపించలేదు. అందుకనే వాడు మండిపడి, "ఎక్కడరా మీరూ?" అని పెడబొబ్బలు పెట్టుకుంటూ కొలనువైపుకి వచ్చాడు. తీరా కొలనుదగ్గిరకూడా వాళ్ల జాడ కనుపించలేదు. అందుచేత వాడు








అదేపనిగా, చీమతలకాయంత మేర కూడా విడవకుండా, ఆ చుట్టుప్రక్కల అంతా గాలించసాగాడు. సాయంత్రంవరకూ వెతికినా ప్రయోజనం లేకపోయేసరికి వాడికి ప్రాణం విసిగిపోయింది. నిరాశతో తన భవనం చేరుకొన్నాడు.

రాక్షసుడు యిలా వెతుకుతున్నంతసేపూ ఉదయనుడు తన సోదరులతో సహా హంసలరూపంలో కొలనులోనే వున్నాడు. ఎప్పుడైతే వాడు తిరిగి భవనానికి వెళ్లిపోయాడో అప్పుడు ఉదయనుడు నీటిలోంచి బైటికి వచ్చి మామూలు రూపం పొందాడు. అతనివెంటనే సరోవరకన్య కూడా బైటికి వచ్చి చేరుకుంది. అప్పుడు ఆ కన్య ఉదయనుడితో యిలా చెప్పింది :

"మీరెవరో పాపం దురదృష్టవంతులు. దారి తప్పి ఈ భవనంలో ప్రవేశించినట్టున్నారు. ఈ భవనానికి చుట్టుప్రక్కల నాలుగు కోసులుమేర ఎక్కడ ఏ పురుగు కదిలినా యిట్టే పసికట్టి పట్టివేసెయ్యగల గెడ్డపువాడు ఒకడున్నాడు. వాడిని తప్పించుకురావటం బ్రహ్మతరంకూడా కాదు. మరి మీరెలా వచ్చారో నాకు ఆశ్చర్యంగానే వున్నది. ఇప్పటికైనా మీరు ఈ చోటు వదిలి వెళ్లిపోవటం మంచిది. లేదా మీ ప్రాణాలకే మోసం కలగటం నిజం. ఈ భవనం ఒక దుష్ట రాక్షసుడిది. ఇప్పుడు వాడిక్కడ లేడు. వాడు ఎప్పుడు వచ్చేదీ ఎప్పుడు పోయేదీ ఎవరికీ తెలియదు. ఈలోపల మీ సోదరులకు మామూలు స్వరూపాలు వచ్చే మార్గం నేను చెబుతాను. అలా చేసి, త్వరగా తప్పించుకు వెళ్లిపొండి."

అంతా విని ఉదయనుడు, "మేము పొరపాటున యిక్కడికి రాలేదు. ఈ భవనంయొక్క రహస్యమేమిటో తెలుసుకోవాలనే కుతూహలంతోనే ప్రాణాలనుకూడా లెక్కపెట్టక వచ్చాము. కనుక మమ్మల్ని





గురించి నువు విచారించకు. ఆ రాక్షసుణ్ణి గురించి నీకుకూడా తెలిసిన వివరాలు చెబితే చాలు. ఇంతకూ నీవు ఎవరవో చెప్పావే కాదు. చెప్పటానికి అభ్యంతరం లేకుంటే ఆ విషయం విని సంతోషిస్తా" మన్నాడు.

అందుకు సరోవరకన్య — "చెప్పటానికి అభ్యంతరం ఏమీ లేదు. కాని, తెలుసుకొని నీవు చెయ్యగలిగింది ఏమీ వుండదనుకుంటాను. అయినా అడిగావు గనుక చెబుతాను" అంటూ కొలనులోకి వెళ్లి మరికొద్ది సేపటిలో మరిరెండు హంసలతో బైటికి వచ్చింది. సరోవరకన్యతోపాటు ఆ రెండు హంసలుకూడా ఒడ్డుకి రాగానే రెండు చక్కటి కన్యలుగా మారాయి.

వాళ్లు ముగ్గురూ ఒక్క అచ్చులో పోసినట్టుండటం చూచి ఉదయనుడు "మీరు కవలల్లా కనుపిస్తున్నారే?" అన్నాడు. "అవును" అని వాళ్ల నోటివెంటనుంచి ఎప్పుడైతే మాట వచ్చిందో ఉదయనుడు ఉత్సాహభరితుడై, "అయితే, ఇన్నాళ్లబట్టీ మేము వెతుకుతున్నది మీకోసమే. మీరు దానశీలమహారాజుగారి కుమార్తెలుకదూ?" అని అడిగాడు.



ఈ ప్రశ్నకు ఆ కన్యలు పొందిన ఆశ్చర్యం ఏమని చెప్పటం? "నిజమే. మా సంగతి నీకెలా తెలిసింది?" అని విస్తుపోతూ అడిగారు.

"ఎలా తెలిసేదేమిటి? మీ పుట్టుపూర్వోత్తరాలన్నీ మాకు తెలుసు. మిమ్మల్ని వెతికి పట్టటానికే మేము మీ తండ్రిగారి ఆశీర్వాదం పొంది బయలుదేరాం. మీ పేరు..." అని అడిగాడు ఉదయనుడు.

"సుహాసిని... మా పూర్వోత్తరాలన్నీ తెలుసునన్నారుగా? అటువంటప్పుడు తక్కిన రెండు పేర్లూ మీరే చెప్పుకోగలరనుకుంటాను" అన్నది ఆ కన్య.







"చెప్పకోలేకేం? ఇంత సులభంగా, యింత త్వరలో మిమ్మల్ని కలుసుకో గలుగుతామని మేము కలలోకూడా అనుకోలేదు. ఈ శుభవార్త నా సోదరులకు కూడా తెలిస్తే ఎంత బాగుండునో" అని తన సోదరులు మానవ స్వరూపంతో లేనందుకు విచారం కనబరిచాడు.

ఇది చూచి సుహాసిని "విచారించకు" అంటూ కొలనులోకి దిగి మరికొద్దిసేపటికల్లా కోతిరూపంతో వున్న నిశీధుడితోనూ, శిలాప్రతిమరూపంతో వున్న సంధ్యతోనూ బైటికి వచ్చింది. తర్వాత ఉదయనుడిని వెంటబెట్టుకుని ఆ తోటలో మామిడిచెట్టు దగ్గిరికి తీసుకువెళ్లింది. ఆ చెట్టుకి ప్రక్కనే కొన్ని కుక్కగొడుగులు మొలిచివున్నై. వాటిలో కొన్నిటిని తీసుకోమన్నది. ఉదయనుడు అలాగే చేశాడు. తర్వాత మరికొంత దూరం తీసుకుపోయింది. అక్కడ ఒక రాక్షసవిగ్రహం వున్నది. ఆ విగ్రహం నోటిలోంచి నీరు ప్రవహిస్తోంది. ఆ నీరు కొంత తీసుకోమన్నది. అలాగే ఒక ఆకుతో దొన్నెచేసి యివ్వగా, ఉదయనుడు దాంట్లో ఆ నీరు నింపుకొన్నాడు. వీటితో సహా వాళ్లు తిరిగి కొలనువద్దకు చేరుకున్నారు. అప్పుడు సుహాసిని ఆ కుక్కగొడుగులని కోతికి పెట్టమన్నది. అలాగే చేసేసరికి కోతిరూపం పోయి, నిశీధుడికి తిరిగి మామూలురూపం వచ్చింది. తర్వాత దొన్నెతో తెచ్చిన నీరు శిలాప్రతిమకు రాచేసరికి సంధ్యకు మామూలురూపం వచ్చేసింది.

అప్పుడు ఉదయనుడు ఆ కన్యలను తన సోదరులకు చూపుతూ, "చూచారా, చిత్రం! మనం ఎవరికోసం వెదుకుతున్నామో ఆ రాజకుమార్తెలే వీరు. కనుక మనం వచ్చిన పని అయినట్టే. ఇక వీరిని తీసుకుని మనం ఈ మాయాభవనంనుంచి బైటపడే మార్గం చూడాలి" అన్నాడు.





అందుకు సుహాసిని "అది అంత తేలికైన పని గాదు. మమ్మల్ని రక్షించటం మాట అలావుంచి ముందు మీ ప్రాణాలు కాపాడుకోవటానికి యిక్కడినుంచి బైట పడగలిగితే......" అని యింకా ఏమో చెప్పబోతుండగా ఒక పెద్ద సుడిగాలి ప్రారంభమైంది. అప్పుడు సుహాసిని "అడుగో, వాడు వస్తున్నాడు. ఈ సుడిగాలి దానికే గుర్తు. ఇక మేము తిరిగి కొలను లోకి పోతాం. మరి మీ గతి ఏమిటి? క్రిందటిసారిలాగా హంసలుగా మార్చినా వాడు మిమ్మల్ని పట్టివేయగలడు. మరి ఎలా తప్పించుకుంటారో జాగ్రత్త" అని చెబుతూ సుహాసిని తన చెల్లెళ్లతో సహా కొలనులోకి పోయింది.

వెంటనే ఉదయనుడు తనవద్ద వున్న తెల్ల భస్మం తనపైనా సోదరులపైనా చల్లాడు. వెంటనే వాళ్లు మాయమై పోయారు. మరికొద్ది సేపటికల్లా సుడిగాలి తగ్గిపోయింది. ఆ వెంటనే ఒక బ్రహ్మాండమైన గద్ద కొలనుఒడ్డున వచ్చి వాలింది. కాని చిత్రం! ఒడ్డున వాలుతూనే దానికి గద్దరూపం పోయి ఒక భయంకరమైన రాక్షసాకారంతో నిలబడింది.








సహాయంతో పళ్లూ ఫలాలూ సృష్టించుకుని పొట్టలు నింపుకొన్నారు. తర్వాత కవల కన్యలు తిరిగి బైటికి వస్తారేమోనని కొంత సేపు ఎదురుచూచారు. కాని ఎంతసేపటికీ వాళ్లు రాకపోయేసరికి, యిక ఆ రాత్రికి ఎలాగో అక్కడే గడపవలసి వుంటుం దని నిశ్చయించుకున్నారు. మామూలు రూపంతో వుండటం క్షేమం కాదని వాళ్లు భస్మం మహిమవల్ల తిరిగి అదృశ్యరూపం పొంది అక్కడే వుండిపోయారు.

తెల్లవారింది. కొలనులోంచి కవల కన్యలు బైటికి రావటమూ, మన కవల సోదరులు తిరిగి మామూలు స్వరూపం పొందటమూ ఒక్కసారిగా జరిగింది.

అప్పుడు ఉదయనుడు సుహాసినిని అడిగాడు: "అయితే ఈ రాక్షసుడు తిరిగి ఎక్కడికి వెళ్లాడు? మళ్లీ ఎప్పుడు వస్తాడు?" అని.

"ఎక్కడికేమున్నది. వేటకి వెళ్లివుం టాడు. వేట అంటే జంతువుల వేటకాదు. 'కవలల వేట'" అని బదులు చెప్పింది సుహాసిని.

"కవలల వేట ఏమిటి?" అని మళ్లీ ప్రశ్నించాడు ఉదయనుడు.

ఆ రాక్షసుడు అలా నిలబడగానే కొలనులో వున్న హంసలన్నీ రెక్కలు రెప రెప కొట్టుకొంటూ వచ్చి బారులు తీర్చి ఒడ్డు దగ్గరగా నీటిలో నిలిచినై. రాక్షసుడు ఒక్క క్షణంసేపు వాటివంక పరీక్షగా చూచి ఆ వెంటనే తిరిగి గద్దరూపంలో రివ్వున ఆకాశమార్గాన వెళ్లిపోయాడు.

ఇదంతా జరిగేటప్పటికి బాగా చీకటి పడింది. ఉదయనుడు తన భస్మం సహా యంవల్ల తనకూ సోదరులకూ మామూలు స్వరూపాలు తెప్పించుకున్నాడు. అప్పటికి మూడు రోజులైంది వాళ్లు తిండితిని. అందు వల్ల ముందుగా తమదగ్గిర వున్న తువ్వాలు







"అదొక చిత్రమైన రహస్యం. ఈ రాక్షసుడు ఒక దేవిని ఆరాధిస్తున్నాడు. ఆ దేవియొక్క మహిమవల్లనే ఈ మాయా భవనం నిర్మించగలిగాడు. ఇందుకుగాను వాడు దేవికి యాభైమంది కవలల్ని బలి యివ్వాలి. ఈ బలి పూర్తి అయిందంటే దేవి వాడికి అన్ని మహిమలూ ప్రసాదించటమేగాక మరణం అనేది లేకుండా కూడా వరం యిస్తుంది. ఇప్పటికి నలభై ఏడుగురు కవలలు మాత్రమే వాడికి చిక్కారు. 'తక్కినవారు ఎప్పుడు చిక్కుతారా ఎప్పుడు బలి అర్పించి దేవియొక్క వరం పొందుతానా' అని వాడు ఒక్క క్షణం కూడా స్తిమితంలేక యిలా నిత్యమూ గద్ద రూపంలో ప్రపంచం అంతా చుట్టి వస్తుంటాడు" అని రాక్షసుడిని గురించిన గుట్టు కాస్తా వెల్లడించింది సుహాసిని.

ఇదంతా మన కవల సోదరులు ఎంతో శ్రద్ధగా చెవులు రిక్కించి విన్నారు. అంతా విని, "ఆహా! ఎంత అదృష్టవంతులం? మేము ముగ్గురం వాడికి చిక్కివున్నట్టయితే ఈ రోజుతో వాడి వేటా పూర్తి అయేది. బలీ సంపూర్ణమయేది సుమా!" అన్నాడు ఉదయనుడు.

"అదెలాగ? మీరూ కవలలేనా?" అని ఆశ్చర్యంతో అడిగారు కవలకన్యలు.

"అవును. వాడికి కావలసిన మనుష్యులమూ, మిమ్మల్ని రక్షించవలసినవాళ్లమూ మేమే అయామే అని విచారిస్తున్నాను" అన్నాడు ఉదయనుడు.

"అలాగైతే మీరు మరీ జాగ్రత్తగా మసలుకోవలసివుంటుంది" అని హెచ్చరించింది సుహాసిని.

"అవును. అసలు రహస్యం ఇప్పుడు తెలిసింది కనుక యికముందు ఉండవలసిన జాగ్రత్తలోనే వుంటాం. కాని ఎలాగైనా యిక్కడినుంచి బైటపడే మార్గం ఆలోచిం





చాలి కదా ? ఈ చోటు అంతా మాయా జాలంతో నిండివున్నట్టు తెలుస్తోనేవుంది. అందువల్ల యిక్కడినుంచి బైటపడటంలో మనం ఎదుర్కోవలసిన కష్టాలు ఏముంటయ్యో తెలియజేస్తే వాటికి తగిన ఉపాయం ఆలోచిస్తాము" అన్నాడు ఉదయనుడు.

అందుకు సుహాసిని—"అన్నింటికన్నా ముఖ్యమైన విషయం ఒక్కటే వున్నది. అది ఏమిటీ అంటే మీరు ఆ రాక్షసుడి కంటబడకుండా వాడి భూగృహంలో ప్రవేశించగలిగితే సరి" అన్నది.—

ఇది విన్న ఉదయనుడు "ఒస్, ఇదొక ఘనకార్యమా. మాదగ్గరవున్న భస్మాలవల్ల మేము ఎలా అదృశ్యరూపం పొందగలుగుతున్నదీ మీరే చూస్తున్నారుకదా ?" అని ప్రశ్నించాడు.

అందుకు సుహాసిని—"మహా గొప్ప ఉపాయం కనిపెట్టావే ! ఇంకా నయం ముందుగా చెప్పావు కనుక తెలుసుకోగలిగాను. నీ భస్మాలూ అంజనాలూ వాడి భూగృహంలో పని చెయ్యవు. వాటి మహిమ అల్లా యిక్కడ ఉన్నంతవరకే. కనుక వాటి ఆశ పెట్టుకోబోకు" అన్నది.

ఎప్పుడైతే ఈవిషయం విన్నారో అప్పుడు మన కవలలకు అదివరకున్న ధైర్యం కాస్తా జారిపోయి తెల్లమొగం వేశారు. వాళ్ల విచారం కనిపెట్టిన సుహాసిని, 'అలా అధైర్యపడతారేం, బుద్ధిబలం ఉపయోగించి ఏదైనా ఉపాయం ఆలోచించాలి?" అన్నది.

"ఆలోచించేందుకైనా వ్యవధి ఉండాలి కదా !" అన్నాడు ఉదయనుడు.

అందుకు సుహాసిని—"నిజమే. నిదానంగానే ఆలోచించాలి" అన్నది.

---

[కవల సోదరులు ఉపాయం ఏదైనా ఆలోచించగలిగారా? రాక్షసుడి చేతుల్లో పడకుండా వాళ్లు తప్పించుకోకలిగారా? ఈ మొదలైన మరికొన్ని చిత్రాలు వచ్చేనెల.]









## 10

[రాక్షసుడి మాయవల్ల అసలుస్వరూపాలు పోయి ఒకడు శిలాప్రతిమగాను, రెండవవాడు కోతిగాను కవలసోదరులు ఎలామారిపోయారో, తిరిగి మామూలురూపాలు ఎలాపొందారో, రాక్షసుణ్ణిగురించి రాకుమార్తెలు చెప్పిన రహస్యం ఏమిటో చదివారుకదా? అతర్వాత]

త్రమవద్దనున్న భస్మాలూ, అంజనాలూ రాక్షసుడి భూగృహంలో పనిచెయ్యవు అని తెలిసినప్పటినుంచీ, మన కవల సోదరులు వేరే మార్గం ఏమిటా అని ఆలోచించసాగారు. ఇలా ఆలోచిస్తూపోగా వాళ్లకి ఒక సందేహం కలిగింది.—"ఈ రాక్షసుడు ప్రపంచంలో ఎక్కడెక్కడి కవలలనూ యిట్టే పసిపట్టి తెస్తాడుకదా! యింతకాలం మన జోలికిరాకుండా వూరుకొనటానికి కారణం ఏమైవుంటుందీ?" అని.

మర్నాడు వాళ్లు రాకుమార్తెలను కలుసుకొన్నప్పుడు ఉదయనుడు తమకుకలిగిన ఈ సందేహాన్ని వెల్లడించేసరికి, వాళ్ళూ ఆశ్చర్యపోయారు. "నిజమే సుమా! మాకు యింతవరకు ఈ సందేహమే కలగలేదు. బహుశా ఒక కారణంవల్ల వాడు మీ జోలికి రాకుండా ఉండివుంటాడని యిప్పుడు నాకు తోస్తున్నది. ఐతే..."అని వూరుకున్నది సుభాషిణి.

"ఫరవాలేదు, చెప్పు. నీవు వూహించిన కారణమే నిజమైతే తగుజాగ్రత్తలో ఉండవచ్చుకదా" అన్నాడు నిశీథుడు.

అప్పుడు సుభాషిణి—"ఏమీ లేదు. ఏ విధమైన అవయవలోపమున్నా ఆ కవలలు రాక్షసుడి బలికి పనికిరారు. బలి యివ్వబోయే సమయమందు ఈ విషయాన్ని







వాడు బాగా పరిశీలిస్తాడు. చూడగా మీకు అలాంటి లోపాలేవీ మామట్టుకు కనుపించ లేదు. కనుకనే యిలా మిమ్మల్ని అడగ టానికి జంకు కలిగింది" అన్నది.

ఇది వింటూనే కవలసోదరులు ముగ్గురు ఒక్కసారిగా "నీకు సరియైన సందేహమే కలిగింది" అన్నారు.

తర్వాత ఉదయనుడు పుట్టుకతో తమ చూపుల విషయంలో ఎలాంటి లోపాలుండేవీ, ఆతర్వాత గెడ్డపువాడి పుణ్యమా అంటూ ఆ లోపాలు ఎలా తొలగిపోయిందీ రాకుమార్తెలకు విస్తరించి చెప్పాడు.

వాళ్లు యిలా మాట్లాడుకొంటుండగా రాక్షసుడి రాక తెలిపే సుడిగాలి ప్రారంభ మైంది. వెంటనే రాకుమార్తెలు కొలను లోనికి వెళ్లిపోయారు. కాని, పాపం ఈసారి మన కవలసోదరులు తప్పించుకోలేక పోయారు. ఉదయనుడు తనవద్దవున్న భస్మం తీసి సరిగ్గా మీదచల్లుకోబోయేసరి కల్లా రాక్షసుడు అమాంతం ప్రత్యక్షమై వాళ్ల ముగ్గురునీ తన గుప్పిటిలో చిక్కించు కొన్నాడు.

మన కవలసోదరులు లోలోపల భయంతో గజగజ వణికిపోతున్నా పైకి మాత్రం ధైర్యంగానే వున్నారు.

అప్పుడు రాక్షసుడు—"ఎవరు మీరు? ఈ నా రహస్య ప్రదేశానికి ఎలా వచ్చారు? నిజం చెప్పండి. లేదా యింతకుముందు వచ్చిన వాళ్ల గతి యేమయిందో అదేమీకూ అవుతుంది" అని గర్జించాడు.

అందుకు ఉదయనుడు—"నిజమే నయ్యా. ఇక్కడికి రావటం కష్టమనీ, ఎంతో ప్రమాదకరమనీ, తీరా యిక్కడికి వచ్చాకకాని మాకు తెలియనేలేదు. ఐనా మేము ప్రాణాలకు తెగించి వచ్చాం కనుక మేముచెప్పే యదార్థం విని, ఆ తరువాత





నీ యిష్టమొచ్చినట్టు చేసుకో" అన్నాడు ఉదయనుడు.

"ఓహెూ! 'పిట్ట కొంచెం కూత ఘనం' అన్నట్టుందే మీ వాలకం చూడగా? మా తమ్ముణ్ణి టోపీవేసింది మీరేకదూ? సరే, అసలిక్కడికి ఇలా దొంగతనంగా ఎందు కొచ్చారో చెప్పండిముందు" అని గద్దించాడు రాక్షసుడు.

"అదే పొరపాటు. మేము దొంగతనంగా రాలేదు. అలా రావలసిన అవసరం మాకు లేదు. మేము వచ్చిన పని ఏమిటీ అంటే ......" అని ఉదయనుడు ఏమో చెప్ప బోతుండగా—

"ఏమిటి ఏముంది? నాకు టోపీ వేయటానికే" అనే మాటలు వినిపించినై.

ఆ మాటలు వచ్చిన దిక్కుకి తిరిగి చూచేసరికి, మొట్టమొదటగా తాము ఎవరి నైతే మోసపుచ్చి గెడ్డపువాడిదగ్గరకు పంపారో ఆ రాక్షసుడే తమవైపు చరచర నడిచివస్తూండటం కనుపించింది.

వాడు వస్తూనే—"అన్నా, వీళ్ల సంగతి యిక నేను చూచుకుంటాను. కాలం వృధా పుచ్చకు. నీ వేటకి నువ్వు పో" అన్నాడు.




తమ్ముడు ఎప్పుడైతే యిలా అన్నాడో అప్పుడు రాక్షసుడు "యిదేదో పెద్ద గాథ లాగా ఉన్నది. వీళ్లు మా తమ్ముడికి తెలిసినవాళ్లుగానే కనిపిస్తున్నారు. కనుక వీళ్ల సంగతి వాడే చూచుకోవటం మంచిది" అనుకుంటూ తిరిగి గద్దరూపంలో రివ్వున ఆకాశమార్గాన వెళ్లిపోయాడు.

ఆవెంటనే రాక్షసుడు మన కపలసోదరులను వెంటబెట్టుకుని తను కాపలా కాసే భవనంలోకి తీసుకుపోయాడు. వాళ్లని సావకాశంగా కూచోబెట్టుకుని "అబ్బాయిలూ! గెడ్డపువాణ్ణి టోపీవేశారు. నన్ను టోపీవేశారు. ఇప్పుడు మా అన్నను టోపీవెయ్యజూచారు.








కాని పాపం మీ ఆటలుసాగక, నా చేతిలో చిక్కిపోయారు. గెడ్డపువాడిదగ్గిర మీరు కాజేసిన అంజనాలూ, భస్మాలూ, తువ్వాలూ అన్నీ అక్కడ పెట్టండి. తర్వాత తక్కిన సంగతులు మాట్లాడుకుందాం" అన్నాడు.

పాపం, ఏమిచేస్తారు కవలసోదరులు? తప్పనిసరిగా ఆ వస్తువులన్నీ అక్కడపెట్టి వేశారు. అప్పుడు రాక్షసుడు "అబ్బాయిలూ! ఇంతకాలంగా యిక్కడ కాపలా కాస్తున్నాగాని నన్ను తప్పించుకు లోపలికి పోయినవాళ్లు ఒక్కరూ లేరు. ఎవరు వచ్చినా నా చేతిలో చిక్కిపోయి శిలాప్రతిమలుగా మారిపోవలిసిందే. అదిగో చూడండి వాళ్లంతా యింకా ఎలాగ అఘోరిస్తున్నారో. అలాంటిది ఆ రోజున మీరు నాకు టోపీ వేసినప్పటినించీ నేను కడుపునిండా తిండి కూడా తినటంలేదు. భలే ఆకలిగావున్నది. ఈ నెలరోజుల వారా మీ పేరు చెప్పుకుని, యివాళ లక్షణంగా కడుపునింపుకొంటా" నంటూ మాయతువ్వాలు పరిచి ఆహారం కోరుకున్నాడు.

తన కడుపు బాగా నింపుకొని రాక్షసుడు కవల సోదరులకుకూడా వాటిల్లో కొన్ని ఫలాలు యిచ్చాడు తినమని. వాళ్లు కూడా కడుపులు నింపుకొన్న తర్వాత రాక్షసుడు వాళ్లని ముగ్గురినీ ఒక త్రాటితో కట్టివేసి "కాసిని నీళ్లు తాగి వస్తాను, వుండండి" అంటూ కొలనువైపుకి వెళ్లాడు.

మరికొద్దిసేపటికి రాక్షసుడు ఒక మూడు ఆకుదొన్నెలతో నీళ్లు తీసుకొని తిరిగివచ్చి వాటిని సోదరులకు యిచ్చాడు.

ఇదంతా తమపైన అభిమానంతోనే చేస్తున్నాడనుకున్నారు సోదరులు. అందుచేత వాడు యిచ్చిన నీళ్లు గడగడ త్రాగివేశారు. నీరు గొంతుదిగేసరికల్లా ఇంకేముంది పాపం, ముగ్గురూ మూడు శిలాప్రతిమ లయిపోయారు.





ఇలా కాగానే రాక్షసుడు 'హా! హా!! హా!!!' అంటూ ఆ భవనం ప్రతిధ్వనించేట్టు విరగబడి నవ్వుతూ ఈ కొత్త శిలా ప్రతిమలను తను కాపలా కాస్తున్న వాకిలి ప్రక్కన వుంచాడు.

ఇక్కడ ఈ విధంగా కపలసోదరులు ముగ్గురూ చిక్కుపడిపోయారా? ఇక అక్కడ దానశీల మహారాజూ, రాణీ పద్మముఖీ ఎలా వున్నారో ఒక్కసారి చూదాం.



* * *

తన ముద్దుల కూతుళ్లు ముగ్గుర్నీ వెతుక్కు రావటానికని కపలసోదరులకు గుఱ్ఱాలిచ్చి పంపినరోజునే రాజు ఒక పని చేశాడు. కోట పైఅంతస్థుమీద ఒక చిత్రమైన చిన్న గది కట్టించుకున్నాడు. అగదిలో కూర్చుని చూచినట్టయితే చుట్టుప్రక్కల కనుచూపు మేరలో ఎక్కడ ఎటువంటి సంచారం వున్నా స్పష్టంగా కనుపిస్తుంది రాజుకి. ఈ గదిలో కూచుని రోజు యిరవై నాలుగు గంటలూ కన్నులు కాయలుకాచేట్లు చూస్తూవుండటమే ఆయన పని.

కపలసోదరులు బయల్దేరి ఇప్పటికప్పుడే అయిదేళ్లు దాటింది. ఇంతవరకు వాళ్ల అతీ గతీ లేదు. అందుకని రోజురోజుకీ రాజుకి వ్యాకులత హెచ్చు కాజొచ్చింది. అయినా ఆశ పీడించటంచేత మధ్యమధ్య ఆస్థాన జ్యోతిష్కుని సంప్రతిస్తునేవున్నాడు. 'అమ్మాయిలు ఎక్కడనో జీవించేవున్నారనీ, సుఖంగా తిరిగి రాగలరనీ, నిస్పృహ చెందవలసిన పని లేనేలేదనీ' జ్యోతిష్కుడు కచ్చితంగా చెబుతూ వుండటంచేత రాజు ఎలాగో ప్రాణాలు ఉగ్గబట్టుకు వుంటున్నాడు.

ఒకనాడు తెల్లవారుజామున మసక చీకటిగావుండగా రాజు యథాప్రకారం గదిలో కూచుని చూస్తూవున్నాడు. ఆ మసక వెలుగులో దూరాన రెండుగుఱ్ఱాలు శర








వేగంతో తన భవనంవైపు రావటం కనుపించింది. ఆ గుఱ్ఱాల రంగూ, వాటిపైన మనుష్యుల ఆకారాలూ, వీటిమాటకేం, వాటిని కట్టివున్న ఆ నల్లజెండాలూ చూచేసరికి రాజు కెవ్వున కేకపెట్టి బాకుతో పొడుచుకోబోయాడు. దైవవశాత్తు, కేకవిన్న సేవకులు రెప్పపాటులో అక్కడకు చేరుకోవటంవల్ల ఆ ప్రమాదం కాస్తా తప్పింది. ఐతే, రాజు స్పృహతప్పి పడిపోయాడు.

కొంతసేపటికే రాజు తెప్పరిల్లుకోవటమూ, ఆ గుఱ్ఱాలు రెండూ అక్కడకువచ్చి చేరుకోవటమూ ఒక్కసారిగా జరిగింది.

ఆ వచ్చిన గుఱ్ఱాలు కవలసోదరులకు స్వయంగా తను యిచ్చిపంపినవే. అయినా వాటిపైన వచ్చినది కవలసోదరులు కాదు! వాళ్లు తన సేవకులు!!

వాళ్లవైపు రాజు ఆత్రంగా పరుగెత్తుకెళ్ళి "అమ్మాయిలు ఏరీ? ఆ కవలపిల్లలేరీ? ఈ గుఱ్ఱాలు ఎక్కడివి మీకు?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించాడు.

అందుకు సేవకులు— "మహారాజా! క్షమించండి. అమ్మాయిల సంగతిగానీ, కుర్రవాళ్ల సంగతిగానీ మాకేమీ తెలియదు. ఊరూరా మేము వెతుక్కొంటూ పోగా





పోగా ఒకానొక మైదానంలో ఈ అశ్వాలు మాకు కనుపించినై. వీటిని వెంటనే పోల్చుకుని, మన అమ్మాయిలూ, ఆ కవలలూ కనపడతారేమోనని ఆ ప్రదేశమంతా కలియ వెతికాము. ఎంతకూ వారి జాడ తెలియకపోయేసరికి, ఒకవేళ వారు ఇంటికే చేరుకున్నారేమో చూదాం, లేదా ఇంత వరకు వర్తమానమైనా అందించుదాం అని మేము వచ్చేశాము ప్రభూ!" అని విన్నవించుకున్నారు.

అంతావిని, 'అంతటి అదృష్టమా!' అంటూ రాజు తిరిగి దుఃఖంతో పడిపోయాడు.

అంతాచేరి రాజుకు ధైర్యంచెప్పి వూరడించగా తిరిగి మనస్తిమితం చిక్కినతర్వాత గుర్రాలపైన ఎక్కివచ్చిన సేవకులిద్దరను ఎదటికి పిలిచి "ఓరి వాజమ్మల్లారా!— అమ్మాయిలను వెదికి వెంటబెట్టుకు రాక ఎందుకని వచ్చినట్టు మీరు? వాళ్లను వెతక బోయిన కవలసోదరుల గతి యేమైందో పాపం! ఆ కసుగందులు ఏమి ఆపదలలో చిక్కుకున్నారో! లేకుంటే వాళ్ల జాడ తెలియకపోవడ మేమిటి ఇంతవరకూ? నాకు పూర్తిగా ప్రాణం విసిగిపోయింది. క్షణం కూడా నిలవలేకపోతున్నాను. మళ్ళీ మీరు వెంటనేవచ్చే ఆశ వున్నదా? ఏమో, మీరు తిరిగివచ్చేలోపల నాపని ఎలా వుంటుందో. సరే పోయిరండి!" అంటూ వాళ్లను సాగనంపాడు.

ఈ సేవకులు వచ్చిన వర్తమానం ఆ నోటా ఆనోటా అంతఃపురంలోకి పాకిపోయి, ఆదమరిచివున్న రాణికి మళ్లీ పిచ్చిపట్టింది.

---

[అక్కడ మన సోదరులగతి ఏమైందిపాపం? వాళ్లు అలా శిలాప్రతిమలుగానే వుండిపోయారా? అసలు ఇలా జరిగినట్టు రాకుమార్తెలకు తెలుస్తుందా, లేదా? ఈ సమస్యలన్నీ వచ్చేనెల]








## 11

[రాక్షసుణ్ణి గురించిన రహస్యం తెలుసుకున్నాముగదా అని సంతోషించేటంతలో మన కవలలు ఎలా పట్టుబడిపోయినదీ, ఆ తర్వాత వాళ్లు రాక్షసుడి మోసంలో పడి ఎలా శిలాప్రతిమలుగా మారిపోయినదీ, క్రిందటినెల చదివారుకదా? ఆ తర్వాత—]

రాక్షసుడిచేతిలో కవలసోదరులు చిక్కిపోవటమూ, ఆ తర్వాత వాడి తమ్ముడు వాళ్ళను తన వెంట తీసుకుపోవటమూ, యిదంతా కొలనులో హంసలరూపంలో వున్న రాకుమార్తెలు చూస్తూనే వున్నారు. రాక్షసులిద్దరుకూడా గమనించని విషయంకూడా వాళ్లు చూచారు. అది ఏమిటీ అంటే ఉదయనుడు డబ్బీతీసి తెల్లభస్మం మీద చల్లుకోబోయేసరికల్లా రాక్షసుడు రావటం జరిగింది. ఆ తొందరపాటులో భస్మం చల్లుకోలేకపోగా డబ్బీ కాస్తా క్రింద పడిపోయింది. దాన్ని తిరిగి తీసుకుందామంటే వీలుగాక అక్కడే వదిలేశారు.

రాక్షసులు ఎవరిదారిన వారు వెళ్ళిపోగానే రాకుమార్తెలు కొలనులోంచి బైటికి వచ్చి ఆ డబ్బీకోసం వెతికారు. కాని అది కనుపించలేదు.

ముగ్గురూ ఆశ్చర్యపోయారు. "ఇదేమిటి చిత్రంగా వున్నదే! ఆ డబ్బీని మనం ముగ్గురం చూస్తూనేవుంటిమి కదా? ఎలా మాయమయివుంటుంది? ఇక్కడే ఎక్కడో ఉండివుండాలి. వెతుకుదాం రండి" అన్నది సుహాసిని.

అలాగే వాళ్లు ముగ్గురు చుట్టుప్రక్కల వెతుకుతూపోగా కొలనుకు చాలాదూరాన ఒకచోట డబ్బీ కనుపించింది.








ఇక వాళ్లు డబ్బీని ఎక్కడ దాచటమా అని. ఆలోచించి ఆలోచించి, చివరకు కొలను ఒడ్డునే ఒకచోట చిన్న గుంటత్రవ్వి దానిలో కప్పెట్టారు.

ఆ క్షణం మొదలుకొని వాళ్లు కవల సోదరులను రక్షించే మార్గం ఏమిటా అని ఆలోచించసాగారు. చివరకు ఒకనాడు సుకేశిని, "నాకు ఒక ఉపాయం తోచింది చెప్పనా?" అన్నది.

ఇది విని సుభాషిణీ, సుహాసినీ ఏమిటా ఉపాయం?" అని ఉత్సాహంతో అడిగారు.

అప్పుడు సుకేశిని—"ఎలాగైనా రాక్షసుణ్ణి అక్కడనుంచి కదిపి యివతలకు తీసుకురావాలి. ఇది ఒకలా చెయ్యవచ్చు. మనమందరము కలిసి వాడిదగ్గిరికి పోయి, నృత్యం చేసి చూపుతామని నమ్మిం చుదాం. ఇలా మనలో వెళ్లదలిచిన ఎవరో ఒకరు కొంత మంత్రజలాన్ని తీసుకువెళ్లి, ఆ కుర్రవాళ్ల శిలాప్రతిమలమీద చల్లి వాళ్లకి మామూలు స్వరూపాలు తెప్పిం చాలి. రాక్షసుడి కంటపడకుండా ఒకళ్లం అక్కడే వుండిపోయి ఈ పని చెయ్యవచ్చు. తర్వాత ఏమి చెయ్యటమా అనేది కుర్ర వాళ్లనే సంప్రతించవచ్చు" అన్నది.

ఇదివిని సుహాసిని, "వాడేం సామా న్యుడా మన టోపీలో పడటానికి. ఒకవేళ మనం వాణ్ణి టోపీవేసి అక్కణ్ణించి యివ తలకు తీసుకురాగలిగినా, వాడి భవనంలో వుండి వాడి కన్ను కప్పి ఇంత చెయ్యటం మాటలా? మనంకూడా చిక్కిపోయామా అంటే మన సంగతీ ఆ కుర్రవాళ్ల సంగతీ మనవాళ్లకు తెలిసే అవకాశం కాస్తా పోతుందే. ఈ ఉపాయమేమో బాగానే వుంది, కాని ఆచరణమటుకు అసాధ్యమని పిస్తున్నది" అని అన్నది.

అందుకు సుకేశిని—"సరేలే. ధైర్యం లేకపోతే ఎవరూ ఏపనీ చెయ్యలేరు.





అపాయంలో చిక్కుకుంటామని చెప్పి రక్షించకుండా ఉండగలమా?" అన్నది. సుహాసినీ, సుభాషిణీ ఔనౌనన్నారు.

మర్నాడు కొలనులోవున్న హంసలన్నీ ఒడ్డుకి వచ్చినై. రావటంతోటే వాటికి మను ష్యాకారాలు వచ్చినై. మనరాకుమార్తెలకు మల్లేనే వాళ్ళంతా రాక్షసుడి చేతిలో చిక్కి పోయినవాళ్లే. వాళ్లలో ఆడపిల్లలు వున్నారు, మగపిల్లలూ వున్నారు.

మగపిల్లలందరినీ కొలనులోకి తిరిగి వెళ్లిపొమ్మన్నది సుహాసిని. అలాగే వాళ్లు వెళ్లిపోయారు. తక్కినవాళ్లంతా ఆడపిల్లలే. వాళ్లంతాచేరి, ఆ తోటలో పువ్వులు కోసుకుని చక్కా అలంకరించుకుని పాడుకుంటూ, రాక్షసుడి భవనంవైపుకి రాసాగారు.

ఈ సందడి చెవినిపడేసరికి రాక్షసుడే వాళ్లకు ఎదురువచ్చి, "ఇదేమిటి? యిలా బయలుదేరా రెక్కడికి? నా మీద దాడి చేద్దామనా?" అన్నాడు చిద్విలాసంగా.

అందరిలోకి ముందున వున్న సుకేశిని "నీ అంతటివాడిపైన దాడి చెయ్యటం ఎవరి తరం? క్రొత్తగా చిక్కిన ముగ్గురు కుర్రవాళ్లూ ఏమైపోయారో చూతామని వచ్చాం" అన్నది.



అందుకు రాక్షసుడు పగలబడి నవ్వుతూ "ఏమవుతారు? అంతకుముందు వచ్చిన వాళ్లేమయ్యారో, వీళ్లూ అంతే. ఏం, చూస్తారా?" అంటూ భవనంలోకి వెంట బెట్టుకువెళ్లి కవలసోదరుల శిలాప్రతిమలు వరసన ఒక్కొక్కటిగా చూపాడు.

వాటినిచూస్తూ సుకేశిని, "బాగానే వున్నది నీవుద్యోగం. కాని, నాకొక సందేహం తీర్చు. యింతమందిమి కలిసి మెలిసి వుంటున్నా ఈ నిర్బంధంతో ప్రాణం విసిగి పోయి, మీ అన్న చేయదలుచుకున్న బలి త్వరగా అయిపోతే బాగుండునే అనిపిస్తున్నది మాకు. అటువంటిది నువ్వు ఒక్కడివీ ఈ







శిలాప్రతిమలమధ్య విసుగూ విరామం లేకుండా ఏళ్లతరబడి ఎలా కాపలా కాస్తున్నావయ్యా?" అని నిబ్బరంగా అడిగింది.

అందుకు రాక్షసుడు—"నాకుమాత్రం విసుగెత్తటం లేదనుకున్నారా? కాని ఏం చేయటం? ఈ చోటువిడిచి వెళ్లానో మిమ్మల్ని బలియివ్వటానికి ముందు నన్నే హతమారుస్తాడు మా అన్న. ఏమీ తోచక నేనూ సతమతమవుతూనే వున్నాను" అని మనసులో బాధ వెలిపుచ్చాడు.

వెంటనే సుకేశిని అందుకున్నది—"ఎంతసేపని యిలా? పోనీ కాస్సేపు మాతోపాటు వచ్చి కులాసాగా ఉండకూడదా? నీకు ఆనందం కలిగేటట్టు ఆటలాడతాం, పాటలు పాడతాం. మాకూ కొంత ఊసుపోతుంది. రా, చూదుగాని తమాషా" అని హుషారీ చేసింది.

"అమ్మయ్యో! ఈ భవనం విడిచి వచ్చేయటమే? ఏనుగంతవాణ్ణి నేను కాపలా కాస్తుండగానే నా కళ్లల్లో దుమ్ముకొట్టి ఈ కుర్రవాళ్లు ఎలాగో ప్రవేశించారే, భవనం వదిలితే మరేమైనా వుందా?" అన్నాడు.

"అఁ—నీ భ్రమగాని యిక్కడికి ఎవరు రాగలుగుతారు? వచ్చారే అనుకో. నీచేతిలో చిక్కక ఎక్కడికి పోగలరు? పోనీ మాలో ఒకరు నీబదులు కాపలా కాస్తూవుంటాము. కాస్సేపు కులాసాగా కాలక్షేపం చేసి, తిరిగి నీ ఉద్యోగానికి నువ్వు పోదువుగాని" అన్నది సుకేశిని. ఈ మాట రాక్షసుడికి నచ్చింది.

"మరైతే నాబదులు కాపలా కాసేది ఎవరు?" అని అడిగాడు.

సుకేశిని సుహాసినివైపు అట్టె చూసి, "మరెవరోనా? మా అక్కే ఉన్నది" అన్నది. ఆప్రకారమే సుహాసినిని భవనంలో వదిలి వాళ్లు కొలనువైపుకి బయలుదేరారు.

కొలను ఒడ్డున వాళ్లు రాక్షసుణ్ణి మధ్య కూర్చోపెట్టి చుట్టూ చేరి నృత్యం చెయ్య







సాగారు. వాళ్ల ఆటపాటలకు రాక్షసుడు తన్మయుడై "రోజూ యిలా కాలక్షేపంచేస్తే బాగుండునే" అన్నాడు.

రోజూ ఎవరో ఒకరు రాక్షసుడిబదులు కాపలా కాస్తుండటమూ, వాడు ఆటపాట లకు ఆనందించటమూ అలవాటైంది.

నాలుగురోజులు గడిచేసరికి, అంతకు మునుపు భవనంవిడిచి రావటానికి భయ పడే రాక్షసుడు, యిప్పుడు తనంతట తనే వచ్చి రాకుమార్తెలను రమ్మనటం మొదలు పెట్టాడు. ఇది చూచి సుకేశిని తన పాచిక పారిందికదా అని సంతోషించింది.

ఇంతవరకూ బాగానే వుంది. పోతే, కవలల శిలాప్రతిమలను మంత్రజలంతో మామూలు మనుష్యులుగామార్చివేయాలి. జలం తీసుకురావాలంటే ఏదైనా ఉపకరణ ఉండాలి. పోనీ పాత్ర ఎక్కడైనా సంపా దించి తెచ్చి, దానితో జలం తీసుకవద్దామా అంటే ఉన్నపాటున రాక్షసుడికి పట్టుపడి పోతారేమో! మరేమిటి గత్యంతరం? మళ్లీ ఆలోచనపడింది. ఐతే,—సుకేశినివంటి తెలివిమంతురాలికి ఇదొక ఘనకార్యమా!

మర్నాడు రాక్షసుణ్ణి పిలుచుకురావ టానికి వెళ్లేముందు సుకేశిని తోటలోకి పోయి మంత్రజలంతో తనచీరెచెంగు ఒకటి బాగా తడుపుకొన్నది. రెండో చివర కొలను నీటితో తడుపుకొన్నది.

ఇలా తయారైన సుకేశిని రాక్షసుడి దగ్గ రకు వెళ్ళి, "యివాళ కాపలాకాయటం నావంతు. నేను లేకుండా మావాళ్ల ఆట పాటలు నీకు ఎలా నచ్చినయ్యో వచ్చి నాకు చెప్పాలిసుమా" అన్నది. "అలాగే" అంటూ రాక్షసుడు క్షణమైనా అక్కడ నిలవకుండా కొలనుకి బయలుదేరాడు. వాడు వస్తుండటం చూచి కొలనులోని రాకుమార్తెలు వెంటనే ఆటపాటలలో మునిగిపోయారు.








రాక్షసుడు భవనం విడిచి వెళ్లిన మరు క్షణమే సుకేశిని, సోదరుల శిలాప్రతిమల పైన చీరెచెంగుతో తెచ్చిననీటిని పిండింది. వెంటనే వాళ్లకి మామూలు స్వరూపాలు వచ్చేసి—“ఇదేమిటి? యిక్కడికెలా వచ్చాం? వాడేమయ్యాడు?” అన్నారు ఆశ్చర్యపోతూ.

అప్పుడు సుకేశిని తను పన్నిన పన్నాగం విప్పిచెప్పి, “వాడు ఆటపాటలలో పర వశుడైవున్న సమయంకనిపెట్టి, పొంచి, హతమార్చేయాలి. ఆలోచించండి ఉపాయం” అని వేగిరపెట్టింది.

“ఎలా సాధ్యం? ఆ భస్మంకూడా పోగొట్టుకున్నామే?” అన్నాడు ఉదయనుడు.

భస్మంసంగతి సుకేశిని మరిచేపోయింది. వాళ్లు ఈ సంగతి గుర్తుతేగానే “అన్నట్టు అవును. ఒకలాచేద్దాం. ఇవ్వాళ్టికి మిమ్మల్ని శిలాప్రతిమలుగా చేసిపోతాను. రేపు వచ్చే టప్పుడు భస్మంకూడా తెస్తాను” అన్నది.

ఇందుకు సోదరులు చాలా సంతోషించారు. వెంటనే సుకేశిని కొలను నీటితో తడిపిన చీరెచెంగు పిండి, వాళ్ల నోళ్లల్లో పోసింది. యథాప్రకారం వాళ్లు శిలాప్రతిమలుగా మారిపోయారు.







ఇంతలో రాక్షసుడు అక్కడికి వచ్చేసి, "ఎలాగైనా నువ్వు వుంటేనేమజా. ఇవ్వాళ అంతా చప్పచప్పగా వుంది". అన్నాడు సుకేశినితో.

"నిజంగా? ఎగతాళి చేస్తున్నావ్? ఐతే రేపు నేను సభలో వుంటాలే. మా అక్కనే యిక్కడ కాపలాకు పంపుదాం" అంటూ తిరిగి కొలనువద్దకు వచ్చి చేరుకున్నది.

తర్వాత రాకుమార్తెలు ముగ్గురూ కలిసి భస్మాన్ని తీసుకురావటానికి వెళ్లి గుంట తవ్వి చూడగా డబ్బీ కనపడకపాయె! ఏమి చెయ్యటానికీ వాళ్లకి పాలుపోయింది కాదు. "అప్పుడు సుకేశిని, "విచారిస్తూ కూర్చుంటే ప్రయోజనం ఏమున్నది? ఇవాళ భవనం కాపలాకు నువ్వు వెళ్లు. యిలా యిలా జరిగిందని కుర్రవాళ్లకు తెలియజెప్పు. ఆపైన వాళ్లు చెప్పినట్టు చేదాం" అని చెప్పి సుభాషిణిని పంపింది.

సుభాషిణికూడా మంత్రజలంతోనూ, కొలనుజలంతోనూ చీరెచెంగు తడుపుకొని భవనానికి వెళ్లి, రాక్షసుణ్ణి విడుదలచేసి పంపింది. వాడు వెళ్లిపోగానే సుభాషిణి చీరె చెంగునుండి నీటిబొట్లు శిలా ప్రతిమలపైన వేసింది. కాని పాపం ఆ తొందరలో సుభాషిణి మంత్రజలంతో తడిసిన చెంగు పిండటానికి బదులు కొలనునీటితో తడిసిన చెంగు పిండింది. అందుచేత శిలాప్రతిమలకు మామూలు స్వరూపం రాలేదు. "అరెరే! ఎంత పొరపాటు జరిగింది" అనుకుంటూ సుభాషిణి ఈసారి మంత్రజలాన్ని పిండింది. వెంటనే సోదరులు అసలురూపాలతో లేచారు.

అప్పుడు సుభాషిణి, భస్మం మాయం కావటం సంగతి చెప్పి, జలం వాడటంలో తనుచేసిన ప్రమాదంకూడా వెల్లడించింది.

అందుకు ఉదయనుడు, "ఇదంతా చూడగా, మనం తలపెట్టినపని ఏదీ జయ





ప్రదం కాదని తోస్తున్నది. లేకపోతే అడుగడుగునా ఈ అవాంతరా లేమిటి ?" అన్నాడు నిస్పృహతో.

మధ్యలో నిశీధుడు అడ్డపడి, "జయప్రదం కాకపోవడమేమిటి. దేవుడు మనల్ని పరిక్షిస్తున్నాడు ; అంతే. ఇంతమాత్రానికే జడిసిపోవటమా ?" అన్నాడు.

"సరే, వాడు తిరిగి భవనం చేరుకొనే సరికల్లా మనం తప్పించుకొని పోవాలి. లేదా,...?" అని ఏమో చెప్పబోతుండగా—

సుభాషిణి అడ్డుతగిలి, 'నాకు ఒక ఉపాయం తోస్తున్నది. ఇక్కడ వుండే ఆ ప్రతిమలలో మూడింటిని తెచ్చి మీ స్థానాల్లో వుంచుదాం. వాడు ఏనుగంత మనిషేకాని బుర్రమాత్రం వట్టి మట్టిబుర్ర. కాబట్టి ప్రతిమలు మార్చిన సంగతి వాడు చచ్చినా కనిపెట్టలేడు. మీరు బైట ఆ పొద చాటున దాక్కోండి. వాడు భవనంలోపలికి పోగానే మీరు మా దగ్గరికి వచ్చేయండి. చూదాం తర్వాత సంగతి" అన్నది.

సుభాషిణి చెప్పిన ఈ ఉపాయం బాగుందంటే బాగుందన్నారు మన కవల సోదరులు. ఇంకా ఆలస్యం ఎందుకని ఆ వెంటనే నలుగురూ చేరి మూడు శిలాప్రతిమల్ని తెచ్చి తమస్థానే వుంచి, బయటకు వచ్చి ఒక పొదచాటున నక్కి వున్నారు.

కొంచెంసేపటికల్లా రాక్షసుడు తిరిగివచ్చి సుభాషిణిని విడుదల చేశాడు. వెంటనే సుభాషిణి కవల సోదరులున్నచోటికి వెళ్లి వాళ్లతోసహా కొలను చేరుకున్నది.

---

[యింతకాలమూ తమను ఇతరుల కంటికి కనుపించకుండా చేసి, ఉపయోగపడుతూవచ్చిన ఆ భస్మం కాస్తా పోయినతర్వాత కవలసోదరులు ఏమి చిక్కులకు గురి అయారు ? వాళ్లు తనని టోపీవేసి ఉడాయించిన సంగతి రాక్షసుడు కనిపెట్టగలిగాడా ?—మొదలైన చిత్రాలు వచ్చేనెల]









## 12

[శిలాప్రతిమలుగా మారిపోయి రాక్షసుడికి పట్టుబడిపోయిన మన కవలసోదరులు, రాకుమార్తెల యుక్తివల్ల ఎలా మళ్ళీ మామూలు స్వరూపాలు పొందినదీ, ఆ తర్వాత రాక్షసుడిని మోసపుచ్చి ఎలా తప్పించుకువచ్చిందీ క్రిందటినెల చదివారు. ఆతర్వాత]

రాక్షసుడిని మోసంచేసి కవలసోదరులు ఎలాగో బైటపడ్డారేకాని, వాళ్ళకి మన స్తిమితం లేకుండా పోయింది. ఎందుచేత నంటే అదివరకు మోస్తరుగా రాక్షసుడి కంటబడకుండా తమని అదృశ్యం చేసుకో గల భస్మం కాస్తా పోయిందాయె! పోనీ రాకుమార్తెలతోపాటు హంసల రూపంలో కొలనులో ఉందామా అంటే, హంసలలెక్క రాక్షసుడికి తెలియనే తెలుసు. కనుక అదీ ప్రయోజనంలేదు. ఏమి చెయ్యటానికీ పాలుపోలేదు.

ఇలాంటి చిక్కులోపడి కవలసోదరులు క్షణమొక యుగంగా గడపవలసి వచ్చింది.

ఒకరోజున సుభాషిణి అన్నది: 'ఇక మీదట మీరు యిక్కడ వుండటం క్షేమం కాదు. మనం చేసిన మోసానికి రాక్షసుడు కసిపూని వుంటాడు. ఈసారి వాడిచేతిలో చిక్కితేమటుకు ప్రాణాలతో వదలడు. కనుక రేపు వాడు ఆటపాటలకు వచ్చిన సమయంచూచి మీరు ఈ స్థలంవదిలి వెళ్ళి పోండి. మమ్మల్ని రక్షించే సమస్య అంత వదులుకోండి" అని.

ఇదివిని ఉదయనుడు, "అలా ఎన్నడూ జరగదు. మా ప్రాణాలు ఉన్నంతవరకూ మిమ్మల్ని రక్షించేందుకే ప్రయత్నిస్తాం" అన్నాడు.





2294




" అలా అయితే, ఒక్కటే మార్గం. రేపు వాడు యిక్కడికి వచ్చినప్పుడు మాతో పాటు కొలనులో వుండే తక్కిన రాకుమారులుకూడా కలిసి ఆటపాటలలో పాల్గొనే టట్టు ఏర్పాటు చేస్తాను. ఆ రాకుమారులలో మీరూ చేరిపొండి. సమయం కనిపెట్టి రాక్షసుడి తల తెగవేయండి" అన్నది.

సోదరులు యిందుకు ఒప్పుకున్నారు. మర్నాడు రాక్షసుడు రాకుమార్తెలదగ్గరికి వచ్చినప్పుడు సుభాషిణి, "మగవాడవైన నీవు ఒక్కడివే యింతమంది ఆడవాళ్ల మధ్య ఉండటం బాగుండదు. కొలనులో యింకా రాకుమార్లు వున్నారుకదా? వాళ్లని కూడా మనతో చేర్చుకొందాం. సందడిగా వుంటుంది. లోకానికి విరుద్ధమనిపించదు" అని సలహాయిచ్చింది.

"ఈపాటిదానికి నన్ను అడగాలా? అలాగే కానివ్వండి" అన్నాడు రాక్షసుడు.

వెంటనే కొలనులోవున్న హంసలన్నీ ఒడ్డుకివచ్చి మానవాకారాలు దాల్చినై. వాటిలో మన కవలసోదరులుకూడా వున్నారుగా! అయితే ఆటపాటల దృష్టిలో వున్న రాక్షసుడు వాళ్లని గమనించనేలేదు.

రాకుమార్తెలు కనుపండువుగా నృత్యం చేస్తున్నారు. రాక్షసుడు ఆనందంలో మునిగి తేలుతున్న సమయం చూశాడు ఉదయనుడు. స్రరున కత్తిదూసి ఒక్క వ్రేటున వానితల తెగనరికాడు. వెంటనే రాక్షసుని మొండెం నేలకు ఒరిగిపోయింది. తెగిపోయిన తల వెళ్లి కొలనునీటిలో పడింది. తలనుండి కారుతున్న రక్తప్రవాహంతో కొలను నీరంతా ఎర్రబడిపోయింది.

అదేసమయాన మరొకచిత్రం జరిగింది. రాక్షసుడు ఎప్పుడైతే చచ్చిపోయాడో ఆ తక్షణమే వాడు కాపలాకాస్తున్న భవనం మాయమైపోయింది. కవలసోదరులలాగనే వచ్చి రాక్షసుడి చేతిలో చిక్కిపోయిన





రాకుమారుల శిలాప్రతిమలు మాత్రం ఇంకా అక్కడ మిగిలివున్నై.

అప్పుడు సుహాసిని, "ఇంకాచూస్తారేం! మంత్రజలం తెచ్చి ఆ శిలా ప్రతిమలకు మామూలు స్వరూపాలు తెప్పించండి" అన్నది. అలా చేయగా, ప్రతిమలన్నీ రాకుమారులుగా మారినై. వారిలో అన్ని తరగతుల వయసువారూ వున్నారు.

వారంతా కవలసోదరులనూ, మన రాకుమార్తెలనూ ఎంతగానో మెచ్చుకున్నారు. తలవనితలంపుగా తమకు యిలా తిరిగి మామూలు స్వరూపాలు వచ్చినందుకు వారు ఎంతో ఉప్పొంగిపోయారు. అయితే, ఇంత ఆనందంలోనూ అందరికీ కూడా ఒకేవిధమైన చింత పట్టుకున్నది— తిరిగి తమ తమ యిళ్లు చేరుకోవటం మాట అలావుంచి, ఆ ప్రదేశంలో రాక్షసుడి కంట పడకుండా మెలగటం ఎలాగ? అని.

దీనినిగురించే వాళ్లంతా సమావేశమై తీవ్రంగా ఆలోచించారు. కాని ఎవరికీ ఉపాయమేదీ తోచలేదు. చివరకు ఉదయనుడు—'మీరందరూ యిక్కడే వుండిపోవటం క్షేమం కాదు. రాక్షసుడి చేతిలో చిక్కిన ఈ రాకుమార్తెలనందరినీ క్షేమంగా












వారివారి యిళ్లకు చేర్చే బాధ్యత మాది. కనుక మీరు నిశ్చింతగా వెళ్లిపోవచ్చు" అన్నాడు.

కాని యిందుకు ఎవరూ ఒప్పుకోలేదు. వారిలో ఒక వృద్ధుడు—"అబ్బాయీ! మేము తిరిగి యిళ్లకు చేరుకోవటం మాత్రం మాటలా? గెడ్డపువాడిని తప్పించుకుపోవటం అసాధ్యం. కనుక మనం చెయ్యగలిగినదల్లా ఒక్కటే. మమ్మల్ని తిరిగి శిలాప్రతిమలుగా మార్చివేసెయ్" అన్నాడు.

ఇందుకు కవలసోదరులు ఒప్పుకొనక తప్పిందికాదు. వాళ్ల కోరికప్రకారం మళ్లీ శిలాప్రతిమలుగా చేసివేశారు.

ఇక తమసంగతి ఏమిటా అని ఆలోచిస్తున్నంతలో రాక్షసుడు వచ్చేశాడు. ఈసారి వాడు వట్టిచేతులతో రాలేదు. ఒక రాకుమార్తెను వెంట తీసుకువచ్చాడు. దగ్గరకు వస్తున్న అలికిడి ఐంది. ఇంక ఆ తొందరలో కవలసోదరులు ఏంచేస్తారు! గభీమని కొలనులోదూకి హంసలుగా మారిపోయారు.

మరుక్షణమే రాక్షసుడు కొలను చేరుకున్నాడు. తను తెచ్చిన ఆ రాకుమార్తెను కూడా కొలనులోకి విసిరి వేశాడు. ఆమె కూడా హంసగా మారిపోయింది.

ఇలా రాకుమార్తెను కొలనులో విసిరి వేసినవెంటనే రాక్షసుడు మళ్లీ ఒకసారి ఆ హంసలను లెక్కపెట్టసాగాడు. ఇంత కాలమూ కొలనులో వున్నది నలభై ఏడుగురేననీ, తన వ్రతం పూర్తి కావటానికి మరి ముగ్గురు తక్కువైనారనీ అనుకుంటూ వున్నాడు. ఆ రోజు తను తెచ్చిన రాకుమార్తెతో నలభై ఎనిమిదిమంది కదా కావాలి? కాని లెక్కపెట్టగా యాభై ఒక్కమంది వుండటం చూచి, వాడు సంతోషంతో ఎగిరి గంతువేశాడు. మరుక్షణమే వాడికొక సందేహం కలిగింది. హంసల నన్నిటినీ ఒడ్డుకి రప్పించాడు. అవి నీటిలోంచి బైటికి





2297

అనగానే రాక్షసుడు "మీలో కొత్తగా వచ్చిన ముగ్గురూ ఎవరు?" అని గద్దించిఅడిగాడు.

కవలసోదరులు ముగ్గురూ ముందుకు వచ్చి—"మేమేను. అమాయికులైన ఈ రాకుమార్తెలను ఎందుకిలా బంధించి వుంచుతావు! ఇప్పటికైనా మించిపోలేదు. వీళ్లని వదిలిపెట్టు. లేదా నీ తమ్ముడిగతి ఏమైందో నీకూ అదే కాబోతుంది" అని బెదిరించారు.

"ఆఁ, ఏమిటీ? నా తమ్ముడిగతా! ఏమైనాడు వాడు?" అని పెద్దగా బొబ్బలు పెట్టాడు.

"ఏమిటవుతాడు. మట్టిలో కలిసిపోయాడు. వాడితోపాటు నీ మాయా భవనమున్నూ..." అని కవలసోదరులు అంటూ వుండగానే రాక్షసుడు అక్కడ నిలవక ఒక్క పరుగున తన తమ్ముడు కాపలా కాస్తున్న భవనంవైపుకి పరుగెత్తాడు. చూస్తే ఏముంది? శిలాప్రతిమలు తప్ప మరేమీ కానరాలేదు.

కళ్లవెంట చింతనిప్పులు కక్కుతూ రాక్షసుడు తిరిగివచ్చాడు. ఈలోగానే కవల సోదరులు తోటలోకివెళ్లి మామిడికాయలు కోసి తిని కోతులలాగా మారిపోయారు.




రాక్షసుడికి అందకుండా ఆ కోతులు ఒక చెట్టుమీదినుంచి మరొక చెట్టుమీదికి దూకుతూ ముప్పతిప్పలు పెట్టసాగినై.

చివరకు ప్రాణం విసిగి రాక్షసుడు—"కానివ్వండి. ఇలా ఎంతకాలం తప్పించుకు తిరుగుతారో నేనూ చూస్తాను" అంటూ మళ్లీ గద్దరూపంలో రివ్వున ఆకాశ మార్గాన ఎగిరిపోయాడు.

మరికొద్దిసేపటికల్లా కోతులరూపంలో కవలసోదరులు తిరుగుతున్న చోటికి గెడ్డపువాడు వచ్చి ప్రత్యక్షమయాడు.

కోతులను చూస్తూనే వాడు, "మంచి శాస్తి జరిగింది. లేకపోతే అంత కొవ్వా?





2298



ఇంకా నయం, మిమ్మల్ని ప్రాణాలతో వదిలాడు" అన్నాడు.

యిలా అంటూవున్నంతలో ఒక కోతి వచ్చి అమాంతం వాడి నెత్తిమీద దూకింది. గెడ్డపువాడు తల పైకి ఎత్తి చూచేటంతలో మరొక కోతి వాడి గెడ్డం లంకించుకుని బరబర ఈడ్చుకుపోసాగింది. బరువైన మూడో కోతి వాడి కాళ్లుపట్టుకు వేళ్లాడసాగింది. గెడ్డపువాడు లబోదిబోమని మొత్తుకున్నాడు. కోతులు వాడిని వదలలేదు. గెడ్డం లంకించుకున్న కోతి, వాడిని ఒక చెట్టుపైకి లాక్కుపోయి వాడి గడ్డాన్ని ఆ చెట్టుకొమ్మకు వ్రేలాడగట్టి గట్టిగా ముడి వేసింది. ఆ వెంటనే, చెట్టుక్రింద మొలిచి వున్న కుక్కగొడుగులు తినేసరికి కవల సోదరులకు కోతిరూపాలు పోయి మామూలు స్వరూపాలు వచ్చినై.

వాళ్లని చూచి గెడ్డపువాడు "అక్కడి చెట్లూ చేమలూ వాటిమర్మాలూ మీకు బాగా తెలిసినట్టున్నదే? ఎరక్కపోయి మీదగ్గరికి వచ్చాను. యింతటితోనైనా నన్ను విడిచి పెట్టండి బాబూ" అంటూ మొరపెట్టుకున్నాడు.

"ఈసారి నిన్ను అంతంతమాత్రానికి వదిలేదిలేదయ్యా. ఇదుగో, ఇకమీదినుంచి నువ్వు రాక్షసుడి సేవకుడివి కావు. మా సేవకుడివి. కనుక మేము చెప్పినట్టల్లా చేయాలి. నీ మాయదండ ముందు మాకిప్పుడు యిచ్చివెయ్యి. రాక్షసుడినిగురించిన రహస్యాలు పూర్తిగా వెల్లడించు. ఇందుకు ఒప్పుకుంటే నిన్ను విడుదల చేస్తాం. లేదా యిలాగ వేలాడుతూ వుండవలసిందే" అన్నాడు ఉదయనుడు శాసించినట్టుగా.

అందుకు గెడ్డపువాడు—'చాలా పెద్ద షరతులే పెట్టారే. మీ సేవకుడిగా ఉండటానికి నాకేమి అభ్యంతరంలేదు. మాయ





2299



ఖండకూడా మీవశం చేస్తా. కాని, రాక్షసుడినిగురించిన రహస్యాలుమాత్రం అడగకండి. అవి వెల్లడించినట్టయితే నేను తల పగిలి చస్తానని యిదివరకే మీకు చెప్పానుగా? ఆ రహస్యం మీకు చెప్పి నేను చనిపోవటమా? లేక మీ సేవకుడుగానేవుండి శాయశక్తులా మీకు సహాయం చేస్తూవుండటమా? అని ప్రశ్న. ఐనా, పట్టుదలతో ప్రయత్నిస్తే రాక్షసుడి రహస్యం తెలుసుకోలేకపోరు మీరు" అని మెడలోవున్న దండ తీసి యిచ్చాడు. దానిని అందుకుని ఉదయనుడు తన మెడలో వేసుకున్నాడు. గెడ్డపువాడికి మానవ స్వరూపం వచ్చింది; ఉదయనుడికి గెడ్డపువాడి స్వరూపం వచ్చింది. దానితోపాటు ఉదయనుడికి అంజనాలూ, భస్మాలూ, తువ్వాలూకూడా లభించినై.

వెంటనే ఉదయనుడు కొలనువద్దకు వెళ్లి అందులో హంసలుగావున్న రాకుమార్తెలనూ వాళ్లనూ బైటికి రమ్మన్నాడు. వాళ్లు బైటికి వచ్చాక అంతా బారులు తీర్చి కూచున్నారు. మాయతువ్వాలు మహిమవల్ల అందరకూ బ్రహ్మాండమైన విందు చేశాడు. తర్వాత శిలాప్రతిమలుగా మారివున్న వాళ్లకి మామూలు స్వరూపాలు తెప్పించి వాళ్లకికూడా విందు చేశాడు.

విందు అయాక ఉదయనుడు గెడ్డపువాడితో "వీళ్ల నందర్నీ తీసుకువెళ్లి వాళ్ల వాళ్ల యిళ్లదగ్గిర వదిలిరా" అన్నాడు.

అందుకు గెడ్డపువాడు—'ఇది చాలా కష్టమైన పని. రాక్షసుడి కంట బడ్డామంటే ప్రాణాలు దక్కవు. కనుక మరికొంత కాలం శిలాప్రతిమలనూ, హంసలనూ ఇక్కడనే ఉండనివ్వండి. సమయంచూచి వాళ్లని యిళ్లకు చేరుస్తా" అన్నాడు.

ఇందుకు కవలసోదరులు ఒప్పుకోగా, వాళ్ళని మళ్ళీ శిలాప్రతిమలుగానూ,





హంసలుగానూ మార్చి ఎవళ్ళచోటుల్లో వాళ్ళను వుంచాడు.

ఇంతలో రాక్షసుడు వచ్చేశాడు. వాడు వస్తున్న సంగతి గ్రహించి గెడ్డపు వాడి ఆకారంలోవున్న ఉదయనుడు తన దగ్గిరవున్న భస్మంతీసి, తన సోదరులపైనా గెడ్డపువాడిపైనా చల్లాడు. రాక్షసుడు సరీగా అక్కడికి వచ్చి చేరుకునేసరికి గెడ్డపువాడి వేషంలో ఉదయనుడు మాత్రం నిలిచి వున్నాడు. వాడు తన సేవకుడైన గెడ్డపువాడే ననుకుని రాక్షసుడు—"ఆ కోతిమూక ఏమైంది?" అన్నాడు.

"ఏమవుతారు. ముగ్గుర్ని పీకనులిమి చంపేశాను" అన్నాడు ఉదయనుడు.

"ఏరీ, ఎక్కడ వాళ్లు?" అని ఆత్రంతో ప్రశ్నించాడు రాక్షసుడు.

"చూపుతాను రా" అంటూ రాక్షసుడిని ఒక పాడు బావిదగ్గిరికి వెంటబెట్టుకు వెళ్లి, తొంగిచూడమన్నాడు ఉదయనుడు.

ఆత్రంకొద్దీ రాక్షసుడు బావిలోకి తొంగి చూడబోయాడు. అంతకుముందుగానే ఉదయనుడు ఆ బావి ఒడ్డున తన కత్తి దాచివుంచాడు. ఎప్పుడైతే రాక్షసుడు తొంగి చూడబోయాడో సర్రున కత్తిదూసి ఒక్క వ్రేటు వేశాడు ఉదయనుడు. తల తెగి బావిలో పడింది కాని, చిత్రమేమిటో, రాక్షసుడికి మరొక తల మొలుచుకువచ్చింది.

రాక్షసుడు గిరుక్కున తిరిగి గెడ్డపువాడి వేషంలోవున్న ఉదయనుడిని గుప్పిటిలో పట్టి, "ఎంత ద్రోహం తలపెట్టావురా! నా ఉప్పు తింటూ, నాకే ముప్పు తలపెట్టావా" అంటూ వానిని బావిలో విసిరివేశాడు.

---

[ఇలా బావిలో పడిపోయిన ఉదయనుడి గతి ఏమిటి? ఇంతకూ ఉదయనుడి మాయవేషం రాక్షసుడు తెలుసుకోగలుగుతాడా? భస్మంవల్ల మాయం చేయబడిన కవలసోదరులగతీ, గెడ్డపువాడి సంగతీ యేమవుతుంది? ఈ చిత్రాలన్నీ వచ్చేనెల]









## 13

[కవలసోదరులూ, రాకుమార్తెలూ యుక్తిచేసి రాక్షసుడి తమ్ముణ్ణి చంపివేయటమూ, వాడికి పట్టుబడకుండా కోతులుగా మారిపోవటమూ, తలవనితలంపుగా గెడ్డపువాడిని తమ సేవకుడుగా చేసుకోగలగటం, చివరకు రాక్షసుడిని చంపబోయిన ఉదయనుడు బావిలో పడద్రోయబడటం—ఇవన్నీ క్రిందటిమారు చదివారు కదా! తరువాత—]

బావిలో పడిపోయిన ఉదయనుడు గెడ్డపువాడి రూపంలో అలాగే ఒకవారం రోజులపాటు వుండిపోయాడు. బైటపడే మార్గం కనుపించలేదు. ఇక అక్కడ భస్మంవల్ల అదృశ్యం చేయబడిన సంధ్యా నిశీథులు గెడ్డపువాడితో సహా అలా అదృశ్యరూపంలోనే ఉండిపోవలసివచ్చింది. ఎందుచేతనంటే వాళ్లకి తిరిగి మామూలు స్వరూపాలు తెప్పించగల భస్మంకూడా ఉదయనుడిదగ్గరే చిక్కుకొని పోయిందాయె.

వీళ్ల స్థితి యిలా ఉండగా, ఈ వారం రోజులూ రాకుమార్తెలూ వూరుకోలేదు. క్షణమైనా విడవకుండా కనుపిస్తూవుండే మన కవల సోదరులు వారంరోజులు కనుపించకుండాపోయేసరికి వాళ్లు మళ్లీ ఏదో అపదలో చిక్కుకొనివుంటారని వెంటనే అనుకున్నారు. చుట్టుప్రక్కల అంతా గాలించి చూచారు. ఇలా వెతుకుతూవుండగా వాళ్లు ఉదయనుడు పడివున్న పాడుబావిదగ్గిరకు కూడా రావటం తటస్థించింది. అయితే గెడ్డపువాడి ఆకారంలో వుండటంచేత ఆ అంగుళం మనిషి వాళ్ళ కంటబడలేదు. వీళ్లు బావి దగ్గిరికి వచ్చిన అలికిడి వినిపించి, ఉదయనుడు కేకవేశాడు, కాని ఆకారానికి తగ్గట్టు








అయినా రాకుమార్తెలు తను బావిలోవున్న సంగతి తెలుసుకొంటారేమోనని ఉదయనుడి ఆశ. కాని, అతడు అనుకొన్నట్టు వాళ్లు కత్తిని వెంటనే గమనించలేదు.

మరొక వారానికి రాకుమార్తెలు మళ్లీ ఆ బావిదగ్గిరికి రావటం జరిగింది. బావి ఒడ్డున భూమిలో దిగబడివున్న కత్తిని చూస్తూనే వాళ్లు ఆశ్చర్యపోయారు. "ఇదేమిటి? క్రిందటిమారు మనం యిటు వచ్చినప్పుడు లేని కత్తి యిప్పుడు ఎక్కడినుంచి వచ్చింది. ఒకవేళ రాక్షసుడు ఉదయనుణ్ణి చంపి ఈ బావిలో పడవెయ్యలేదుకదా?" అనుకుంటూ వాళ్లు బావిలోకి తొంగి చూచారు.

చిత్రమేమిటోగాని బావిలో సగం వరకు రకరకాల పళ్లు నిండివున్నై. వాటిపైన గెడ్డపువాడి వేషంలో ఉదయనుడు నిలుచుని వున్నాడు. అతని చేతిలో మాయ తువ్వాలు వున్నది. తువ్వాలులోనించి పళ్లు యింకా గుట్టలు గుట్టలుగా వస్తూనేవున్నై. పళ్లతో బావి నిండిపోబోతున్నదాయె!

ఆశ్చర్యంతో రాకుమార్తెలు అలాగే నిలబడిపోయారు. మరికొద్దిసేపటికల్లా పై అంచువరకు పళ్లు వచ్చేసి, బావి నిండి

అతని కేకకూడా చాల చిన్నదికావటం చేత ఆ కేక రాకుమార్తెకు వినిపించలేదు.

తను కేకపెట్టకూడా రాకుమార్తెలకు తన స్థితి తెలియజేయలేక పోయినందుకు ఉదయనుడు మరింత దిగులు చెందాడు. ఐతే, ఆ క్షణమందే ఉదయనుడికి ఒక సంగతి జ్ఞాపకం వచ్చింది.

రాక్షసుడు తనను బావిలో త్రోసివేశాక, ఒడ్డున పడివున్న కత్తికూడా బావిలో పడవేసి మరీపోయాడు. ఇప్పుడు ఉదయనుడు ఆ కత్తిని బావిలోంచితీసి పైకి విసిరాడు. అది అమాంతం వచ్చి బావి ఇవతల భూమిలో దిగబడిపోయింది. ఈ కత్తిమాచి





పోయింది. ఆ పళ్ల గుట్టపైన నించునివున్న ఉదయనుడిని రాకుమార్తెలు చెయ్యి పట్టుకు బైటికి లాగివేశారు.

తర్వాత—తను రాక్షసుడి తల తెగ నరకటమూ, వాడు తనని బావిలో విసిరి వెయ్యటమూ, ఆ తరువాత తను చేసిన వ్యూహాలూ వివరంగా రాకుమార్తెలకు చెప్పాడు ఉదయనుడు, అంతా విని వాళ్లు, "ఏమైతేనేం. ఇంతకూ మాయతువ్వాలు నిన్ను రక్షించింది. దానిని ఉపయోగించి యిలా బైటపడవచ్చుననే ఉపాయం నీకు తోచినందుకే మెచ్చుకోవాలి" అన్నారు.



వెంటనే వాళ్ళు, గెడ్డపువాడూ సంధ్యానిశీథులు అదృశ్యరూపంతో వున్నచోటికి చేరుకున్నారు. ఉదయనుడు తనవద్దవున్న భస్మం ఆ చోట చల్లేసరికి వాళ్లు ముగ్గురూ తిరిగి మామూలురూపం పొందారు.

అప్పటివరకూ జరిగిన కథ తెలుసుకోవటంతోనే గెడ్డపువాడు—"అయితే, తను బావిలో త్రోసివేసింది నన్నే అనుకున్నాడా! ఇదీ ఒకందుకు మంచిదేలే. ఇక ముందు కథ ఆలోచించాలి" అన్నాడు.

"అందుకు ఉదయనుడు నిజమే! అయితే ఈమారు వాడు వచ్చినప్పుడు నా కోసం బావిలో చూస్తాడుకదా? నేను లేక పోవడం, పైగా బావి పళ్లతో నిండివుండటం చూసి, వాడు అనుమానపడడా?" అన్నాడు.

"వాడు వచ్చేసరికి ఆ బావి అక్కడ వుంటేకదా?" అన్నాడు గెడ్డపువాడు.

వెంటనే వాళ్లు బావిదగ్గిరికివెళ్లి భస్మం చల్లేసరికి బావి మాయమైపోయింది! దానికి బదులు మామూలు మైదానం కానవచ్చింది!!

అప్పుడు ఉదయనుడు గెడ్డపువానితో "సరే, నువ్వు యిప్పుడు చెయ్యవలసిన పని ఒకటి వుంది. మేము రాకుమార్తెలను వెతకటానికని బయలుదేరి యిప్పటికి ఏడు







సంవత్సరాలు అయింది. అక్కడ రాజూ, రాణీ మేము ఏమైపోయామోనని కంగారు పడుతూవుంటారు. కనుక, నీవు ఈ క్షణం శ్రావస్తి నగరానికి బయలుదేరి వెళ్లి, రాకుమార్తెలూ, మేమూ క్షేమంగానే వున్నామనీ, త్వరలోనే సుఖంగా యిల్లు చేరుకుంటామని చెప్పి రావలసింది" అన్నాడు.

గెడ్డపువాడు సరేనని చెప్పి ఆ క్షణానే శ్రావస్తినగరానికి ప్రయాణమయ్యాడు. అప్పుడు ఉదయనుడు తను మొట్టమొదట ఈ మాయా భవనం ప్రవేశించబోయే ముందు కందకంలో పడిపోవటం, తన గుఱ్ఱాన్ని ఆ కందకంలోనే వుంచి, తను మాత్రం ఎలాగో బైటపడటం అంతా చెబుతూ "కాలినడకని వెళ్లితే నీవు ఎప్పటికి చేరుకోగలవు? గుఱ్ఱంమీద పోయిరా. మొదట వారు నిన్ను నమ్మకపోవచ్చు. కాని గుఱ్ఱాన్ని ఆనవాలు పట్టినతరువాత నమ్మితీరతారు" అన్నాడు.

ఉదయనుడి తెల్లగుఱ్ఱంమీద గెడ్డపువాడు బయలుదేరాడు.

అలా పోతూవుండగా, ఒక మైదానంలో దానశీలమహారాజుగారి భటులు, సంధ్యానిశీథుల గుఱ్ఱాలపైన వస్తూ గెడ్డపువానికి ఎదురైనారు. తమ రాజుగారి తెల్లగుఱ్ఱాన్ని చూస్తూనే వాళ్లు గుర్తుపట్టివేశారు. దానిపైన ఎవరో క్రొత్తమనిషి వుండటం చూచి, అటకాయించారు.

"ఎవరవయ్యా నువ్వు? ఈ గుఱ్ఱం నీకెక్కడిది? ఇలా ఎక్కడికి పోతున్నావు? చెప్పి మరీ కదులు" అన్నారు.

అందుకు గెడ్డపువాడు "నేను దానశీల మహారాజుగారికి ఒక శుభవార్త అందించబోతున్నాను. అన్నట్టు, మీరు ఎక్కి వచ్చిన ఈ గుఱ్ఱాన్ని నేను యిదివరకే చూచినట్టుందే! మీరు మహారాజుగారి సేవకులా?" అని అడిగాడు.





"అవునులే. నువు తెచ్చిన ఆ శుభవార్త ఏమిటో ముందు చెప్పు" అంటూ వేగిర పెట్టారు రాజభటులు.

"రాకుమార్తెలూ, వారిని వెతకవచ్చిన శుట్టివాళ్లూ అంతా సుఖంగా వున్నారు ఈ మాట చెప్పాలి" అన్నాడు గెడ్డపువాడు.

"అలాగా!-మేమూ, నీతోవస్తాం పద" అన్నారు భటులు సంతోషంతో.

"అలాకాదు. ఒకపని చేద్దాం. ఇప్పుడు మనం కలిసి రాకుమార్తెలు వున్నచోటికి పోదాం. మీరూ అక్కడే వుండిపోయి వాళ్లని కాపాడుతూ వుండండి. నేను తిరిగి వెళ్ళి రాజుగారికి ఈ వార్త అందించి వస్తాను" అన్నాడు గెడ్డపువాడు.

సరేనని వాళ్లు కవలసోదరులున్నచోటికి చేరుకున్నారు. భటులను అక్కడ వదిలి గెడ్డపువాడు మళ్లీ బయలుదేరాడు.

కొంతదూరం వచ్చేసరికి సుడిగాలి ప్రారంభమైంది. రాక్షసుని రాకకు ఇది గుర్తుకదా అని గెడ్డపువాడు వెంటనే గ్రహించి, గుఱ్ఱాన్ని శరవేగాన పోనీయ సాగాడు. ఐనా రాక్షసుడు రివ్వున వచ్చి గుఱ్ఱంమీద పోతున్న గెడ్డపువాడిని ఆకాశ మార్గాన ఎత్తుకుపోయాడు.





గుఱ్ఱంమాత్రం అలా తిరుగుతూ తిరుగుతూ మరొక వారానికల్లా శ్రావస్తినగరం పోయి రాజమహలు చేరుకున్నది. రాజు చూస్తూనే పరుగున ఎదురువచ్చి దానిని మహలులోకి తీసుకుపోబోయాడు. కాని అది రాజు వెంట మహలులో ప్రవేశించక మొండికేసి వచ్చిన దారినే పోబోయింది.

సేవకులంతా పోగయారు. వాళ్లతో రాజు "ఉదయనుడు ఏమయ్యాడో, ఈగుఱ్ఱం యిక్కడి కెలా వచ్చి చేరుకున్నదో ఏమి బోధపడటంలేదు. దీని చేష్టలు చూస్తే వాళ్లు ఏదో ఆపదలో చిక్కుకున్నట్టు తోస్తున్నది. భవనంలోకి రాకుండా యిది వచ్చినదారినే



పోవటానికి పెనగులాడటంలో ఏదో రహస్యం ఉండివుండాలి. కనుక యిది ఎక్కడికి పోతే మీరు అక్కడికి పోయి, ఏమి జరుగుతుందో చూచి రండి" అన్నాడు.

రాజు యిలా చెబుతూవుండగానే గుఱ్ఱం పట్టు వదిలించుకుని పోసాగింది. రాజభటులు దానిని వెంబడించారు. కాని, యింతలోనే ముందుపోతున్న గుఱ్ఱం రాజభటులవైపుకి తిరిగి వాళ్లని 'ఆగండి!' అన్నట్టు తల ఆడించింది.

ఇది చూడగా రాజుకి ఒక ఆలోచన కలిగింది. మంత్రిని పిలిచి, "వీళ్లంతా వెంటబడటం అశ్వానికి యిష్టం లేనట్టుంది. వాళ్లని వెనక్కు పంపించెయి. నీవుమాత్రం వెంటవెళ్లు" అని చెప్పి మంత్రిని పంపాడు.

భటులను తిరిగి మహలుకి పంపివేశాక గుఱ్ఱం మళ్ళీ ముందుకు సాగింది. అప్పుడు మంత్రి ఒక్కడూ దానివెంట పోసాగాడు.

* * *

అక్కడ మన కవలసోదరులూ, రాకుమార్తెలూ ఎలావున్నారూ అంటే:

వార్త అందించి వస్తానని చెప్పిన గెడ్డపువాడు శ్రావస్తినగరానికి బయలుదేరి పది రోజులు ఐంది. యింతవరకు వాడు తిరిగి





రాకపోయేసరికి కవలసోదరులకు పరిపరి విధాల ఆలోచనలు పోయినై. చివరకు ఒకనాడు ఉదయనుడు తన సోదరులతో "పాపం వాడు ఏమి ఆపదలో చిక్కుకున్నాడో శ్రావస్తికి పోయి నేను కనుక్కువస్తా. అంతవరకూ మీరు జాగ్రత్తగా వుండండి అవసరమైతే ఈ భస్మాలు వాడుకోండి" అని వాళ్లకి కొంతతెల్లభస్మం కొంత నల్లభస్మం యిచ్చి, నిశీథుడి నల్లగుఱ్ఱంపైన తను శ్రావస్తికి బయలుదేరాడు.




ఉదయనుడు అలా ఒక రాజ్యం మధ్యనించి వెళుతూవున్నాడు. దారిలో ఒకచోట ఒక అంధుడు కఱ్ఱతో తడుములాడుకుంటూ నడిచి వస్తూ ప్రక్కనే వున్న ఒక గోతిలో పడిపొయ్యాడు. ఈ దృశ్యం కంటబడినదే ఉదయనుడు అమాంతం గుఱ్ఱం దిగి వెళ్లి ఆ అంధుణ్ణి లేవదీశాడు. తన దగ్గిరవున్న అంజనాలు ప్రయోగించాడు. తక్షణమే అంధునికి చూపు వచ్చేసింది. అతను ఉదయనుడికి కృతజ్ఞత తెల్పుకొంటూ తన యింటికిరమ్మని ప్రాధేయపడ్డాడు. సరేనన్నాడు ఉదయనుడు.

తీరా ఇల్లు చేరుకొనేసరికి, ఆ వృద్ధుడు ఆవూరి రాజుగారి సేవకుడి తండ్రే అని తెలిసింది. తన తండ్రికి యిలా చూపు వచ్చేసరికి ఆ సేవకుడు ఉప్పొంగిపోయాడు. ఇంకేముంది, ఈ సమాచారం ఊరంతా అల్లుకొని రాజుగారి చెవిని పడింది.

రాజుగారు భటులను పంపి ఉదయనుడిని తమవద్దకి తీసుకరమ్మన్నారు. ఉదయనుడు రాజు ఎదట హాజరయాడు. ఉదయనుడిని రాజు బహువిధాల సత్కరించి, "నీవంటి ప్రజ్ఞావంతుణ్ణి ఇంతవరకూ చూచి ఎరగము. నీవు మా ఆస్థానంలో ఉండిపోవాలి" అని కోరాడు.

అందుకు ఉదయనుడు, "మహారాజా, మీరు చూపిన ఆదరమూ, అభిమానమూ





మరవలేను. అయితే యిప్పుడు నేను ఒక ముఖ్యమైన పనిమీద వెడుతున్నాను. అది పూర్తిచేసుకు తిరుగుదలలో మళ్లీ ఏలిన వారి దర్శనం చేసుకొంటాను" అన్నాడు.

రాజు సంతోషించి ఉదయనుడిని అతి వైభవంగా సాగనంపాడు.

అటుతరువాత ఏవిధమైన అవాంతరాలూ లేకుండా మరుసటివారానికల్లా ఉదయనుడు శ్రావస్తి నగరం చేరుకున్నాడు.

అతనిని చూస్తూనే రాజు ఎదురువచ్చి కౌగిలించుకున్నాడు. రాకుమార్తెలు క్షేమంగావున్నారని చెప్పాడు ఉదయనుడు. కొంచెం స్తిమితపడి అప్పటివరకు జరిగిన వింతలన్నీ పూసగుచ్చినట్టు చెప్పి—'మీరు నిశ్చింతగా వుండండి. త్వరలోనే మేము మీ అమ్మాయిలతో సహా క్షేమంగా తిరిగి వచ్చేస్తాము" అన్నాడు.

ఈ వార్త వినగానే రాజు హృదయం ఉప్పొంగింది. రాణి ముఖం కలకల్లాడింది. రాజ్యంలో ప్రజలంతా ఆనందసాగరంలో మునిగిపోయారు.

మరునాడే ఉదయనుడు జాగుచేయక రాజుదగ్గిర సెలవు తీసుకుని, తల్లి ఆశీర్వాదం పొంది మాయాభవనానికి మళ్లీ బయలుదేరాడు.

మరొక్క వారానికల్లా ఉదయనుడు మాయాభవనం చేరుకున్నాడు. చేరుకున్నాడే కాని, ఆ క్షణమందు కంటబడ్డ విడ్డూరం ఉదయనుణ్ణి ఒడలు కంపింప జేసింది! అంతటి భయంకరమైన దృశ్యం యేమైవుంటుంది!!—

తోటలో ఒక చెట్టుకి అయిదు పురిత్రాళ్లు వ్రేలాడుతున్నై. సంధ్యా, నిశీథుడూ, గెడ్డపువాడూ, శ్రావస్తినించి వచ్చిన రాజభటులూ అంతా ఒక్కవరుసలో నిలబడి వున్నారు. వాళ్లందరకూ కాళ్లూ చేతులూ కట్టి బిగింప బడివున్నై. ఎదురుగా పులిలాగా రాక్షసుడు నిలబడివున్నాడు. —[ఇంకావుంది]








## 14

[బావిలో పడిన ఉదయనుడు బైటపడటం, గెడ్డపువాడిని శ్రావస్తికి పంపటం, వాడు ఎంతకూ తిరిగి రాకపోగా తనేబయలుదేరి వెళ్ళి రాజుకి శుభవార్త అందించటం, తిరిగి వచ్చేసరికి తన సోదరులను రాక్షసుడు ఉరితీయబోతూవుండటం వరకు చదివారు]

ఆ భయంకర దృశ్యం చూచి ఉదయనుడు గజగజలాడిపోయాడు. ఏమి చెయ్యటానికీ పాలుపోలేదు. పోనీ అదృశ్యరూపం పొంది వాళ్లని విడిపిద్దామన్నా వీలులేని పరిస్థితి ఏర్పడింది. ఎందువల్లనంటే శ్రావస్తినుండి తిరిగి వచ్చేటప్పుడు దురదృష్టవశాత్తు తెల్ల భస్మం కాస్తా పోగొట్టుకున్నాడు. అందుచేత తన సోదరులూ వాళ్లూ మరొక్క క్షణంలో ఉరితీయబడతారని తెలిసికూడా ఉదయనుడు చాటుని పొంచిచూస్తూ వుండిపోవలసివచ్చిందేకాని మరోమార్గం కనుపించలా. ఉదయనుడికి ముచ్చెమటలు పోసినై. క్షణమొక యుగంలా గడుస్తోంది. పోతే, అక్కడ అప్పుడే రాక్షసుడు వాళ్లను చెట్టుదగ్గరకి తీసుకువెళ్లాడు. ఉరిత్రాళ్లు తగిలించివేశాడు. చాటున ఉన్న ఉదయనుడు ముందుకు ఉరకబోయేటంతలో 'అగు' అనే కేక వినిపించింది.

విస్తుపోయి చూశాడు ఉదయనుడు. ఆ కేక పెట్టినది ఎవరు ? గెడ్డపువాడే. వాడు రాక్షసుడితో యిలా చెబుతున్నాడు: "వీళ్లని రక్షిద్దామనే ఉద్దేశ్యంతో యిన్నాళ్లూ ఒక రహస్యం నీతో చెప్పకుండా దాచాను. కాని అది దాచికూడా వీళ్లని రక్షించలేకపోయాను. పైగా యిప్పుడు నా ప్రాణానికే ముప్పు వచ్చింది. కనుక, ఇక దాచను,








ఇంత కాలమూ నిన్నూ నన్నూ మోస పుచ్చుతూ వచ్చిన ఈ ముగ్గురు కుర్ర వాళ్లూ కవలలు" అని యింకా ఏమో చెప్పబోతుండగా రాక్షసుడు,

"ఏమిటీ! కవలలా? మళ్లీ నన్ను మోస పుచ్చటానికి చూస్తున్నావల్లే ఉందే! వీళ్లు కవలలే అయినట్టయితే, నాకా చిక్కకుండా పోవటం?" అన్నాడు.

అప్పుడు గెడ్డపువాడు "నిజమే. నీవు కావాలనే వీళ్లను వదిలేశావు" అంటూ, కవలసోదరుల దృష్టి లోపాలను గురించీ దానిని తను సరిచేయడాన్నిగురించీ అంతా తెలియచేశాడు గత్యంతరం లేక.

అంతావిని రాక్షసుడు, 'బలికి కావలసిన యాభైమంది కవలలూ సమకూరినట్టే కదా? నీవు చెప్పిందంతా నిజమేనని నమ్మవలిసిందేనా? వీళ్లు కవలలు అవునో కాదో ఎలా రూఢి అవుతుంది? వాళ్లనే అడుగుతా' అని చెప్పి సంధ్యా నిశీధులవైపు తిరిగాడు. "మా వాడు చెప్పిందంతా నిజమేనా? నిజం కప్పిపుచ్చినా మీ ప్రాణాలు దక్కవు. కనుక అబద్ధమాడకండి. నిజంగా మీరు కవలలే అయినట్టయితే ఒక మహత్తరమైన కార్యంకోసం ప్రాణాలర్పించామనే తృప్తి అయినా వుంటుంది మీకు" అన్నాడు.

ఇందుకు సంధ్యానిశీధులు "నిజమే" అన్నారు కన్నీరు కారుస్తూ.

పొంచివున్న ఉదయనుడు నిశ్చేష్టుడై పోయాడు. నమ్మి గెడ్డపువాడిని ప్రాణాలతో వదిలినందుకు యిదా ఫలితం అనిపించింది. వాడిని ఆమట్టున నరికిపారేద్దామా అనుకున్నాడు. కాని అంతలోనే రాక్షసుడి గొంతు వినిపించింది.

"అయితే ఆ మూడోవాడేడీ?" అని రాక్షసుడు ప్రశ్నించాడు.

అందుకు గెడ్డపువాడు, "వాడు యింటికి పోయివస్తానని చెప్పి వెళ్లి యిప్పటికి వారం





రోజులైంది. ఈపాటికి తిరిగి రావలసిందే. దారిలో ఏదైనా ప్రమాదం సంభవించిందో, యేమో! ఇంతలో వస్తాడనే నమ్మకంకూడా నాకులేదు" అన్నాడు.

"సరే. ఆలస్యం ఎందుకు. రేపే బలి పూర్తి చేసి, దేవిని ప్రసన్నం చేసేసుకుంటాను. ఏర్పాట్లన్నీ చేయాలి. నిన్ను నమ్మి వదులుతాననిమాత్రం అనుకోకు" అంటూ రాక్షసుడు గెడ్డపువాడినీ, సంధ్యానీశీథులనూ, రాజభటులనూ ఒక్కొక్కళ్లను ఒక్కొక్క చెట్టుకి అంటగట్టి, పెద్దపెట్టున నవ్వుతూ గెద్దరూపంలో ఆకాశమార్గాన ఎగిరిపోయాడు.

రాక్షసుడు వెళ్లి వెళ్లడంతోనే ఉదయనుడు కత్తిదూసి ఒక్క పరుగున గెడ్డపువాడున్న చెట్టువద్దకు పోయి, వాడిని నరకబోయాడు.

"ఆగు. తొందరపడకు. నేను చెప్పేది సొంతంగా విని ఆపైన నీ యిష్టం వచ్చినట్టు చెయ్యి" అన్నాడు.

"వినేదేమిటి. విన్నదిచాలు. ప్రాణాలతో వదిలినందుకు బాగా చేశావు. నిన్నేంచేసినా పాపంలేదు. ఇంకా ఆగమంటావేమిటి?" అంటూ హుంకరించాడు ఉదయనుడు.



"అబ్బాయి! నీవు యిలా అపోహపడటంలో ఆశ్చర్యం లేదులే. ఐనా చెప్పేది విను: ఈ క్షణానికి తప్పించుకుని బైట పడితే చాలుననే ఉద్దేశంతోనే నేను వాడికి మీ జన్మరహస్యం చెప్పవలసి వచ్చింది. తప్పించుకోటానికి మరో మార్గం లేదు. నా స్థానంలో నీవున్నా మరేమీ చెయ్యలేవు. నా ఉపాయం పారింది. రేపటివరకూ వాడు ఆగటం నిజంగా మన అదృష్టమే" అన్నాడు గెడ్డపువాడు.

ఉదయనుడు ఆలోచనలో పడ్డాడు. కొంచెం పస్తాయించి, "సరే, నిన్ను నమ్మామే అనుకో, తెల్లవారేలోగా వాడికి







చిక్కకుండా మనమందరం తప్పించుకోవటం ఎలా?" అన్నాడు.

అప్పుడు గెడ్డపువాడు, "అదీ ఆలోచించా. చెప్పుతా. ముందు వీళ్ల కట్లుకూడా విడిపించుదాం పద" అంటూ సంధ్యానిశీథులనూ, రాజభటులనూ విడిపించాడు. తర్వాత వాళ్లని వెంటబెట్టుకుని కొలను దగ్గిరికి వెళ్లాడు. వీళ్ళని చూస్తూనే మన రాకుమార్తెలు ఒడ్డుకి వచ్చేశారు.

గెడ్డపువాడు ఉదయనుడిని చూచి, "ఆ ఎఱ్ఱ అంజనం యిలా తే" అన్నాడు.

రాకుమార్తెలను దగ్గరకు రమ్మని పిలిచాడు. వాళ్లు వచ్చాక ఆ ఎర్ర అంజనం తీసి సుహాసిని భుజానికి రాచాడు. వెంటనే ఆమె చెయ్యి మాయమైంది. తర్వాత సుభాషిణిని కూర్చోబెట్టి మోకాలిదగ్గర రాచేసరికి ఆమె కాలు మాయమైంది. మరి కాస్త అంజనం తీసి సుకేశిని కళ్లకు రాచాడు. దానితో ఆమె కళ్లు రెండూ పోయాయి. ఈవిధంగా రాకుమార్తెలు ముగ్గురికీ అంగవైకల్యం కల్పించటంచూచి ఉదయనుడు "ఏమిటీ దారుణం, ఏదో ఉపాయం చెబుతానని చెప్పి యిదా నువు చేసే పని" అని ఉగ్రుడైపోయాడు.

"ఎంతకూ నీ తొందరపాటు మాత్రం మానవుకదా? అన్నింటికీ అలా అనుమానపడతావేమిటి?" అంటూ గెడ్డపువాడు ఉదయనుడి చెవిలో ఏదో చెప్పాడు.

ఉదయనుడు కొంత తృప్తిపడి, "మరి, ఇంత కాలం ఏవిధమైన అవయవ లోపమూ లేకుండావుండి, రేపు వాడు వచ్చి చూచేసరికల్లా ఇలా జరిగితే వాడు నీపైన అనుమానపడడా? దీనివల్ల మనకు కలిసి వచ్చేదేముంది?" అని అడిగాడు.

"అదంతా తర్వాత చూదాం. ప్రస్తుతం యింతకంటే మార్గం లేదు. రేపు వాడు వచ్చేవేళకి మేము ఎప్పటిలాగా చెట్లకు





కట్టివెయ్యబడి వుంటాం. నీవు మాత్రం భస్మం చల్లుకుని అదృశ్య రూపంలో వుండి ఏమి జరుగుతుందో కనిపెడుతూ వుండు" అన్నాడు గెడ్డపువాడు.

ఉదయనుడు తెల్లబోయాడు. "ఆ భస్మమే వుంటే యిన్ని పాట్లెందుకు వస్తయ్. శ్రావస్తినుండి వచ్చేటప్పుడు అది కాస్తా పోగొట్టుకున్నాను." అన్నాడు సిగ్గుపడుతూ.

"ఏమిటీ? పోగొట్టుకున్నావా? ఫరవాలేదులే. నీవు మాకు యిచ్చి వెళ్లిన భస్మం మేము వాడలేదు. ఇదుగో" అంటూ పొట్లం తీసి యిచ్చాడు.

ఆ తర్వాత ఉదయనుడు వాళ్లని మళ్లీ ఎప్పటిలా చెట్లకు కట్టివేసి, తను అదృశ్య రూపంలో వుండిపోయాడు.

*

మరునాడు, తెలతెల్లవారుతూ వుండగా సుడిగాలి ప్రారంభమైంది. రాక్షసుడు వస్తున్నాడుకదా అనుకున్నారు అందరూ. సంధ్యా నిశీధులూ, గెడ్డపువాడూ రాజభటులూ ఎంతో అలిసిపోయినవాళ్లలా చెట్లకి జేరగిలబడి వున్నారు. మరి కొద్ది సేపటికల్లా రాక్షసుడు రానేవచ్చాడు. అతని



వెంట గండ్రగొడ్డళ్ళు భుజాన వేసుకున్న యిద్దరు భటులు వస్తున్నారు. ఆ వెనక ఎంతోమంది పరివారం పూలదండలతో నడిచి వస్తున్నారు.

సంధ్యా నిశీధులున్న చోటికి చేరుకుంటూనే రాక్షసుడు తనకు ఏర్పరచిన సింహాసనంపైన అధిష్ఠించాడు. "కొలనులో కపలలందరకూ స్నానాలు చేయించి, దివ్యంగా అలంకరించి ఒక్కొక్కళ్లనే తెచ్చి, నా ఎదట నిలబెట్టండి" అని పరివారానికి ఆజ్ఞాపించాడు.

వెంటనే ఎవరి పనులలో వారు నిమగ్నమై పోయారు. ఒకరు స్నానాలు చేయిస్తున్నారు.





మరొకరు వస్త్రాలు అలంకరిస్తున్నారు. అలంకరణ పూర్తిఐనవారినల్లా రాక్షసుడి యెదుట నిలబెట్టుతున్నారు. రాక్షసుడు బ్రహ్మానందభరితుడవుతున్నాడు. తన ఎదుట తెచ్చి నిలబెడుతున్న రాకుమార్తెలను, రాకుమారులను చూస్తూ, "నీవు కనకపురి రాకుమార్తెవుకదూ? నీవు అవంతీశ్వరుని అందాలభరిణెవు కదూ? నీవు మణిపుర రాకుమారుడవు కదా?" అంటూ పేరుపేరున పరామర్శిస్తూన్నాడు. పాపం వాళ్లు తలలు వంచుకొని కన్నీరు మున్నీరుగా విలపిస్తున్నారు.

ఇంతలో ఒక పరిచారిక మరొక రాకుమార్తెను తీసుకువచ్చి నిలబెట్టి, "ఇదేమిటి ప్రభూ! ఈగుడ్డిదాన్ని తెచ్చారే, దేవి స్వీకరిస్తుందా?" అన్నది.

రాక్షసుడు నివ్వెరపోయి, "ఏమిటీ? గుడ్డిదా?" అంటూ సింహాసనం దిగి ఆ రాకుమార్తెను పరిశీలించబోయేటంతలో మరో పరిచారిక, "ఈ కుంటిదాన్ని తెచ్చారేమిటి? ప్రభూ" అంటూ తను తెచ్చిన రాకుమార్తెను రాక్షసుడి ఎదుట వుంచింది.

రాక్షసుడు కోపం పట్టలేకపోయాడు. కళ్లవెంట నిప్పులుగక్కుతూ — "మోసం!






ద్రోహం!" అని భూమ్యాకాశాలు దద్దరిల్లే టట్లు అరిచాడు.

ఇంతలో మరో పరిచారిక, "ఈ రాకుమార్తెకు కళ్లేలేవు మారాజా!" అంటూ తనవెంట తెచ్చిన రాకుమార్తెను రాక్షసుడికి చూపించింది.

రాక్షసుడి కోపం మిన్నుముట్టింది. ఒక్క ఉరుకున గెడ్డపువాడిదగ్గరికి వెళ్ళి చెట్టుతోసహా పెళ్లగించాడు. గెడ్డపువాడివంక చూచి, "ఏమిటీ ద్రోహం! లక్షణమైన కవలలను తెచ్చి కొలనులో వేశానే. ఇప్పుడీ కురూపులెక్కడినించి వచ్చారు? ఇది నీ పనే. ఉన్నది వున్నట్టు చెప్పుతావా, లేక ముందు నిన్నే యిక్కడ బలి ఇచ్చేయమంటావా?" అని గద్దించాడు.

తొణకలేదు గెడ్డపువాడు. "కేకలవల్ల ప్రయోజనంలేదు. ఈ పని నేను చేశానని కదూ, నీ అనుమానం? ఒక్క క్షణం ఆగి, చెప్పేదంతా విను. ఆపైన నీ యిష్టం వచ్చినట్లు చెయ్యి" అన్నాడు కరుకుగా.

"చాల్లే. యేర్పాట్లన్నీ సిద్ధం చేసుకువస్తే అవన్నీ మంటగలిపావు. అవేదో త్వరగా అఘోరించు" అన్నాడు, ఆ చెట్టుని అమాంతం కింద పడవేస్తూ.






"వాళ్లకి ఈ అంగవైకల్యం ఎలా ఏర్పడిందో నాకూ తెలియదు. ఐతే, ఒకలాగా జరిగివుండవచ్చని నాకు తోస్తున్నది. ఇలా చేయగలిగిన ప్రజ్ఞ తప్పించుకుపోయిన ఆ ఉదయనుడికే వున్నది. కవలలకు నేను దృష్టిలోపం పోగొట్టినప్పుడు ఈ రహస్యం కాస్తా చెప్పివేశాను. అందుకు కావలసిన అంజనాలూ అవీకూడా వాడివద్దనే వుండిపోయినై. వాడు బ్రతికేవుంటే ఎప్పుడో ఒకప్పుడు నీకు చిక్కకపోడు. అప్పుడు వాడిచేతనే వీళ్లకి మళ్ళీ ఈ అంగవైకల్యం పోగొట్టించవచ్చు. అప్పటిపరకూ ఈ కుర్రవాళ్లను బంధించి వుంచు. ఇదే నేను నీకు చెప్పగల సలహా. తరువాత నీ యిష్టం" అన్నాడు.

"సరే కానివ్వు. ఈసారి వాడు చిక్కాడా, చచ్చాడన్న మాటే! ముందు మీ సంగతి చూడాలి. పదండి" అంటూ రాక్షసుడు సంధ్యానిశీథులనూ, రాజభటులనూ, గెడ్డపువాడినీ ఒక్కత్రాటితో బంధించి తన వెంట లాక్కుపోయాడు.

ఇదంతా చూస్తూ ఉదయనుడు రాక్షసుని వెంబడిస్తూనే వున్నాడు. కొద్దిదూరం పోయి రాక్షసుడు ఒక ఆకులగుట్టదగ్గిర ఆగాడు, గెద్దరూపం పొంది విశాలమైన తన రెక్కలను విసురుగా ఆడించేసరికి ఆ ఆకులన్నీ చెల్లాచెదరైపోయి ఆ చోట భూమిలోకి ఒక ద్వారం ఏర్పడింది. రాక్షసుడు సంధ్యానిశీథులనూ, గెడ్డపువాడినీ, భటులనీ ఆ ద్వారంగుండా లోపలికి త్రోశాడు. వెంటనే మళ్లీ ఆకులు కూడదీసి ద్వారం మూసివేసి, కొలనువద్దకు వచ్చాడు.

అలంకరణ పూర్తిఅయిన కవలలను జాగ్రత్తగా చూస్తూవుండమని అక్కడి పరిచారకులనూ భటులనూ హెచ్చరించాడు. అంగవైకల్యం ఏర్పడిన సుహాసినీ, సుభాషిణీ, సుకేశినీలను ఎత్తుకొని గెద్దరూపంలో ఎగిరిపోయాడు. —[ఇంకా వుంది]









## 15

[గెడ్డపువాడిద్వారా కవల సోదరుల జన్మరహస్యం విన్నాడు రాక్షసుడు, ఉప్పొంగిపోయాడు. అతడు తన బలికి కావలిసిన ఏర్పాట్లన్నీ చేయబోగా రాకుమార్తెలు వికలాంగులుగా మారిపోవటం, అదిచూచి వాడు ఉగ్రుడై గెడ్డపువాడినీ, సంధ్యా నిశీధులనూ పాతాళభవనంలో బంధించివేయటం, కొలనుచుట్టూ కట్టుదిట్టమైన కాపలా ఏర్పాటు చేసి రూపుచెడిన రాకుమార్తెలతోసహా ఎగిరిపోవటం వరకూ చదివారు. అతర్వాత—]

ఉదయనుడు అలా అదృశ్యరూపంలోనే వుండి, ముందుగతి ఏమిటా అని తీవ్రంగా ఆలోచింపసాగాడు. పాతాళ భవనంలోకి పోదామంటే తన భస్మాలూ అంజనాలూ పనిచెయ్యవని రాకుమార్తెలు చెప్పేవున్నారు. అయినా అదీ చూదాంఅనే కుతూహలంతో ఉదయనుడు వెళ్లి ఆ ఆకులగుట్ట తొలగించాడు. అప్పుడు ఒక సొరంగం ఏర్పడి అందులో మెట్లు కనుపించినై. ఒక్కొక్క మెట్టే నెమ్మదిగా దిగుతూ పోయాడు. పదిమెట్లు దిగేసరికల్లా అదృశ్య రూపం పోయి మామూలు రూపం వచ్చేసింది. అయితే ఉదయనుడు జంకిపోయి అంతటితో ఆగలేదు. మరో పదిమెట్లు దిగాడు. అంతే. అడుగు ముందుకు పడలేదు. మెట్లు దిగువని భయంకరమైన రెండు సింహాలువున్నై. అంతకంటే భయంకరమైన సర్పాలు వాటి మెడకు చుట్టుకొని బుసలుకొడుతున్నై. ఇవి కంటబడగానే ఉదయనుడు క్షణమైనా అక్కడ నిలవలేదు. ఒక్క వురుకులో సొరంగంబైటికి వచ్చేసి, మళ్లీ అదృశ్యరూపం పొందాడు.








అనుకున్నాడు. అయితే చేసేదేముంది? ఎవరిని అడిగితే నిజానిజాలు తెలుస్తయి? అదృశ్యరూపం మార్చి మామూలుగా కనుపించాడా, రాక్షసపరివారం తనని పట్టేస్తారు. ఏదోవిధంగా కొలనులోకి చేరుకుని హంస రూపం పొందుదామన్నా కొలనుచుట్టూ అగ్నిజ్వాలలు భగభగ మండుతున్నై. ఇంత మాత్రానికే ఉదయనుడు నిరాశచెందుతాడా? ఈ సంగతి అలా వుంచుదాం.

రాక్షసుడు ఎత్తుకుపోయిన ఆ రాకుమార్తెల గతి ఏమైందీ అని యిప్పుడు ప్రశ్న. వాడు ఒక మహారణ్యంలో వాళ్లని వదిలేశాడు. ఊరికే అమట్టున వదిలేసినా బాగానే వుండును. తన మాయాభవనపు రహస్యాలు ఎక్కడ బయటపెడతారో అనే దురుద్దేశంతో వాళ్లని మూగవాళ్లుగా చేసివేసి, తనదారిని తను వెళ్లిపోయాడు. అసలే అంగవైకల్యం ఏర్పడివున్న రాకుమార్తెలకు యిలా మూగతనంకూడా ప్రాప్తించటంతో వాళ్లు తల్లడిల్లిపోయారు. ఎలాగో కష్టపడి ఆ అరణ్యం మధ్యనుండి బైటపడదామంటే కాలుపోయిన సుభాషిణీ, కళ్లుపోయిన సుకేశినీలతో సాగిపోవటం ఒక్క సుహాసినివల్ల నవుతుందా?

అక్కడినుంచి ఉదయనుడు సరాసరి కొలనువద్దకు వచ్చాడు. కొలనుచుట్టూ అగ్నిగుండాలు భుగభుగ మండుతున్నై. రాక్షసుడి పరివారం జాగ్రత్తగా కాపలా కాస్తున్నారు. వికారరూపులైన రాకుమార్తెలను రాక్షసుడు ఎత్తుకపోయిన సంగతి ఉదయనుడికి తెలియనే తెలియదు. ఐతే యదాలాపంగా లెక్కపెట్టేసరికి కొలనులో నలభైఎనిమిది హంసలకుబదులు యిప్పుడు నలభైఅయిదు మాత్రమే వుండటంచూచి సంశయంలో పడ్డాడు. లోపించిన ఆ ముగ్గురూ రాకుమార్తెలే అనీ, వారికి ఏదో ప్రమాదం సంభవించి వుంటుందనీ







అదృష్టవశాత్తు ఒకనాడు ఆ అడవికి ఒక మహారాజు వేటకు వచ్చాడు. రాకుమార్తెలను చూచాడు. అపురూపసుందరులైన ఆ పిల్లలకి యిలా అంగవైకల్యం ఏర్పడివుండటం గమనించి అతడు ఆశ్చర్యపోయాడు. "ఎవరు మీరు. ఎందుకని ఈ మహారణ్యం మధ్యని సంచరిస్తున్నారు?" అంటూ ప్రశ్నించాడు.

కాని రాకుమార్తెలు బదులు చెప్పలేక సంజ్ఞలవల్లనే తెలియచేయటానికి ప్రయత్నించారు.

వాళ్ల అవస్థచూచి రాజు "పాపం! మూగికూడానా!!" అంటూ జాలిపడ్డాడు. "చూడగా, మీరు ముగ్గురూ పెద్ద కుటుంబానికి చెందినవాళ్ళుగా కనబడుతున్నారు. ఏదో గట్టి కారణాలవల్లనే మీరు ఈ స్థితిలో ఉండివుండాలి. మీకు వచ్చిన భయమేమీ లేదు. నాతో వచ్చేయండి. మీ యింట్లో ఎంత స్వేచ్ఛగా ఉండేవారో అంత స్వేచ్ఛగానూ మీరు నా కోటలో ఉండవచ్చు. నేను మాళవదేశపు మహారాజును. నాపేరు ప్రతాపసింగు. ఈపేరు మీరు వినేవుంటారు' అని వాళ్లకు నమ్మకం కలిగేట్టుగా ధైర్యం చెప్పాడు.

ఇది వినేసరికి కష్టాలుపడుతూవుండిన రాకుమార్తెల ముఖాలు వికసించినై. ఒక్కసారిగా సిగ్గుతో వారు తలలు వంచుకున్నారు. వాళ్ల మౌనమే అంగీకారంగా తీసుకొని ప్రతాపుడు వాళ్లని గుఱ్ఱంమీద ఎక్కించి, తనుమాత్రం పాదచారిగా బయలుదేరాడు.

మరికొద్దిసేపటికి సుహాసినీ, సుభాషిణీ, సుకేశినీలతోసహా మహారాజు తన భవనం చేరుకున్నాడు. వెంటనే ఆస్థానవిద్వాంసుని రప్పించి రాకుమార్తెల వృత్తాంతం తెలుసుకునే మార్గమేదైనా వుందేమో ఆలోచించమన్నాడు.





ఆస్థానవిద్వాంసుడు బుద్ధిబలం అంతా వినియోగించి ఆలోచించాడు. రాకుమార్తె అను ముగ్గుర్నీ కూర్చోబెట్టాడు. కొంత ఇసుక తెప్పించి వాళ్లముందు పోయించి చదును చేయించాడు. సుహాసిని వేపు చూచాడు.

సుహాసిని కన్నీరు రాలుస్తూ 'చదువు నేర్చినవాళ్లము కాము' అని అర్థమిచ్చేటట్టు సంజ్ఞ చేసింది.

తనేదో గొప్ప ఆలోచన చేశాననుకున్న ఆస్థాన విద్వాంసుడు సుహాసిని ఇలా సంజ్ఞ చేయగానే ముఖం వేలవేశాడు.

'మహారాజా! నా బుద్ధికి తోచిన ఒక్క ఉపాయమూ ప్రయత్నించాను కాని ఫలితం దక్కలేదు. ఇంతకు మించి వేరేమార్గం కనుపించటం లేదుకూడా" అని విన్నవించుకున్నాడు ఆస్థానవిద్వాంసుడు, తన అసమర్థతకు సిగ్గుపడుతూ.

'సరే' నని ఆయనని పంపివేశాడు మహారాజు. ఆ వెంటనే దాసీలను పిలిచి, "ఈముగ్గురినీ ఏలోపమూ రాకుండా అతి జాగ్రత్తగా కాపాడుతూ వుండండి. అంతః పురంలోనే వుంచి కంటికి రెప్పలా చూడండి" అని అజ్ఞాపించాడు.



సుహాసినీ, సుభాషిణీ, సుకేశినీలు ఏ విధమైన యిబ్బందీ లేకుండా మహలులో ఉంటూవున్నారు.

* * *

ఉదయనుడు క్రిందటిమారు శ్రావస్తికి వెళ్లేటప్పుడు ఒక రాజ్యం మధ్యనించి పోవటం, అక్కడ ఒక అంధుడికి చూపు రప్పించటం, అది చూచి ఆ దేశపురాజు అతనిని తనవద్ద వుండిపొమ్మనటం జరిగిందికదా! - ఇప్పుడు మన రాకుమార్తెలను అడవిలో కలుసుకొని వారిని తన కోటకు తెచ్చి వుంచిన ఆ రాజే ఈ ప్రతాపుడు!!

మాటయిచ్చినప్రకారం ఉదయనుడు తనవద్దకు తిరిగి వస్తాడనీ, అప్పుడు అతని చేత ఈ ముగ్గురికీ అంగవైకల్యం పోగొట్టించ వచ్చుననీ రాకుమార్తెలను చూచిన క్షణ మందే రాజు మనసులో అనుకున్నాడు.

మరోవారానికల్లా ఉదయనుడే ఈ మహా రాజువద్దకు రావటం తటస్థించింది. తల వని తలంపుగా అతడు తనంతట తనే వచ్చేసరికి మహారాజు బ్రహ్మానందభరితు డయాడు. మాటప్రకారం ఉదయనుడు తన ఆస్థానంలో వుండిపోయేటందుకే వచ్చాడనుకున్నాడు ఆయన.




'మిత్రమా! — నీవు ఎప్పుడెప్పుడు వస్తావా? అని ఎదురుచూస్తూవున్నాం. ఇప్పటికైనా వచ్చావు. సంతోషమైంది. వెళ్లిన పని పూర్తి అయినట్టేనా?' అంటూ ఎదురువెళ్లి ఆప్యాయంగా సత్కరించాడు.

అందుకు ఉదయనుడు — "నేను తలపెట్టిన కార్యం యింకా పూర్తి కాలేదు. అందుకే తమ సహాయం కావలసి వచ్చాను" అన్నాడు.

"ఏమిటీ! నా సహాయమా? ఏమిటది? సంశయించక చెప్పవోయ్. నావల్ల ఏమి కావలసినా నీవు చెప్పి చేయించుకోవచ్చు" అన్నాడు మహారాజు.








అప్పుడు ఉదయనుడు తమ జీవిత రహస్యం బయలుపెట్టి, తను కవలలను వెతుక్కుంటూ బయలుదేరినప్పటినుంచి ఇప్పటివరకూ జరిగినదంతా వివరించాడు. తనవద్దవున్న అంజనాలూ, భస్మాలూ,— వాటి మహిమకూడా దాపరికం లేకుండా వెల్లడించివేశాడు.

శ్రద్ధగా విన్నాడు మహారాజు. "అయితే ఇప్పుడు నేను చెయ్యవలిసినది ఏమిటి?" అని ప్రశ్నించాడు.

అందుకు ఉదయనుడు "తమ ఆస్థాన చిత్రకారుణ్ణి ఒక్క పర్యాయం నాతో పంపాలి. వారంలోగా తిరిగి వచ్చేస్తాము" అన్నాడు.

సరేనన్నాడు రాజు. మర్నాడే చిత్రకారుని వెంటబెట్టుకుని ఉదయనుడు రాక్షసుడి భవనానికి చేరుకున్నాడు. తనపైనా చిత్రకారునిపైనా భస్మం చల్లాడు. ఇద్దరూ అదృశ్యరూపం పొందారు. రోజల్లా వాళ్లు కొలను ఒడ్డున వుండిపోయి మరునాడు తిరిగి మాళవరాజ్యానికి బయలుదేరారు.

బయల్దేరిన ఒకవారానికల్లా వారు రాజమహలు చేరుకున్నారు. చిత్రకారుడు తను తయారుచేసిన చిత్రాలన్నిటినీ వరుసగా పేర్చాడు. ఒక్కొక్క బొమ్మను పరిశీలిస్తూ, ఆ వెంటనే ఉదయనుడివైపు చూస్తూ వస్తున్నాడు. మధ్యలో ఒక బొమ్మవద్దకు వచ్చేసరికి చిత్రకారుడు ఉదయనుడివైపు చూచి, ఆ బొమ్మ ఉదయనుడి పక్కనే పెట్టి మళ్లీ చూచి, 'భేష్! ఇది మీకు సరిపోయింది. ఈ వేషం వేస్తే మిమ్మల్ని ఎవరూ పోల్చుకోలేరు" అన్నాడు.

"అవును" అన్నాడు ఉదయనుడు సంతోషంతో నిండిన హృదయంతో. ఆ వెంటనే ఉదయనుడికి రాక్షసుడి అనుచరులలో ఒకనిలాగా వేషం వేశాడు చిత్రకారుడు. ఒకటికి రెండుసార్లు ఉదయనుడు అద్దంలో చూచుకున్నాడు. "బలే, మహా








లాగా కుదిరింది" అనుకుని, మరునాడే రాజువద్ద సెలవు తీసుకుని, తిరుగా కొలనుకు బయలుదేరాడు.

కొలను చేరుకుంటూనే తనవద్దనున్న భస్మంకోసమని ఎప్పటిలాగా అలవాటు ప్రకారం తడివి చూచుకున్నాడు. కాని, అయ్యో! భస్మం లేదే!

అయితే గత్యంతరం ఏమిటా అని నిశ్చయించుకొని, మరుక్షణమే ధైర్యం తెచ్చుకున్నాడు. చీకటిపడేవరకూ ఎవళ్లకంటా పడకుండా ఒక పొదమాటున నక్కి దాక్కొని వున్నాడు.

చీకటిపడింది. రాక్షసుడి పరివారంలో మరికొందరు కొలనుదగ్గిరికి వచ్చి అంతకు ముందు అక్కడ కాపలాకాస్తున్న జట్టును విడుదల చేశారు. విడుదలైనవాళ్ళు పాతాళ గృహం చేరుకుని ఒక్కొక్కరే లోపలికి ప్రవేశించారు. చిట్టచివరివాడు గృహం లోపల ప్రవేశించబోయే సమయంలో ఉదయనుడుకూడా యుక్తిగా అతనివెంట లోపలకు దూరాడు.

తన మాయవేషం ఎక్కడ పట్టుబడి పోతుందో అని ఉదయనుడు లోలోపల జంకుతూనే వున్నాడు. అయితే దైవవశాత్తు ఇంతవరకు అలాటిదేమీ జరగలేదు. ఏమీ అంటే—వేషం చూడగా అతడు తమలో వాడే ననుకున్నారు తక్కినవాళ్లు.

ఈసారి ఉదయనుడు మెట్లన్నీ దిగి ఆ సింహాల పక్కగానే పోయాడు. జట్టులో కలిసిపోయి వుండటంవల్ల ప్రత్యేకించి అవి తనను పసికట్టలేవని ఉదయనుడి ధైర్యం. అయితే అవి కొత్తమనిషిని ఇట్టె పసికట్టినై. పసికట్టడమేమిటి? ఒక్కసారిగా ఉరికి పైబడి చంపబోయాయి. కెవ్వున కేకవేసి ఉదయనుడు పడిపోయాడు.

ఇది చూచి, తక్కినవాళ్లంతా పరుగెత్తుకు వచ్చి, ఒక్కవేటుతో సింహాలు రెండింటినీ





నరికివేశారు. తరువాత ఉదయనుడిని వెంటదీసుకువెళ్ళి చుట్టూ గుమికూడారు. "మనల్నే మాటు వెయ్యబోయినయే ఈ సింహాలు. ఎంత పొగరు! మంచి బాగా శాస్తి చేశావులే" అని సింహాలను చంపిన వాడిని మెచ్చుకున్నారు.

తరువాత వాళ్లు ఉదయనుడికి పరిచర్య చేశారు. గాయాలకు కట్టు కట్టారు. కాస్తంత తేరుకున్న వెనక "తమ్ముడూ!—నీ గాయాలు పూర్తిగా మానిపోయేవరకు రెండు రోజులపాటు నువ్వు యిక్కడే వుండు. అంతవరకు కాపలా పని మేము చూచుకుంటాంలే" అన్నారు.

"అయితే మరొక్క ఉపకారం చేసిపొండి. నేను కాలు కదపలేకుండా వున్నాను. కనుక నా తిండి ఏర్పాటు కూడా చేసిపోండి, మీకు పుణ్యం వుంటుంది" అన్నాడు ఉదయనుడు.

'దానికే' మంటూ వాళ్లు ఉదయనుడికి మాంసమూ, కల్లూ తెచ్చి యిచ్చారు. తరువాత తిండికి, పడకకూ సదుపాయంచేసి ఎవరిదారిన వాళ్లు వెళ్లిపోయారు.

తెల్లవారింది. రాక్షసుడి పరిచారకులు కొలనుకు బయలుదేరివెళ్లి అక్కడి కాపలా వాళ్లను విడుదలచేశారు. మరికొద్దిసేపటి కల్లా వాళ్లు ఉదయనుడిదగ్గరికి వచ్చి, "అదృష్టవంతుడివిరా తమ్ముడూ!" అని ఆనందించారు. రాత్రల్లా కాపలా కాసి వుండటాన వాళ్లు మరికొంచెంసేపటిలోనే గుర్రుకొట్టి నిద్రపోసాగారు.

సరీగా అర్ధరాత్రివేళ రాక్షసుడు వచ్చేశాడు. వస్తూనే మెట్లకింది సింహాలు రెండూ చచ్చిపడి వుండటం చూచాడు. "ఎవడిదిరా ఈపని?" అని బొబ్బలు పెట్టుకుంటూ ఉదయనుడు పడుకొనివున్న చోటికి వచ్చాడు. —(ఇంకావుంది)








## 16

[రాకొమార్తెలను రాక్షసుడు మూగిగా చేసి అరణ్యంలో వదిలేశాడు. ప్రతాపరాజు వచ్చి చూచి, వాళ్ళను తీసుకపోయి కాపాడుతున్నాడు. వారి ఆస్థాన చిత్రకారుని సహాయంతో ఉదయనుడు ఒక కాపలావాని వేషం వేసుకొని, పాతాళ గృహంలోకి పోబోగా, ద్వారం వద్ద సింహాలు వానిమీద ఉరికినై. తోడిపనివాళ్లు వాటినిచంపి, వానిని రక్షించారు. రాక్షసుడు గర్జిస్తూ ఉదయనునివద్దకు రావటం వరకు చదివారుకదూ? అతరువాత—]

రాక్షసుడు పెడబొబ్బలు పెట్టాడు. "ఎవడురా ఈపని చేసిందీ?" అంటూ వాడు తనవేపు రావటం చూచి ఉదయనుడు గజగజలాడిపోయాడు. ఏదో జవాబు చెబుదామనుకునేటంతలో రాక్షసుడి పరిచారకులు ఒక్క పరుగున వచ్చి అక్కడ చేరుకున్నారు. సింహాలను చంపినవాడు చేతులు కట్టుకు నిలబడి "నేనేబాబయ్యా, ఈ పని చేసింది. మన భవనంలో ఉంటూ మన చేతికింద పెరుగుతూ అవి మనల్నే మాటువెయ్యజూచాయండి. నేనేగనక సమయానికి అదుకోకపోయినట్టయితే ఈపాటికి పాపం, వాడు యమలోకానికి పోయేవాడే" అని విన్నవించుకున్నాడు.

అందుకు రాక్షసుడు "ఆఁ, అలాగా! మాంచి పనిచేశావు. ఈసింహాలకు కొంచెం కొవ్వెక్కినట్టుంది. తక్కినవాటికి ఒక వారంరోజులపాటు కడుపు ఎండకట్టండి, అవే దారికొస్తయ్" అంటూ అక్కడినుంచి చరచర వెళ్లిపోయాడు. అప్పటికిగాని ఉదయనుడికి ప్రాణాలు కుదుటబడలేదు. ఏమీ ఎరగనట్టు పడుకున్నాడేకాని, రాక్షసుడు ఎటు పోయిందీ ఒకకంట కనిపెడుతూనే వున్నాడు ఉదయనుడు.







హాలు చివర ఒక పెద్ద ద్వారంవద్దకు వెళ్లి, రాక్షసుడు మొలలోనించి చిన్న తాళపుచెవి ఒకటి తీసి ఏదో మంత్రం చదివాడు. మంత్రం చదవటం పూర్తి అయే సరికి ఆ చిన్న తాళపుచెవి కాస్తా ఏడు అడుగుల పొడుగున పెరిగిపోయింది. అప్పుడు రాక్షసుడు దానితో ఆ ద్వారం తలుపులు తెరిచి లోపల ప్రవేశించాడు.

ఉదయనుడు ఆలోపల ఏమున్నదో లేచి వెళ్లి చూదామనుకున్నాడు. కాని, పట్టుబడిపోతే ప్రాణాలు దక్కవే? అందుకని ఏమి జరిగేదీ జాగ్రత్తగా కనిపెడుతూ అలానే పడుకుండిపోయాడు.

మరి కాసేపటికల్లా రాక్షసుడు బయటికి వచ్చి, యథాప్రకారం తలుపు మూసి వేశాడు. మళ్లీ మంత్రం ఉచ్చరించేసరికి తాళపుచెవి తిరిగి చిన్నదయిపోయింది. అది బొడ్డులో దోపుకొని రాక్షసుడు వచ్చిన దారినే పాతాళగృహంలోంచి బయటకు వెళ్లిపోయాడు.

మిగతా పరివారం తిరిగి ఎవరి చోట్లకు వారు వెళ్లి గుర్రుకొట్టి నిద్రపోసాగారు. ఈ అదునులో ఉదయనుడు మెల్లగా లేచి, రాక్షసుడు తెరచి మూసిన పెద్ద ద్వారం వద్దకు వెళ్లాడు. తాళపుచెవి దూర్చే బెజ్జం లోనించి తొంగిచూచాడు. చూడగా ఉదయనుడు తనకళ్లను తానే నమ్మలేకపోయాడు. ఎందుచేతనంటే తను ఎవరికోసమైతే తపించిపోతున్నాడో ఆ గెడ్డపువాడు అక్కడ తలక్రిందుగా వ్రేలాడతీయబడి వున్నాడు. సంధ్యానిశీధులు మాత్రం లేరు.

ఇది చూచేసరికి ఉదయనుడికి భయమూ ఆశ్చర్యమూ కలిగినై. సోదరులేమైనట్లు? గెడ్డపువాడిని కలుసుకోకలిగితే తెలుస్తుందేమో? కాని ఆ తాళపుచెవి లేకుండా లోపల ప్రవేశించటం ఎలా? ఏమీ పాలుపోయిందికాదు.









అలాగే కొంతసేపు ద్వారంవద్ద నిలబడి ఎంతకూ ఏమీ తోచక, అతను విసిగివిసిగి తన చోటుకు వచ్చి పడుకున్నాడు. పడుకున్నాడే కాని నిద్ర పట్టితేనా? ఆ గది ప్రవేశించటం ఎలాగ? గెడ్డపువాడిని కలుసుకోవటం ఎలా? సోదరులు ఏమయ్యారు? రాత్రంతా ఇదే ఆలోచన.

తెల్లవారింది. రాత్రి కాపలా కాసిన ఇట్టు తిరిగి పాతాళగృహం చేరుకున్నారు. వాళ్లు రావటంతోటే యిక్కడవున్న కాపలా వాళ్లు కొలనుకు బయలుదేరి పోయారు.

'ఆ' గదిలోకి ప్రవేశించే మార్గం మరేమైనా వుందేమో పరిచారకులను అడిగి తెలుసుకుందామా అని ఒక ఆలోచన కలిగింది ఉదయనుడికి. కాని వెంటనే ఒక సందేహంకూడా కలిగింది. ఈప్రశ్న అడగ్గానే తన మాయవేషం బయల్పడుతుందేమో! తను పట్టుబడిపోతాడేమో!! అందుచేత ఉదయనుడు ఆ ఆలోచన అంతటితో కట్టిపెట్టివేశాడు.

ఒక వారంరోజులకల్లా రాక్షసుడు తిరిగి వచ్చాడు. మునపటిలాగానే మొలలోనించి తాళంచెవితీసి మంత్రంవేసి పెద్దదిచేశాడు. గది తలుపులుతెరిచి లోపల ప్రవేశించాడు. ఉదయనుడుకూడా వానితోపాటు యుక్తిగా వాకిలి దాటి లోపల అడుగు పెట్టాడు. వాకిలికి ప్రక్కగా మనిషి నిలువుకు సరిపడే మూడు పెదపెద్ద బానలూ, వాటిపైన మూతలు వున్నై. మొదటిదానిపైన వున్న మూత తీశాడు ఉదయనుడు. దానిలో ఎవరో మనిషి వున్నట్టు కనుపించింది. గబుక్కున మూసివేశాడు. రెండో బాన తీసి చూచాడు. అందులోనూ అలాగే. అదీ మూసివేశాడు. మూడవబాన చూచాడు. ఖాళీగా వుంది. గుట్టు చప్పుడుకాకుండా దానిలోదిగి మూతవేసేసుకు కూర్చున్నాడు. ఇదంతా జరుగుతున్నప్పుడు రాక్షసుడు





ఎక్కడకు పోయాడో ఏమో ఉదయనుడికి తెలియనే తెలియదు.

మరికాసేపటికి రాక్షసుడు ఆ బానల దగ్గిరికి వచ్చాడు—'ఒకటీ...' అని అరుస్తూ మొదటి బానమీద మూత ఎత్తాడు. లోపలనున్న మనిషి లేచి నిలబడ్డాడు. రాక్షసుడు వాడిని జుట్టు పట్టుకుని బైటికి లాగాడు. తర్వాత 'రెండూ' అంటూ కేకపెట్టి రెండో బానమీద మూత ఎత్తాడు. దానిలోనున్న మనిషికూడా లేచి నిలబడగా వానినికూడా జుట్టు పట్టుకుని ఎత్తి బైటికి లాగాడు. వాళ్లని వెంటబెట్టుకుని గది బయటకు వచ్చేశాడు. తలుపులు ఎప్పటిలా మూసి తాళంచెవి మొలలో దోపుకొన్నాడు. వాళ్ల నిద్దరినీ చెరోగుప్పిటిలో పట్టుకుని పాతాళగృహంలోంచి బైటికి వెళ్లిపోయాడు.

ఉదయనుడు ఏమాత్రమూ ఆలస్యం చెయ్యలేదు. వెంటనే బానమూత ఎత్తి పైకి రాబోయాడు. కాని దిగటమంత తేలికగా కనపడలేదు పైకి రావటం. ఒక్క ఎగురు ఎగిరాడు. పైకంటా ఎగరలేకపోయాడు. బాన అంచు కాలికి తగిలి, దానితో సహా క్రిందపడ్డాడు. పడీ పడటంతోటే బాన ముక్క ముక్కలైపోయింది.






ఇలా ఉదయనుడు బయటపడ్డాడు. మరికొద్దిదూరంలోనే వ్రేలాడుతున్న గెడ్డపు వాడు కనుపించగా, ఒక్కపరుగున వాడి దగ్గిరికి వెళ్లాడు. "ఇదేమిటయ్యా ఈ శిక్ష? నా సోదరులు ఏమైనారు? చెప్పు. రాక్షసుడు రాకముందే నేను పోవాలి. చెప్పు. త్వరగా చెప్పు" అని తొందరపెట్టాడు ఉదయనుడు.

ఉదయనుడు మారువేషంతో వచ్చాడని గెడ్డపువాడు ఇట్టే గ్రహించాడు. "నువ్వేనటోయ్! గాభరాపడకు. వాడు యింకోవారం రోజులకుగాని రాడులే. ముందు నా కట్లు విప్పు చెబుతా" అన్నాడు.

గెడ్డపువాడికట్లు విప్పాడు ఉదయనుడు. బంధం విడగానే గెడ్డపువాడు యిలా చెప్ప సాగాడు—

"నువ్వు ఈలోపలకు రావటం, బానల మీది మూతలు తీసి చూడటం అంతా నేను గమనిస్తూనే వున్నాను. ఆ రెండు బానల లోనూ నీవు చూసిన మనుషులు ఎవరనుకున్నావు? వాళ్లే నీ సోదరులు. ఇంకా నయం, వాడు మూడో బానమీది మూత తియ్యలేదు. తీసినట్టయితే నీ గతి ఏమయ్యేదో" అని యింకా ఏమో చెప్పబోతుండగా ఉదయనుడు అడ్డుతగిలి:




"ఏమిటీ? వాళ్లు నా సోదరులా! సంధ్యా నిశీధులా!! ముందు వాళ్లని విడిపిద్దాం పద" అని వేగిరపెట్టాడు.

గెడ్డపువాడు విరగబడి నవ్వుతూ, "ఓరీ పిచ్చితండ్రీ! వాళ్లు యింకా వాటిలో వున్నారనుకుంటున్నావా? 'ఒకటీ, రెండూ' అని వాడు పిలవటం వినిపించలేదూ? వాళ్లని ఆ బానలలోంచి పైకి లాగి తనతో తీసుకొనే పోయాడు" అన్నాడు.

"ఎక్కడికి?" అన్నాడు ఉదయనుడు.

"నాకూ తెలియదు. బహుశా వాళ్లని ఆ కొలనులో వదిలి కాపలావాళ్లకు వప్పజెప్తాడోయేమో" అన్నాడు గెడ్డపువాడు.








"సరే కాని, ముందు ఈసంగతి చెప్పు: ఎందుకు నిన్ను యిలా తలక్రిందుగా వ్రేలాడదీశాడు? ఎందుకోసమని వాళ్లని ఆ బానలలో పెట్టాడు? అనాడు మిమ్మల్ని ఈ పాతాళగృహంలోకి తీసుకువచ్చిన తర్వాత ఏంజరిగింది?" అని ప్రశ్నించాడు ఉదయనుడు.

అప్పుడు గెడ్డపువాడు "ముందు పగిలిన ఆ బానముక్కలు దాచేసెయ్యాలి. తర్వాత మిగతా విషయాలు చెబుతాను" అంటూ వెళ్లి ఆ ముక్కలన్నీ ఎత్తాడు. తర్వాత గెడ్డపువాడు యిలా చెప్పసాగాడు: 'నీవు ఎక్కడికి పోయిందీ మాకు తెలిసి వుండికూడా మేము దాస్తున్నామనీ, ఆ సంగతి వెల్లడించేవరకూ మిమ్మల్ని నానా యాతనా పెడతాననీ బెదిరించాడు. అయితే మేము ఏమాత్రమూ సందివ్వలేదు. అప్పుడు వాడు మా ముగ్గురినీ ఆ మూడు బానలలోనూ పెట్టి బంధించాడు. అప్పటికీ నేను రహస్యం బైటపెట్టకపోయేసరికి నన్ను యిలా వ్రేలాడతీశాడు. అయినా నేను మొండిగా నీ సంగతి నాకు ఏమీ తెలియనే తెలియదని చెబుతూ వచ్చాను. నన్ను చేసినట్టుగానే వాళ్లనికూడా వ్రేలాడదీస్తాడనుకున్నాను. కాని అలా చేసినట్టు కనబడదు. మరి ఎక్కడకు తీసుకుపోయాడో, ఎందుకు తీసుకుపోయాడో నాకూ బోధపడటంలేదు" అన్నాడు.

తర్వాత ఉదయనుడు తను ఎలా మాయవేషం వేసుకుని అక్కడికి చేరుకున్నదీ సాంతంగా తెలియజేస్తూ భస్మాలూ, అంజనాలూ మొదలైనవి పోగొట్టుకున్న సంగతికూడా చెప్పాడు.

అంతా విని గెడ్డపువాడు, "వాటిని ముమ్మాటికీ ఆ రాజే కాజేసివుంటాడు. ఏదో ఒక ఉపాయంచేత యిక్కడినుంచి బైటపడి మళ్లీ ఆ రాజుదగ్గిరికి పోయి వాటిని





తిరిగి సంపాదించే మార్గం చూడాలి"
అన్నాడు. అదేప్రకారం గెడ్డపువాడూ ఉద
యనుడూ కలిసి యోచన చెయ్యసాగారు.

* * *

ఇది యిలావుంచి—అక్కడ మాళవదేశ రాజు ఐన ప్రతాపుని కోటలో మన రాకుమార్తెలు ముగ్గురూ ఎలా వున్నారో ఒక్కసారి చూదాం:

ఉదయనుడు యిక రేపు వెళ్లిపోతాడనగా ఆ రాత్రి అతడు గాఢమైన నిద్రలో ఉండగా చూచి ప్రతాపుడు భస్మాలూ, అంజనాలూ కాజేసి ఏమీ ఎరగనట్లు వూరుకున్నాడు. మర్నాడు ఉదయనుడు వెళ్లిపోగానే తనే స్వయంగా రాకుమార్తెలను చేరబిలిచి, అంజనాలూ భస్మాలూ ప్రయోగించి వాళ్ల అంగవైకల్యాలు పోగొట్టాడు. ఇప్పుడు వాళ్లు స్వస్వరూపంలో కనబడగానే వాళ్ల అందాలు చూచి తన్మయుడైపోయాడు.

'నన్ను వివాహం చేసుకోండి!' అని రాజు వాళ్లను కోరాడు. రాకుమార్తెలు ఒప్పలేదు. ప్రాధేయపడ్డాడు. లాభం లేకపోయింది. బెదిరించి చూచాడు. ఉహుఁ అన్నారు. ఇక యిది పనిగాదని "చేసు




కుంటానంటే సరేసరి, లేదా ఒప్పుకొనే వరకూ మీరు కారాగారంలో ఉండవలసిందే" అంటూ వాళ్లని బంధించివేశాడు. తలవని తలంపుగా ఈ అవాంతరం వచ్చిపడేసరికి రాకుమార్తెలు తిరిగి దుఃఖంతో కుమిలిపోసాగారు.

*

ఇక రాక్షసుడు వెంటపెట్టుకువెళ్లిన సంధ్యానిశీధుల సంగతి ఏమైందీ అని?—వాళ్లిద్దరినీ కొలనువద్దకు తీసుకువెళ్ళాడు. "ఆఖరుసారిగా మీకు అవకాశం యిస్తున్నా. మీ సోదరుడు ఎక్కడికి పారిపోయాడో యిప్పుడైనా నిజం చెప్పండి. లేకుంటే





మరొక్క క్షణంలో మీపుచ్చెలు ఎగిరిపోతై" అంటూ గండ్రగొడ్డళ్ళతో సిద్ధంగావున్న భటులను చూపించాడు.

సంధ్యా నిశీధులు ఒక్క క్షణం అలానే నిలుచుండిపోయారు. అప్పుడు నిశీధుడు—"అయ్యా! వాడు ఎక్కడికి పోయిందీ మాకూ తెలియదు. కాని యిక్కడినుంచి బైటపడితే ఎలాగో తిప్పలుపడి వాడిని వెతికి కలుసుకోగలమనే ఆశ నాకున్నది. కనుక మా మాటమీద నమ్మకముంచి మమ్మల్ని విడుదలచెయ్యి. త్వరలో నా సోదరునితో సహా తిరిగి వస్తాము" అన్నాడు.

"ఓహో, బలే పాచిక వేశావే! నీ దొంగవేషాలు నాదగ్గిర సాగవు. ఇదివరకు చేసిన మోసాలన్నీ మరిచా ననుకొన్నావా? నీవిక్కడకు తిరిగి వస్తావని నమ్మక మేమిటి?" అన్నాడు రాక్షసుడు.

అందుకు నిశీధుడు, సంధ్యనిచూపుతూ "ఐతే వీడిని నీదగ్గిరే బంధించి వుంచుకో. నీకోసం కాదనుకో, తోటి సోదరుని వదులుకోగల మనుకున్నావా? అతణ్ణి రక్షించుకోటానికైనా మేము తిరిగి నీ దగ్గిరికి రాక తప్పదుకదా?" అన్నాడు.

"సరే, మరొక విషయం. ముఖ్యంగా నేను నీసోదరుని పట్టాలంటున్నది ఎందుకో తెలుసా? ముఖ్యమైన భస్మాలూ, అంజనాలూ అతనివద్ద వుండిపోయాయి. అవి అతనివద్ద వున్నంతవరకూ నాకు నిద్ర పట్టదు. కనుక అతనే రానక్కరలేదు. నీవైనాసరే ఆ భస్మాలూ అవీ తెచ్చి నాకు వప్పగిస్తే చాలు. ఏనాడైతే ఆ పని చేస్తావే ఆనాడే ఈ నీ సోదరునికూడా విడుదలచేసి వేస్తాను,తెలిసిందా!" అన్నాడు రాక్షసుడు.

సంధ్యకూడా ఈపద్ధతికి ఒప్పుకున్నాడు. నిశీధుడు బయలుదేరాడు. మిగతా హంసలతోపాటు సంధ్యని కొలనులో వుంచమని చెప్పి భటులకు వప్పగించి రాక్షసుడూ వెళ్లిపోయాడు. —[ఇంకా వుంది]








## 17

[ఎలాగో గెడ్డపువాడిని కలుసుకున్నాడు ఉదయనుడు. అంతలో రాక్షసుడు రాగా ఒక బానలో దూరాడు. అక్కడ ప్రతాపుడు—తనను పెళ్లాడుమని రాకుమార్తెలను నిర్బంధింపసాగాడు. రాక్షసుడు ఉదయనుణ్ణి పట్టితెమ్మని నిశీధుడిని పంపాడు తరువాత—]

ఉదయనుడిని వెతికిపట్టి, అతనివద్దనున్న భస్మాలూ, అంజనాలూ తెచ్చి తనకు వప్ప చెప్పమని రాక్షసుడు నిశీధుడిని వసిలి పెట్టి పంపేటప్పుడు అధివరకు రాకుమార్తెలను చేసినట్టుగానే అతనినికూడా మూగి చేసి మరీ వదిలాడు.

నిశీధుడు పోయిపోయి చివరకు మాళవ దేశం చేరుకున్నాడు. ఉదయనుడికీ నిశీధుడికీ ఏమాత్రమూ తేడా లేక, ఇద్దరూ అచ్చుమచ్చు ఒకే పోలికగా వుంటారు కనుక అతనే ఉదయను డనుకొని అక్కడి ప్రజలు ఎంతో అదరంతో అతనిని తమ రాజువద్దకు తీసుకుపెళ్లారు.

ప్రతాపుడుకూడా ఆ వచ్చినది ఉదయనుడే ననుకున్నాడు. తను భస్మాలూ అంజనాలూ కాజేసినందుకుగాను కక్షగట్టి వాటిని తిరిగి లాగుకోవాలనే వుద్దేశంతో వచ్చాడనుకొని మనసులో భయపడ్డాడు. ఐతే పైకి మాత్రం ఏమీ ఎరుగనట్లు నటించి, "ఏమోయ్! నీవు వెళ్లిన పని కాయా, పండా?" అని ఆప్యాయంతో ప్రశ్నించాడు.

ఆ దేశానికి తను అంతకుమునుపు ఎన్నడూ రాకపోయినా, అక్కడి ప్రజలూ, ఆ రాజూ తనని యిలా ఎందుకు ఆదరిస్తా వున్నారో నిశీధుడికి ఏమీ బోధపడింది కాదు. పోనీ "మీరు ఎవరిని చూచి








ఎవరనుకుంటున్నారో" అని. అందామంటే తనకి మూగతనం సంప్రాప్తమయ్యె! ఏమిటి చెయ్యటమా అని ఆలోచించి చివరకు సంజ్ఞవల్ల తను మూగవాడినంటూ రాజుకి తెలియజెప్పాడు.

రాజుకి ఆశ్చర్యంవేసింది. "అదేమిటి ఉదయనా? నీవు క్రిందటిమారు వెళ్ళేటప్పుడు సలక్షణంగా వెళ్ళితివికదా! యిప్పుడు మూగవాణ్ణి అయానంటావేమిటి?" అన్నాడు విస్తుపోతూ.

'ఉదయనా' అని ఎప్పుడైతే రాజు అన్నాడో, నిశీథుడికి అంతా అర్థమయిపోయింది. వ్రాతపరికరాలు తెప్పించుమని సంజ్ఞచేశాడు. అవి రాగానే, తను ఉదయనుణ్ణి కాననీ, ఉదయనుడు తన సోదరుడేననీ, ఉదయనుడి జాడ తెలియకనే తను యిలా బయలుదేరి వచ్చాననీ, తన సోదరుడు ఎక్కడున్నదీ తెలియజేస్తే సంతోషిస్తాననీ వ్రాశాడు.

రాజుకి అంతా అర్థమైంది. తన బండారం ఎక్కడ బయటపడుతుందోనని భయపడిపోయాడు. ఒక్క ముక్కలో చెప్పాలంటే, రాజుకు పచ్చివెలక్కాయ గొంతున పడ్డట్టయింది. "ఎలాగో ఉదయనుడిని మోసపుచ్చి భస్మాలూ, అంజనాలూ కాజేసి వాడి పీడ వదిలించుకున్నానుకదా అని సంతోషిస్తే, మళ్లీ వీడు తయారయాడే! ఉదయనుడి వివరాలు నాకు తెలిసినట్టు వీడికి చెపితే ప్రమాదం కోరి తెచ్చుకున్నట్టవుతుంది" అనుకున్నాడు.

ఇప్పుడు రాజుకి మరో దుర్బుద్ధిపుట్టింది. "ఉదయనుడెలాగో ఈపాటికి రాక్షసుడి చేతిలో చనిపోయేవుంటాడు. వీడినికూడా కడతేర్చానంటే ఇక మిగిలిందల్లా మూడోవాడు. వాడూ ఎప్పుడో నా చేతిలో చిక్కపోగలడు. అప్పుడు యిక రాకుమార్తెలకు వేరే మార్గం ఉండదు" అనుకున్నాడు.









ఇలా అనుకుని, నిశీధుడితో "అబ్బాయ్! మీ సోదరుడు యిక్కడకు వచ్చినమాట అయితే నిజమే. కాని అతను యిక్కడ ఒక్కపూట మాత్రమే వున్నాడు. ఆతర్వాత అతని దారిని అతను వెళ్లిపోయాడు. ఎక్కడికి వెళ్లాడో నాకూ తెలియదు. అయితే, ఈ కష్టదశలో నీకు నేను చెయ్యగలిగిన సహాయం అంతా చేస్తాను. ఉదయనుడిని వెతకటంలో నీకు సహాయం కావాలంటే నా సేవకులలో ఒకరిద్దర్ని వెంటపంపు తాను" అన్నాడు.

అంతే చాలునన్నట్లుగా నిశీధుడు తల వంచి నమస్కరించాడు. ఆవెంటనే రాజు తన మంత్రిని రహస్యంగా పిలిచి "ఈ కుర్రవాడి వెంట మన భటులనిద్దర్ని పంపించు. ఊరివెలుపలకు చేరుకోగానే మూడో కంటికి తెలియకుండా సఫాచేసి వెయ్యకుమ" అని చెప్పాడు.

మంత్రి నిశ్చేష్టుడయ్యాడు. కాని రాజాజ్ఞ పాటించకపోతే ముందు తన తల ఎగిరిపోతుందే! చేసేదిలేక రాజాజ్ఞప్రకారం యిద్దరు భటులను తోడిచ్చి నిశీధుడిని సాగనంపాడు.

* * *

అక్కడ ఉదయనుడి సంగతి — యింక రెండు రోజులలో రాక్షసుడు తిరిగి వస్తాడు. ఈలోగా, వాడికి అనుమానం కలగకుండా ఏదో ఒకటి చెయ్యాలి. గెడ్డపువాడితో సంప్రతించినమీదట వాడు "నన్ను ఎప్పటిలా వ్రేలాడదియ్యి. నువ్వు మాత్రం వాడు వచ్చేటప్పటికి ఏదో ఒకమూల జాగ్రత్తగా నక్కివుండు. అదును చూచుకుని బైటికి జారుకో. ఆ తరువాత తక్కిన కాపలా వాళ్లతోపాటుకలిసి నువ్వు కాపలాకుపోయి నీ సోదరులు ఏమయ్యారో కనిపెట్టు. ఇప్పుడు వెంటనే చెయ్యవలిసింది యిదే" అన్నాడు గెడ్డపువాడు.









"మరి వాడు వచ్చి, మూడో బాన ఏదీ అని అడుగుతాడేమో ఒకవేళ?" అన్నాడు ఉదయనుడు.

"దానికి ఒక ఉపాయం ఉందిలే. మనం పోగుచేసిన పెంకులన్నీ మళ్లీ తెచ్చి యిక్కడ పోద్దాం" అన్నాడు గెడ్డపువాడు.

అదేప్రకారం పెంకులు తెచ్చిపోశారు. రాక్షసుడు యిక రేపు వస్తాడనగా ఉదయనుడు గెడ్డపువాడిని ఎప్పటిలా వ్రేలాడతీసి తను ఒకమారుమూల నక్కిఉన్నాడు.

అనుకున్నట్టే మర్నాడు రాక్షసుడు వచ్చాడు తలుపు తెరుస్తూనే మూడవ బాన ముక్కలై వుండటం చూసి, "ఇది ఎవరి పనిరా" అని పెడబొబ్బలు పెట్టుకుంటూ గెడ్డపువాడిదగ్గిరికి వచ్చాడు.

గెడ్డపువాడు ఏమీ తొణకకుండా "నేనే బాబయ్యా! వేలాడి వేలాడి విసుగుపుట్టి, కాసేపు ఊగుదామనిపించి ఊగటం మొదలెట్టానండి. నాకు తెలియకుండానే బ్రహ్మాండంగా ఊగానండి. ఆ వూపులో నేను వెళ్లి ఆ బానకు కొట్టుకున్నానండి. అది కాస్తా క్రిందపడి యిలా ముక్కలై పోయిందండి. మన్నించాలి!" అన్నాడు.

"అఘోరించలేకపోయావ్!" అని విసుక్కున్నాడు రాక్షసుడు.

ఈ గొడవ జరుగుతున్నప్పుడే ఉదయనుడు చల్లగా జారుకున్నాడు. పగటికాపలా జట్టువాళ్లు కొలనుకు బయలుదేరుతుంటే, వాళ్లతోపాటు తనూ వెళ్ళాడు. ఆరోజున మాటలసందర్భంలో తెలుసుకున్నాడు— తనను వెతికి పట్టటానికి నిశీధుడు రాక్షసుడిచేత పంపబడ్డట్టూ, సంధ్య ఒక్కదే కొలనులో వున్నట్టూను.

ఇది తెలిసేసరికి ఉదయనుడు తెల్లబోయాడు. తను ఇక్కడేవుంటే, తనకోసం నిశీధుడు ఎక్కడని వెతికి పట్టగలడు? అతను ఎక్కడికి పోయినట్టు? ఎలాగయినా








అతనిని కలుసుకోగలిగితే బాగుండును. కాని అదెలా సాధ్యం? ఏమీ పాలుపోయింది కాదు. అందుకు ఏదైనా ఉపాయం చెబితే గెడ్డపువాడే చెప్పాలి అనుకున్నాడు.

అదే ప్రకారం ఆ సాయంత్రం తిరిగి పాతాళగృహం చేరుకోగానే ఒక్క పరుగున గెడ్డపువాడి గది దగ్గరికి వెళ్ళాడు. కాని చిత్రమేమిటో! గదితలుపులు బార్లగా తీసి వున్నై. గెడ్డపువాడూ లేడు, రాక్షసుడూ లేడు. దూలానికి కట్టిన త్రాడుమాత్రం వ్రేలాడుతూ వున్నది.

ఈదృశ్యం కంటబడగానే ఉదయనుడు నిలువునా నీరైపోయాడు. "నా ఆశలన్నీ గెడ్డపువాడి మీద పెట్టుకునివస్తే యిలా అయిందేమిటి? వాడు ఏమైనట్టు? ఈ వాలకమంతా చూస్తే, రాక్షసుడు గెడ్డపువాడి మీద మండిపడివున్నట్టు తోస్తుంది. గెడ్డపువాడిని హతమార్చలేదుకదా కొంపదీసి? లేదు. అలా జరిగివుండటానికి వీల్లేదు. గెడ్డపువాడు ఏదోతంత్రంచేసి వాడిని మాయ పుచ్చగలడు. ఇక్కడే మరి ఏగదిలోనన్నా బంధింపబడి వుండవచ్చు" అనుకుంటూ అక్కడి గదులన్నీ వరసగా గాలించటం మొదలుపెట్టాడు.

అలా వెతుకుతుండగా ఉదయనుడి కాలు నేలమీద ఒక మీటపైన పడింది. అలా పడగానే ఎదురుగా వున్నగోడ రెండుగా విచ్చి దారి ఏర్పడింది. ఉదయనుడు ముందుకు ఒక్క అడుగు వేశాడు. అంతే రెండవ అడుగు పడనేలేదు. ఎందుచేతనంటే: తన కెదురుగా ఒక పెద్ద బంగారు ద్వారం కనుపించింది. దానికి పైనుంచి భీకరమైన మూడు సర్పాలు బ్రహ్మాండంగా బుసలుకొడుతున్నై. గెడ్డపువాడు ఆలోపల వున్నాడేమో? కాని సర్పాల్ని తప్పించుకు వెళ్ళడమెలా? తీవ్రంగా ఆలోచించాడు. మెరుపులా ఒక ఉపాయం తట్టింది.







గెడ్డపువాడి గదిలో వున్న బాన ఒకటి నెమ్మదిగా దొర్లించుకు వచ్చాడు. బానలో దూరి మూతవేసుకుని ఒక్క విసురుతో బంగారుద్వారంలోంచి దూసుకుపోయాడు. మూత తొలగించి తొంగిచూచాడు. మరేం ప్రమాదం లేదనితోచి బైటపడ్డాడు.

ఆ గది చూచేసరికి ఉదయనుడి కళ్లు మిరుమిట్లుగొలిపినై. గదిగోడలూ, నేలా అంతా బంగారుమయమే. క్షణంసేపు విస్తు పోతూ అలాగే గదిఅంతా పరికిస్తూ వుండి పోయాడు. కాని అంతలోనే తను వచ్చిన పని గుర్తుకు వచ్చింది. గెడ్డపువాడికోసం మూలమూలలా వెతకసాగాడు. కను

పించలేదు. కాని అలా వెతుకుతుంతగానే అక్కడున్న మరో మీటపైన కాలుపడి, ఎదురుగావున్న గోడ యిదివరకటిలాగానే చీలి దారియిచ్చింది. క్రిందటిమారు జరిగి నట్టుగానే ఏదో చిత్రం జరుగుతుందనే కుంటూ అడుగు ముందుకు వేశాడు.

క్రిందటిమారులాగానే ఈసారి కూడా ఒక పెద్ద ద్వారం కనుపించింది. అయితే యిది వెండిద్వారం. దీనికి అరు సర్పాలు వ్రేలాడుతున్నై. ఒకసారి ఉపాయం కని పెట్టివున్నవాడే కనుక ఈమాటుకూడా బానలో దూరి ఈ ద్వారంలోంచికూడా దూసుకుపోయాడు.

కాని దురదృష్టవశాత్తు, ఈసారి బాన విసురుగా దొర్లుకుంటూ పోయి ఆ వెండి గదిగోడకి కొట్టుకుని ముక్కముక్కలై పోయింది. దానితో ఉదయనుడు బైట పడ్డాడు. గదిగోడలూ, నేలా అంతా వెండి మయమే. అయితే ఆ వింత చూస్తూ విస్తు పోతూ వుండిపోక ముందుకు పోయే మార్గమేమిటా అని వెతికాడు. కాని యిక్కడ మీట ఏదీ కనుపించలేదు. కాని గది పైకప్పునుంచి వెండి గొలుసు ఒకటి వ్రేలాడుతూ వున్నది. ఒక్క ఎగురు ఎగిరి








అది పట్టుకు లాగాడు. ఎదురుగావున్న వెండిగోడ చల్లగా పైకి లేచిపోయి దారి ఏర్పడింది. లోపలకు అడుగు పెట్టాడు. ఈసారికూడా ఒక పెద్ద ద్వారం కనుపించింది. ఐతే యిది రత్నాలతో పొదగబడిన ద్వారం. దీనిపైనుంచి పన్నెండు సర్పాలు వ్రేలాడుతున్నై.

ఇంతవరకూ బానలో దూరి ఎలాగో బంగారు ద్వారం, వెండి ద్వారం దాటుకొచ్చాడు. ఆ బాన కాస్తా పగిలిపోయిందాయే! ఏమిటి మార్గం? ఇలాంటివి యింకా ఎన్ని ద్వారాలు దాటాలో, యింకా ఎన్ని ప్రమాదాలు ఎదుర్కోవలసివుంటుందో? పోనీ యింతటితో వెనక్కి మరలి పోదామన్నా, మళ్లీ వెండి ద్వారందగ్గిర ఆరు సర్పాలూ, బంగారు ద్వారందగ్గిర మూడు సర్పాలూ తప్పించుకుని పోవటం ఎట్లా? పోనీ, తెగించి రత్నాల ద్వారం ప్రవేశించేందుకు ప్రయత్నిద్దామా అంటే ఒకటి కాదు, రెండు కాదు పన్నెండు సర్పాలనుంచి తప్పించుకోవాలాయె. ఎలా గండం గడపటం?

“ఏమిటా దారి, భగవంతుడా” అనుకుంటూ ఆ రత్నాలగదిలోనే కూర్చుని తీవ్రంగా ఆలోచించసాగాడు. కాని ఎంత ఆలోచించినా, ప్రాణాలకు తెగించి లోపలికి పోవటం తప్ప వేరే మార్గం కనుపించలేదు. అంటే, ముందు దానికి వ్రేలాడుతున్న సర్పాల్ని సంహరించాలి.

మారు ఆలోచన లేకుండా ఉదయనుడు సర్రున కత్తిదూసి వ్రేలాడుతున్న ఆ సర్పాలపైన ఒక్కవేటు వేశాడు. ఆ దెబ్బతో ఆరు సర్పాలతలలు తెగిపడినై. మరోదెబ్బ తీశాడు. ఈసారి అయిదింటి తలలెగిరిపోయినై. ఒక్కసర్పం మిగిలింది. దానికీ తెగటార్చితే ఇక నిర్భయంగా లోపల ప్రవేశించవచ్చుకద.





ఉదయనుడు గురిచూచి కత్తి విసిరాడు. కాని సర్పం ఈసారి దెబ్బ తప్పించుకొని ఒక్క విసురులో వచ్చి ఉదయనుడి చేతి మీద కాటువేసింది. చేతిలోని కత్తి కాస్తా క్రింద పడింది.

విషం ఎక్కిపోతున్నది ఉదయనుడికి. ముచ్చెమటలు పోసినై. ఆలస్యమైతే ప్రాణానికే మోసం. ఉదయనుడు, కత్తి తీసుకుని ఒక్క వ్రేటుతో చెయ్యి నరికివేసుకున్నాడు. మరోదెబ్బతో ఆ సర్పాన్నికూడా ఖండించివేశాడు. మరుక్షణమే స్పృహ తప్పి పడిపోయాడు.

అలా ఎంతసేపు పడిఉన్నాడో తెలియదు. తిరిగి స్పృహ వచ్చి చూచేసరికి తెగిన చేతినుండి కారిన రక్తం మడుగు కట్టివుంది. ఇంకా రక్తం కారుతూనే వుంది. ఏమిటి చెయ్యటం భరించటం తప్ప. బాధపడుతూనే ముందుకుసాగాడు.

కొంతదూరం వెళ్లేసరికి ఒక పెద్ద గుహ కనుపించింది. అందులో రాక్షసుడు కొలుస్తూవున్న దేవీవిగ్రహం కనుపించింది. దేవి మెడని నూటఒక్క పుర్రెలు వేలాడుతున్నై. నోటిలోనుంచి భుగభుగమంటూ అగ్నిజ్వాలలు వస్తున్నై. కళ్లల్లోనుంచి తీవ్రమైన వెలుగు, వెలుగులోనించి కిరణాలు వస్తున్నై. దేవి చెయ్యి చాచివున్నది. అరచేతిపైన ఒక గద్ద నిలబడివున్నది. దేవి విగ్రహమూ, ఆ వాతావరణమూ అంతా చాలా భయంకరంగా వున్నది.

అయినా ఉదయనుడు చలించలేదు. ధైర్యం కూడదీసుకుని విగ్రహం వైపుకి నడిచాడు. నాలుగడుగులు వేశాడో లేదో దేవి నొసటినుండి బ్రహ్మాండమైన పొగ వెలువడి గుహంతా ఒక్కసారిగా కమ్ముకున్నది. ఆ పొగలో ఉదయనుడు ఉక్కిరిబిక్కిరైనాడు. (ఇంకా వుంది)









## 18

క్రొద్దిసేపటికే పొగ మాయమైంది. మళ్లీ అడుగు ముందుకు వేసేసరికల్లా రకరకాల శబ్దాలతో గుహంతా మారు మ్రోగింది. ఐనా ఉదయనుడు చలించ లేదు. దేవికి ఎదురుగా నిలిచాడు. 'ఇందరు అమాయకుల ప్రాణాలను బలి కోరటం నీకు న్యాయమేనా తల్లీ! ఆ దుర్మార్గుడికి మరింతబలం ప్రసాదించటంలో లోకానికి మేలేమిటి తల్లీ?" అన్నాడు.

దేవి ఉలకలేదు; పలకలేదు.

"ఇంతవరకూ నిద్రాహారాలు లేక పడ రాని కష్టాలు పడ్డాము. ప్రాణాలు పోయినా సరే, వాడిని హతమార్చనిదే పోను. వాడి ప్రాణాలెక్కడున్నాయో చెప్పి పుణ్యం కట్టుకో!" అన్నాడు మళ్లీ ఉదయనుడు.

దీనికీ సమాధానం చెప్పలేదు దేవి.

ఇది పనిగాదని ఉదయనుడు దేవి చేతిలో వున్న గెద్దని తన కత్తితో ఒక్క వ్రేటుకి నరికివేశాడు. గెద్ద కాస్తా అగ్ని గుండంలో పడింది. అలా పడిందో లేదో దేవి విగ్రహం ఒక్కసారిగా మాయమై ఆ ప్రవేశమంతా బ్రహ్మాండమైన వెలుగుతో నిండిపోయింది.

ఉదయనుడు గిరుక్కున వెనుదిరిగి చూచాడు. అంతకుముందు తను దాటి వచ్చిన ద్వారాలూ, గదులూ ఏవీలేవు. అంతా ఒక ఎడారిలా తయారైంది.

ఉదయనుడు తిరుగుముఖం పట్టాడు. అంతకుముందు రత్నాల ద్వారం వున్న చోట రత్నాలతో పొదగబడిన ఒక బాతు గుడ్డువంటి గుడ్డు కనుపించింది. దానిని తీసుకుని మరికొంతదూరం వచ్చేసరికి







అలాంటిదే వెండిగుడ్డు కనుపించింది. అదీ తీసుకుని మరి కొంతదూరం వెళ్లేసరికి బంగారు గుడ్డు కనుపించింది. దానినీ తీసుకుని ముందుకు సాగేసరికి, గెడ్డపువాడు వేలాడతీయబడిన గడకూడా కనుపించకుండాపోయింది.

ఉదయనుడు విస్తుపోతూ పాతాళం లోంచి బైటికివచ్చాడు. అప్పుడే రాక్షసుడి సేవకులువచ్చి చుట్టుముట్టారు. వాళ్లతో పాటు కొలనులో హంసరూపంలో ఉంటున్న వాళ్లుకూడా మామూలు స్వరూపాలుపొంది వచ్చేశారు. సోదరుడు కనపడగానే సంధ్య ఒక్క పరుగున వచ్చి కౌగిలించుకున్నాడు.

ఇంతలో రాక్షసుడి సేవకులు ఉదయనుడిని అమాంతం భుజాలపైకి ఎక్కించుకుని "నీవు దేవుడవే, మారాజా! నీ ధర్మమా అని, ఇన్నాళ్లకు మాకు ముక్తి దొరికింది. నీ ఋణం ఎలా తీర్చుకొంటామో?" అన్నారు ఏకకంఠంతో.

ఒకడు ఉదయనుడి మోచేతిని కారుతున్న రక్తం చూచాడు. "చూస్తారేమ్రా! పసరు తెండి," అని కేకవేశాడు.

వాడు పసరు తెచ్చి చేతికి రాచి కట్టుకట్టాడు. అప్పడు ఉదయనుడు వాళ్లనందరినీ తీసుకుని కొలనువైపు వెళ్లాడు. తీరా చూడగా అక్కడ కొలనూ లేదు, చుట్టుప్రక్కల చెట్లూ లేవు తనలాగనే రాక్షసుడిని తెగటార్చటానికి వచ్చి శిలలుగా మారిపోయిన దురదృష్టవంతుల ప్రతిమలు మాత్రం నిలిచివున్నై.

ఉదయనుడికి ఏమీ అర్థం కాలేదు. 'కొలను ఏది?' అని అడిగాడు. "ఇంకా కొలను ఎక్కడుంటది బాబూ! దెవి మాయం కావటంతో అన్నీ మాయమయిపోయినై" అన్నాడు ఒకడు.

"మరైతే ఈ శిలాప్రతిమల గతేమిటి?" అని ఆత్రంతో ప్రశ్నించాడు ఉదయనుడు.





"అల్లగతి అంతే! కొలను కాస్తాపోయె! అల్లకు మామ్మూలు సరూపాలు ఎలా గొస్తయ్?" అన్నారు సేవకులు.

"అయ్యో! ఎంత దారుణం! నిష్కారణంగా యిందరి ప్రాణాలు హరించిపోవటానికి కారకుణ్ణయానే" అంటూ విచారించసాగాడు ఉదయనుడు.

అటుతరువాత, 'సోదరుడు నిశీధుడు ఏమయ్యాడో, ఆ గెడ్డపువాడు ఏమయ్యాడో. రాకుమార్తె లేమయ్యారో తెలియలేదు. తెలుసుకోవాలి' అన్నాడు ఉదయనుడు.

"మరి పదండి" అన్నారు సేవకులు.

"అలాకాదు. మీరంతా యిక్కడే ఉండండి" అని వాళ్లనక్కడ కాపలాపెట్టి సంధ్యనీ, యితర పరివారాన్నీ తీసుకుని, వెంటనే ఉదయనుడు బయలుదేరాడు. ముందుగా అతడు ప్రతాపుడి రాజ్యం చేరుకుని భోగట్టాచేశాడు.

"అట్నే ఎవరూ రాలేదు. నీవు అప్పుడు వెళ్లటం, నిన్ను మళ్లీ యిప్పుడే చూడటం. ఆ రాక్షసుడిని తప్పించుకుని ఎలావచ్చావోయ్?" అని ప్రశ్నించాడు ప్రతాపుడు.

"వాడిసంగతే తెలియలేదు. అయితే, వాడి మాయాభవనంమాత్రం మట్టిపాలు



చేసివేశాను. దానికేంగాని, ముందు నా సోదరులూ, రాకుమార్తెలూ ఏమయారో తెలుసుకోవాలి" అన్నాడు ఉదయనుడు.

"కావాలంటే నా పరివారాన్నికూడా పంపుతా" నన్నాడు రాజు ఎంతో దయతో.

'మీ అభిమానంవుంటేచాలు' అంటూ ఉదయనుడు ప్రతాపుడివద్ద సెలవుతీసుకుని మళ్లీ పరివారంతో సాగిపోయాడు.

* * *

ప్రతాపుని సేవకులను తోడుతీసుకువెళ్లిన నిశీధుడు ఏమయాడో తెలుసుకుందాం!

అదనుచూచి, ప్రతాపుడి సేవకులు నిశీధుని తల తెగవేసి ఒక అరణ్యంలో







పారవేసి చక్కాపోయారు. మరునాడు, ఆ చుట్టుప్రక్కల ఒక ఆశ్రమప్రాంతంలో వుంటున్న ఒక ఋషీశ్వరుడు ఆ దారిన వస్తూ, నిశీధుడి తలా మొండెమూ చూచాడు. వాటిని తన ఆశ్రమానికిచేర్చి, వాటికి సంబంధించినవాళ్లెవరైనా వస్తారా అని ఎదురుతెన్నులు చూస్తూ వున్నాడు.

కొద్ది రోజులకే దానశీల మహారాజు పంపిన ఆయన మంత్రి ఈ ఋషీశ్వరుని ఆశ్రమం చేరుకోవటం తటస్థించింది. నిశీధుని తలా మొండెమూ చూచి గుర్తుపట్టాడు. "అయ్యో! ఇదేమిఘోరం!!" అంటూ గుండెలు బాదుకున్నాడు.

"నాయనా! విచారించి ప్రయోజనం లేదు. దుఃఖించకు, నేనూ నీవెంటవస్తాను. కలసిపోదాం, పద. నేను చేయగల ఉపకారమల్లా ఒక్కటే: ప్రాణం పోయటం నాచేతకాదు. కాని, ఎంతకాలమైనాసరే: ఈ కళేబరము చెడిపోకుండా నిలవచేయగలను' అని ఓదార్చాడు ఋషీశ్వరుడు.

'అంతకంటె కావలసిందేమున్నది! ఈ ఆపదసమయంలో మీరు దేముడిలాగా వచ్చారు. మనం ఈస్థితిలో శ్రావస్తి చేరుకుంటేచాలు, తరువాత సంగతి ప్రభువులే ఆలోచించగలరు' అన్నాడు మంత్రి. అదేప్రకారం వారు శ్రావస్తి చేరుకొన్నారు.

నిశీథుని కళేబరంతోసహా లోపల ప్రవేశించేసరికల్లా అందరూ కొయ్యబారిపోయారు. సంధ్య, ఉదయనుడూ, వాళ్ల ముసలితల్లీ పేగులు తరుక్కుపోయేట్టు విలపించారు. రాజూ, పరివారమూ దుఃఖసాగరములో మునిగిపోయారు. ఋషీశ్వరుడు అందరనూ ఓదారుస్తున్నాడు. ఈ స్థితిలో గెడ్డపువాడుకూడా ప్రవేశించాడు.

ఐతే—గెడ్డపువాడు ఎటువంటి విచిత్రమైన పరిస్థితుల్లో ఇక్కడకు చేరుకొన్నాడో తెలుసా? వాడిని తన మాయాభవనంలో







వదిలితే ఏదో మాయోపాయం పన్నుతాడనీ, తనకు ముప్పుతెస్తాడనీ రాక్షసుడికి మొదటి నించీ అనుమానమే. అందుచేత సంచారానికి బయల్దేరినప్పుడు వాడినికూడా తనవెంట తీసుకపోయాడు.

ఒకసారి రాక్షసుడు గెడ్డపువాడిని వెంటబెట్టుకొని ఆకాశమార్గాన సంచరిస్తున్నాడు. దిగువఅంతా మహాసముద్రం. సరీగా ఇదేస్థితిలో ఉదయనుడు దేవిచేతిపైన వుండే గెద్దని పడగొట్టటం జరిగింది. ఇక్కడ ఉదయనుడు గెద్దను పడగొట్టడమేమిటి, ఆకాశమార్గాన గెద్దరూపంలో వున్న రాక్షసుడు నిజరూపంపొంది, హరీమంటూ సముద్రంలో పడి ప్రాణాలు విడవడమేమిటి? రెండూ ఒకేమాటుజరిగినై.

మరి—గెద్దతోపాటు మన గెడ్డపువాడూ ఉన్నాడుగా? వాడూ సముద్రమధ్యంలో పడ్డాడు. కాని, శ్రమపడి ప్రయత్నించి, రెండు రోజులపాటు ఈదుకొనివచ్చి కొనప్రాణాలలో ఒడ్డుకి చేరుకోగలిగాడు.

మాయాభవనం మట్టిపాలయిందనీ ఇక వివిధమైన బాధలూ ఉండవనీ గ్రహించాడు గెడ్డపువాడు. ముందు సంగతి యేమిటా అని యోచిస్తూ, తను చేరుకొన్న ఊరుఏదో అక్కడివాళ్లని భోగట్టాచేశాడు. అది శ్రావస్తి నగరమని వాళ్లుచెప్పగానే, అతని ఆనందానికి మేర లేకపోయింది.

కాని, వాడు ఎంతో ఉత్సాహంతో రాజభవనం ప్రవేశించేసరికల్లా అంతా గోలగోలగా వున్నదాయె! అయితేనేం?

ఎన్నెన్నో వ్యూహాలు ఛేదించుకువచ్చిన మొనగాడు గెడ్డపువాడంటే. ఖ్యాతిపొందిన రాక్షసుడిచేతిలోమసిలినవాడు. మామూలు మానవులలాగా ప్రతివిషయంలోనూ అధైర్యం చెందుతాడా? అందరినీ ఊరడించాడు. 'ఇప్పటివరకూ అంతా సవ్యంగానే నడిచింది. కంగారుపడవద్దు" అన్నాడు.







ఉదయనుణ్ని చేరబిలిచి చాడు 'అబ్బాయీ! ఇదంతా ప్రతాపుడి కుట్రే కాని వేరు కాదు. భస్మాలూ అంజనాలూ వాడే కాజేసివుంటాడు. ముందు వాటిని తిరుగా చిక్కించుకోవాలి ఈ పనిచూడు' అన్నాడు.

క్షణమైనా నిలవలేదు ఉదయనుడు. దాసశీల మహారాజుగారి సైన్యాన్ని తీసుకున్నాడు. గెడ్డపువాడిని వెంట బెట్టుకుని, మాళవరాజ్యం చేరుకున్నాడు. నగరం చూడబోతే—పందిళ్లతో, పచ్చటి తోరణాలతో కళకళ్లాడుతూ వున్నది. ఈ వేడుకంతా యేమిటీ అని భోగట్టావేయగా, ప్రతాప మహారాజులుంగారికి ఒక్కసారిగా ముగ్గురు మహారాణీలు రాబోతున్నారని, అబ్బురంగా చెప్పుకొంటున్నారు అందరూ.

గెడ్డపువాడు చెప్పిన సూచనలు అక్షరాలా నిజమయేటట్టుగానే తోచింది ఉదయనుడికి. ఆశ్చర్యంతో వాళ్ళు మహలు ప్రవేశించారు. పెళ్లిపీటలమీద వరసన సుహాసినీ, సుభాషిణీ, సుకేశినీలు ముగ్గురూ తీర్చికూర్చుని వున్నారు. కులుకుతూవున్న ప్రతాపుడు మూడు మంగళసూత్రాలు చేతపట్టుకొని వున్నాడు:

ఉగ్రమూర్తిఐనాడు ఉదయనుడు. ఒక్క లిప్తలో బాకుదూశాడు. కాని, గెడ్డపువాడు అడ్డుకొన్నాడు. అంతలోనే సైన్యమంతా కోటని ముట్టడివేసింది. ప్రతాప మహారాజుకి బేడీలు తగిలించగానే ఆయన తెల్లబోయి, నిశ్చేష్టుడయ్యాడు. చేసేదేమున్నది? కథ అడ్డం తిరిగింది !!

ప్రతాపుడు 'దాసోహం' అన్నాడు. తప్పులన్నీ వప్పుకొన్నాడు. కాజేసిన భస్మాలూ అంజనాలూ వప్పగించివేశాడు ఒక్క మాటలో చెప్పాలెనంటే, ఉదయనుడితోనూ గెడ్డపువాడితోనూ "బాబూ, మీ బానిసను. నా సర్వస్వము మీదే. మన్నించండి," అని క్షమాపణ చెప్పుకొన్నాడు.






ఎన్నో కష్టాలకోర్చి, గండాలు గడిచి, తమను రక్షించటానికి జీవితాలనే అర్పించటానికి సిద్ధపడిన సాహసుడు ఉదయనుణ్ణి చూడగానే రాకొమార్తెలు ముగ్గురకూ ప్రాణం లేచి వచ్చింది. చెప్పలేని ఆవేశంతో ఉదయనుడివద్దకు వచ్చారు. అప్రయత్నంగా జలజలమంటూ వారి కన్నుల వెంట ఆనంద బాష్పాలు రాలినై.



ఐతే—ఉదయనుడి చెయ్యి మొండిగా వుండటం వాళ్లు వెంటనే కనిపెట్టివేశారు. నిజానికి, ఈ సందడిలో అతని చెయ్యి సంగతి అందరూ మరిచేపోయారు. కాని, సారథిఐన గెడ్డపువాడు నించున్నపాటున పాతాళగృహానికిపోయి, అక్కడ పడివున్న ఉదయనుడిచేతిని స్వయంగా పట్టుక వచ్చాడు. అంజనాలు ప్రయోగించి చేతిని మామూలుగా అతికించివేశాడు.

మరొక చిత్రమేమిటంటే - రాకొమార్తెలను రాక్షసుడు మూగివాళ్లనుగా చేసి వదిలాడుకదా? అయితే, దేవిచేతిలో గెద్ద ఎప్పుడైతే పోయిందో రాక్షసుడు అప్పుడే పోయాడు. రాక్షసుడితోనే పోయినై వాడు ప్రయోగించిన మాయలన్నీ. ఆ మాయలలో ఒకటైన రాకుమార్తెల మూగతనమూ పోయింది. ఇప్పుడు వాళ్లు మామూలుగా చిలకల్లాగా మాటాడుతున్నారు.

ఈవిధంగా రాకుమార్తెలనేగాక మాళవ రాజ్యలక్ష్మినికూడా సంపాయించుకు వచ్చిన ఉదయనుడు అందరనూ వెంటబెట్టుకుని శ్రావస్తిలో అడుగుపెట్టాడు.

గెడ్డపువాడు భస్మాలు, అంజనాల ప్రభావంతో నిశీధుని తలా మొండెము అతికించి, జీవంపోశాడు.

రాజ్యంలోని ప్రజయావన్మందీ ఆనంద డోలికలలో తేలిపోయారు. రాజూ రాణీ 'కవలలఋణం ఎన్ని జన్మాలకైనా తీర్చుకోలే' మంటూ వాళ్లని వినుతించారు.





అప్పుడు కవలలు ముగ్గురనూ దానశీల మహారాజు చేరదీసుకుని, సుహాసిని చేతిని ఉదయనుడి చేతిలోనూ, సుభాషిని చేతిని సంధ్య చేతిలోనూ, సుకేశిని చేతిని నిశీధుని చేతిలోనూ ఉంచాడు. గురుతుల్యుడైన గెడ్డపువాడు దీవించగా, ముగ్గురు కవలలకూ ముగ్గురు రాకొమార్తెలకూ అతి వైభవంగా వివాహం జరిగింది.

తరువాత దానశీలమహారాజు గెడ్డపువాడిని మాళవదేశానికి అధిపతిగా ఉండమని కోరాడు. కాని సర్వసంగపరిత్యాగి, నిమిత్తమాత్రుడు ఐన గెడ్డపువాడికి రాజ్యాలెందుకు! ప్రతాపుడు పశ్చాతాపం తెల్పగా, అతనిరాజ్యం అతనికి తిరుగా ఇప్పించివేశాడు.

తరువాత మహారాజు తనరాజ్యాన్ని ముగ్గురు కవలలనూ పంచుకోమనికోరాడు. కాని, కవలలు ఎంతమాత్రమూ అందుకు ఆశపడలేదు. సర్వసమర్థుడైన ఉదయనుడు తను రాక్షసుడి భవనంలో చేజిక్కించుకొన్న గుడ్లు మూడూ బయటికితీశాడు. కొంతకొంత దూరాన విడివిడిగా గెడ్డపువాడి సలహామీద వాటిని మూడుచోట్లపెట్టి బద్దలగొట్టేసరికి, అక్కడ వరసగా వెండికోటా, బంగారు కోటా, రత్నాలకోటా మూడూ ఏర్పడినై. స్వయంగా నిర్మించుకొన్న ఆ కోటలలో కవలలు ముగ్గురూ సుఖంగా ఉంటున్నారు.

ఇంత హడావిడిలోనూ వారు ఒక్క విషయంమటుకు మరువలేదు. దుష్టరాక్షసుడి బలికి ఆహుతి అయి శిలలుగా మారినపోయిన ఆ ప్రతిమల సంగతి ఉదయనుడి మనసులో బాధిస్తూనేవుంది. ఆ మహావీరులకు స్మారకచిహ్నంగా ఒక చక్కటి భవనం నిర్మించి, ఆ భవనంచుట్టూ - ఈ ప్రతిమలను స్తంభాలుగా అమర్చాడు.

[విచిత్రకవలల కథ ముగిసింది]



